



సంపుటము 25 | సెప్టెంబరు, 1948 | సంచిక 9
సర్వధారి శ్రావణము


# అనునయము


శ్రీ సన్నిధానము శ్రీధరశర్మ


(పరిత్యాగం చేసి వెళ్లబోతున్న సిద్ధార్థుణ్ణిగూర్చి రథికుడైన చెన్నుని వచనాలు—)

ఈ వైరాగ్యము నీకు గల్గ గత మేమీ, యేల సంసారమం
దీ వైముఖ్య, మిదేల రాజ్యరమవైస్పృహ్యంబు నీ కిత్తఱిన్
ఏ వైరుధ్యము నాచరింపరుగదా యెవ్వారు నీయందునన్
దేవా, యిట్టి హఠాద్విరక్తికిని లేదే కారణం బేదియున్?

అకటా! యిదేమి గాఢమున నందరు నిద్దురజెంద, నొంటిగా
నొకరికినైన తెల్పక మహోగ్రత పుత్రుని బంధువర్గమున్
సకలము రాజ్యపట్టమును సర్వము త్యాగమొనర్చి యొక్క భి
క్షుకువిధమున్ వహించితివి, చూడగజాలను తావకస్థితిన్.

ఎన్నో నోములు నోచి నీ జనని నిన్నెన్నాళ్లకో గాంచె, తా
నెన్నన్ జాలని కూర్మి పెంచెనుగదా యిన్నాళ్ళు నీతండ్రియున్,
నిన్నే దైవముగా దలంచి మెలగెన్ నీపత్ని; వీరందఱన్
అన్నా! యెట్లు పరిత్యజించెదవు? త్యాజ్యం బిద్ది నీ కవ్విధిన్?

నీతోనే కల దెల్లలోక మని నిన్నే సర్వమం చెన్ని నీ
చేతన్ గల్గును భుక్తిముక్తు లని నిశ్చింతన్ భవత్తాత తా

చేతోమోదము నొందుచుండ, నిటు దాక్షిణ్యమ్ము బోనాడి యీ
రీతిన్ దుఃఖమునందు ముంచి చనదే వృద్ధాప్యమం దాతనిన్?

ఎన్నితపంబు లాత డొనరించెనొ నీకయి, యెట్టి ప్రేమతో
నిన్నత డెంచి పెంచె, నిక నీకయి సౌఖ్యము లెన్ని కూర్చెనో,
ఎన్నగ నాన జీవితము నెల్లను నీకయి జేసె త్యాగమున్
నిన్నిటు జూచు నీజనకునిన్ విడిపోవుట న్యాయమే ప్రభూ?

దైవ మటంచు నెంచి, భవతారక మంచు భవత్పదద్వయిన్
భావమునందు నిల్పు పతివత్ని, జగన్నుతసుందరాంగిలో
భావిభవాభిరామయగు భార్యను వీడఁగ భావ్యమౌనె, యిం
కే విధి తా భరింపగల దీదృశఘోరకుఠారఘాతమున్.

చిన్నతనంబునుండి నిను సేవలొనర్చుచు నీదు సౌఖ్యమే
యెన్నుచు నాదు సౌఖ్యముగ, నెల్లెడ నీ పదపద్మదాస్యమే
యెన్నుచు నాదు భాగ్యముగ నెంతయు మోదమునందు దాసునిన్
నన్ను ననుగ్రహింపగదె, నాదు మొఱన్ విను రాజనందనా.

అపరాధం బిది నాదె, నాకనులయం దల్లాడు దృశ్యం బదే
యిపుడున్, మూడు దినంబులన్ రథమునం దీ వేగ వాహ్యాళికై
యపు డా త్రోవ జరామయార్తశవదృశ్యంబుల్ గనన్ వచ్చె నీ
దుఃరిత్యాగము దీనిమూలమనుచున్ తోచున్ దృఢంబై మదిన్.

అడిగితి వీవు వీ రెవరటంచు, తదుత్తర మిచ్చితిం దగన్;
తడయక వెన్కకున్ వడి రథమ్ము మరల్పు మటంచు పల్కితే లోకో,
గడచెను మూడు రోజు లటు కారణ మప్పు డెఱుంగనైతి ని
ప్పుడు కనుపించు స్పష్టముగ, పొందితి పర్యవసాన మిట్టులన్.
తలపగనైతి నీ విధిని త్యాగ మొనర్తు వటంచు, నిట్టి నీ
పలుకులు హేతువౌ ననుచు భావ మొనర్పకయుంటి, స్వప్నమున్
గలుగదు దీనిగూర్చి, యెటు గాంతు విరాగిని నిన్ను నాదు చ
క్షుల, క్షమియింపుమీ, తిరిగి చూడుము, రమ్ము గృహంబు సేరగన్.
పొమ్మని యాన తిచ్చితివి, పోవగ నెట్లును కాళ్లు రావు, నే
నెమ్మెయి గాంతు నీజనకు, నెవ్విధి నీసతికిన్ వచింతు ఘో
రమ్మగు వార్త, శూన్యమగు రాజపురంబున కెట్లు బోదు, చే
కొమ్ము త్వదీయశిష్యునిగ కూర్మి భజింతును నిన్ను నిత్యమున్.
జాగు వల దింక మరలుమీ, చాలు సాహసంబు, సమ్రాట్టవై యేలు క్ష్మాతలంబు
సతిని సూనుని గ్రహియించి సౌఖ్య మందుమీ! భవద్దాసుని మొఱ నాలింపుమయ్య.

---

# ఆశ్వాసాంతపద్యాలు-మనుచరిత్ర

## శ్రీ కోట సుందరరామశర్మ

సాధారణంగా (తెలుగు) కావ్యాలు చదివే వారిలో అలవాటయిపోయింది ఏమిటంటే ఆశ్వాసాంతపద్యాలు ఇంచుమించుగా విడిచిపెట్టడం. దానికి కారణాలు బహుశః ఇవి అయి ఉండవచ్చు :

(౧) ఏ ప్రభువునో (కృతిభర్తను) దీర్ఘసమాస రచనలో కవి పొగడడం. అసామాన్యవిశేషణాలతో లోకోత్తరపురుషునిని చేసివేయడం. ఇట్టివి చదువరికి నచ్చకపోవచ్చు.

(౨) అందులో విషయం కథాభాగానికి సంబంధించకపోవడంచేత రసవంతమైన కథమీదికేగాని ఈ ఆశ్వాసాంతకవికర్మవైపు దృష్టి పడదు.

(3) అందలి దీర్ఘసమాసాలను అర్థంచేసుకొనే ఓపికకూడా అందరికీ ఉండదు.

(౪) ఆశ్వాసమంతా చదివి మనస్సుకు శ్రమ కలిగినమీదట వీటిని చదవడానికి అనవసరశ్రమ అని భావించడం.

ఇట్టి గతే ఆశ్వాసాదిపద్యాలకుకూడా పడుతున్నది. కాని సాధారణంగా ఆశ్వాసాదిని ఒక కంద పద్యం (సాధారణంగా) మాత్రం ఉండడంచేత అంతగా విసుగు పుట్టదు. చదువరికికూడా నవస్ఫూర్తి ఉండడం చేత చాలామంది చదువుతారు మొక్కుబడికి.

అయితే ఎవరికయ్యా వీని జోలి అంటే పరిశోధకులకు అని సమాధానం చెప్పవలసివస్తుంది.

అయితే వీటిలో ఉండే రసం, అందం సాధారణపఠిత ఏమైనా చేవిడుస్తున్నాడా అని ప్రశ్న. వాటిల్లో అందం తరిచిచూస్తే కదా తదనుభవం పఠితలకు కలిగేది ? కాబట్టి ఆశ్వాసాంతపద్యాలూ, ఆది పద్యాలూ కంత ఒక్కక్షణం ఆగి చూడవలసినవేమో!-

నిజానికి కవిదృష్ట్యా చూస్తే ఈ ఆద్యంత పద్యాలే తనకూ, అంతకంటే ముఖ్యంగా కృతిభర్తకూ ముఖ్యము. నిండు సభలో కృతిపతికి—ఒక సంపన్నునికి—గౌరవం తెచ్చి వానివల్ల గౌరవం పొందవలసిన కవి తన సామర్థ్యమంతా ఉపయోగించి నిగ్గుదట్టంగా, ఉదాత్తంగా పద్యాలు రచించాలికదా! తన యావచ్ఛక్తీ అక్కడ చూపిస్తాడుగదా! తద్రచనాసమయంలో సామాన్యపాఠకుని సంగతి అంతగా అతని మనస్సులో ఉండదు. నేటి సభలలోకూడా అంకితం ఇచ్చేటప్పుడు కథాభాగం అంతా చదవడం కుదరక కొంతభాగం నోటితో చెప్పివేస్తాడుగాని అంకితపు పద్యాలూ, షష్ఠ్యంతాలూ తప్పక సభాసదులకు చదివి వినిపిస్తాడు కవి.

ఇక ఈ ఆశ్వాసాంతపద్యాలలో ఎట్టి అందం ఉంటుంది అనే ప్రస్తుతాంశానికి వద్దాం. సంస్కృత కావ్యాలలో భిన్నవృత్తాంతము సర్గ అన్నట్లే ఆశ్వాసాంతంలో ఆంధ్రప్రబంధకవికూడా సంస్కృత వృత్తం అపూర్వంగా (సీసకందగీతాదులూ, ఉత్పల మాలాదులూ కాకుండా) ఒకటి నడుపుతాడు; ఉత్సాహం, కవిరాజవిరాజితము, భుజంగప్రయాతం, మాలిని మొదలయినవి.

మామూలుగా చదివే ఉత్పలమాలాదులకంటె చదువరికి ఇవి హాయిని కల్పిస్తాయి—కమ్మగా చదువుకొంటే ఈ వృత్తాలు. దీనిని వృత్తసౌందర్యం అందాం. శబ్దానికి సంబంధించినంతవరకూ ఈవిషయంలో నన్నయ సర్వసాధారణంగా ఒక కందమూ,ఒక వృత్తమూ వాడుతూవచ్చాడు. కవిత్రయం ఆశ్వాసాంతపద్యాలలో సంబుద్ధినే వాడింది. పింగళి సూరనాదులు కొందరుమాత్రము ప్రథమైకవచనమునే వాడారు.

అంతంత దీర్ఘసమాసాలు—స్తుతివిశేషణాలే కానివ్వండి—శబ్దాలంకారాలు లేకుండా ఉండవు కదా ! అవిన్నీ శబ్దసౌందర్యాన్ని అనుభవింపజేస్తాయి కదా ! అయితే అడగవచ్చు—వృత్తం, శబ్దం మొదలైనవి శరీరమాత్రమేగదా కావ్యానికి అని. అర్థసౌందర్యం ఈ ఆశ్వాసాంతపద్యాలలో ఏముందనీ. అంతకంటె ఎక్కువే మున్నదో అనీ జాగ్రత్తగా పరిశీలించి చూస్తే ఉత్తమకావ్యాల్లో ఈ ఆశ్వాసాంతాల్లో ఎంతో అందం అగుపిస్తుంది.

ఇప్పుడు మనుచరిత్రను ఈ దృష్టితో పరిశీలిద్దాము.

౧. ప్రథమాశ్వాసాంతము

శా. "గంగాస్వచ్ఛతరంగ భంగిక యశో
గాఢచ్ఛవిచ్ఛన్నసా
రంగాంకాంకనిరంకుశప్రతికళా
ప్రౌఢప్రియంభావుకా !
గాంగేయాచలచాపనూపురవచో
గాంభీర్యలీలాస్పదా!
బంగాళాంగకళింగభూపసుభటా
భ్రశ్రేణిఝంఝానిలా!"

కం. "మండలికతపనశోభిత !
కుండలిపతిశయన కర్ణకుండలితరసా
ఖండకవికావ్య ! దిగ్వే
దండశ్రుతిదళనకలహతాడితపటహా !"

ఉత్సాహము—
"కుకురుకాశకురుకరూశ కోసలాంధ్రసింధుబా
హ్లికశకాంగవంగసింహళేశకన్యకామణీ
ప్రకరపాణిఘటితరత్నపాదుకాకలాచికా
ముకురవీటికాకరండ ముఖ్యరాజలాంఛనా !"

దీనిలోని వ్యంగ్యార్థం చిత్తగించండి :

మొదటి ఆశ్వాసపు కథ ఏమిటి? ప్రవరుని వర్ణన, సిద్ధునిరాక, ప్రవరుని హిమగిరియాత్ర. రెండో ఆశ్వాసంలో కథ వరూథిని ప్రవరుల సమాగమము. మనుచరిత్రలో కంతటికీ రసవత్తరఘట్టం. (రసాభాసమా కా[illegible]?)

పై నుదాహరించిన మూడు పద్యాలలోనూ మొదటి పద్యం ప్రథమాశ్వాసంలోని కథనూ, రెండో ఆశ్వాసంలోని కథనూ కలిపి సూచ్యార్థసూచన చేస్తున్నది. విశేషణాలు నిజంగా కృష్ణరాయలకోసం వేసినవే కాని ఉత్తమకవి కథను విస్మరిస్తాడా ?

అంత గొప్ప అధ్యయనాధ్యాపనతత్పరుడయిన ప్రవరుడు తన కే కళంకమూ రానిచ్చుకోడు. కళంకం వస్తుందంటే తత్కారణాన్ని దూరంగా తరిమికేస్తాడు. ఓడించికేస్తాడు. ఎంతమంది ("వలిచట్టిరే బాడబులు" అన్న పద్యం చూడండి.) ఋషులుసయితం పప్పులో కాలువేశారు ! వాళ్ళకంటె ప్రవరు డెక్కువని కవి మనకు నిరూపించాలి. మచ్చ ఉన్నవాళ్ళందరికంటే గొప్పవాడని ఆ విశేషణంలోని ధ్వని—

"యశోగాఢచ్ఛవిచ్ఛన్నసారంగాంకాంక!"

ఇక రెండో విశేషణం: "ప్రతికళాప్రౌఢప్రియంభావుకా !"

టక్కులాడి వరూథిని మాయవేదాంతాన్ని త్రోసిపుచ్చుతాడు ప్రవరుడు. ఆదిశేషుని వచోగాంభీర్యం (గాంగేయాచలచాపనూపురం ఆదిశేషువు) పర్వతస్థిరత, శివసద్మ, ఫణిపతిపటిమ— ఇన్నీ తద్వచశ్శబ్దంవనుక కాచి రక్షిస్తున్నాయి. ద్రావిడప్రాణాయామంగా త్రిప్పిచెప్పాడనుకోకూడదు.

మూడవది: "అభ్రశ్రేణిఝంఝానిలా" అనడంలో వరూథినిని గాలి త్రోసివేసినట్లు త్రోసివేశాడన్నమాట.

ఇలా రెండాశ్వాసాలకూ మధ్యగా ఉభయ కథాభాగాలనూ ధ్వనితం చేస్తూ, మనోహరంగా వుంది ఈ పద్యం.

రెండవ పద్యం—

ఆవిధంగా వరూథినిమాయను (ఆమెనే) త్రోసివైచి శ్రోత్రియసంఘంలో ఢక్కా మ్రోగించినవాడు ప్రవరుడు. (దిగ్వేదండశ్రుతిదళనకలహతాడితపటహా !)

మూడవ పద్యం—

ఆయా దేశాల వనితలు తనకు సేవ చేస్తున్నట్లు (పాదుక లొకర్తు, తమ్మపడిగ యొకర్తె, ముకురం

షంకాకరిత, పీటికాకరంప మింకోర్తు) కృష్ణరాయనిని వర్ణించాడు కవి.

ఇందులో వరూథిన్యాద్యప్సరసలు ప్రవరునికి సేవకురాండ్రవలె కన్పించారు. కాని భోగ్యస్త్రీలుగా భావించరానివారైనారు. ఆమెభోగము తన కక్కఱలేదు. తనకు దారి చూపించవలసినది మాత్రమే ఆమె.

౨. ద్వితీయాశ్వాసాది

కం. "శ్రీఖండశీతనగము
ధ్యాఖండశోణిమండలాఖండల! వి
ద్యాఖేలనభోజ! సుధీ
లేఖద్రుమ! కృష్ణరాయ! లీలామదనా!"

తుది విశేషణంలో లీలాప్రియమైన వరూథినికి మన్మథునివలె ప్రవరు డగుపించాడని కవి సంకేతించాడు. ఆదివిశేషణంలోని పదం 'శీతనగం' రంగస్థలమును వ్యక్తపరుస్తోంది.

౨ వ ఆశ్వాసాంతమున—

శా. "నిస్తంద్రప్రతిభా! సుధీనుత! దిశో
న్మీలద్యశశ్శ్రీః ధూ
హస్తాగ్రామలకాయమానమహనీ
యాంభోజగర్భాండ! సై
న్యస్తోమోద్ధరజోగ్రజస్థగితికృ
ష్ణాగౌతమీమధ్యభూ
మ్యస్తోకోత్పలరాట్పురీహరణ! శ్రీ
లావార్యశౌర్యోదయా!"

కం. "బిసరుహనయనానవవిధ
కుసుమాయుధ! అవధికుధరకూటాంచలభూ
విసృమరతేజశ్చంపక
భసలదసత్కీర్తిమలినపరిపంథినృపా!"

కవిరాజ విరాజితము—

"నలనృగరంతిభగీరథభారత
నందనకల్ప! అనల్పయశ
శ్చులుకితలోక! విలోకితవధూజన
సూనశరాసన! మానఖనీ!
ప్రళయఘనాఘనఘోషజయానక
భాంకృతిభీమచపేటలుఠ
త్కలబరిగీకటకక్షితిరక్షక!
కన్నడరాజ్యరమారమణా!"

మొదటి పద్యం:—జరిగిన కథాభాగం ఒక్కసారి సింహావలోకనం చేసినట్లు ప్రవరుని గెల్పును 'నిస్తంద్రప్రతిభా' అని సంభావించాడు. అతని చేష్టను కవి ఎంతో హృదయపూర్వకంగా అగ్గిస్తున్నాడు. 'సుధీనుత' అన్నాడు అందుకనే. బ్రహ్మాండమంతా అతని యశశ్శ్రీవధువుకు చేతిలోనిదైంది. స్వసైన్యగమనోత్థితపరాగం చేత శత్రురాజ్యాన్ని కప్పివేసి ఉత్కళరాజ్యాన్ని హరించాడు కృష్ణరాయలు. శత్రుమతియగు వరూథినిని గెలిచి స్వస్వాంతస్థాపన చేయగలిగాడు ప్రవరుడున్నూ. వరూథినీలీల కతని నిష్ఠ (అగ్నిహోత్రాది) వారింపరానిదే అయింది.

రెండో పద్యం:— ఇంకా సింహావలోకనమే. ఒకటిరెండుమార్లు చదువరికి (ధ్వనిగర్భితంగా) చెప్పిగాని కవి తృప్తి చెందడు. 'బిసరుహనయనానవవిధకుసుమాయుధత్వం' రాజపరంగానూ, ప్రవరపరంగానూ సరిపోతోంది.

రాయల తేజశ్చంపకమునకు పరిపంథినృపులు తుమ్మెదలై పారిపోయారు. ప్రవరుని విషయంలో వెనుకనే అన్నాడు కవి—

"వాని చక్కదనము వైరాగ్యమునజేసి
కొంతుసేయు జారకామినులకు
భోగబాహ్యమయ్యె పూచిన సంపెంగ
పొలుపు మధుకరాంగనలకు బోలె."

అదే అభిప్రాయం పునః ఇక్కడా ఉద్ఘాటించాడు కవి.

మూడవ పద్యం:—రాజును నలాదిరాజవర్గంతో పోలుస్తూ వారివారి వ్రతనిష్ఠ(భగీరథాదుల)లను, ప్రవరుని మనఃస్థిరతనూ కవి వ్యంజితం చేస్తున్నాడు. లోకాన్నంతా తన యశస్సుచే గుప్పిటబట్టాడు. ఎవరూ? 'విలోకితవధూజనసూనశరాసను' డైకూడా 'మానఖని' యగు ప్రవరుడు. తన జయభాంకారము వరూథినికి 'ఛీ' యని చెంపదెబ్బవలె తగిలింది. ఇలా చేసి స్వరాజ్యమయిన కన్నడ (ఆంధ్రరాజ్యానికి కన్నడ మనడం ఉపలక్షణం) రాజ్యరమకు రమణుడైనాడు రాజు. ప్రవరుడో? ఇంటికి తిరిగివచ్చి స్వకళత్రరమణుడైనాడు.

3. తృతీయాశ్వాసం : ఆదిని—

కం. "శ్రీ వేంకటేశపదప
ద్మావేశితసదయహృదయ! హరనిటలనట
త్పావకపరిభావిమహః
ప్రావృతనిఖిలాశ! కృష్ణరాయమహీశా!"

భగవద్భక్తచిత్తుడు రాయలు. ప్రవరుడున్నూ తన్నావేశించి తన నిలుసేర్చిన అగ్నిదేవుని ఎంతగా స్తుతించి ఉంటాడో!

రెండో విశేషణం: రాయలు నిటలేక్షణు కంటిచిచ్చున్న తిరస్కరించే ప్రతాపాగ్నిచే దిక్కులన్నీ కప్పివేసినవాడు. ప్రవరుని కేంతో ఇది తగి ఉంది. హరుడు కొంచెం మనస్సులో చలించి వెంటనే తెలివి తెచ్చుకొని మన్మథుని కాల్చివేసిన వాడు. ప్రవరుడు మాత్రం అట్లా కాకుండా ఎంత మాత్రమూ చలించనివాడు. భళిరా ప్రవరా, ఆ హర తేజస్సుకంటె ఎక్కువదికదా నీ ధైర్యతేజస్సు! (చూ. "కించిత్పరిలుప్తధైర్యః"—కుమారసంభవం)

తృతీయాశ్వాసాంతంకూడా ఇట్టి ధ్వనివిశేషంతో కూడిఉన్నదే.

శా. "హిందూరాజ్యరమాధురంధరభుజా
హిగ్రామణీకంచుక
త్కుందస్వచ్ఛయశోగుళుచ్ఛ! యవన
క్షోణీధవస్థాపనా
మందీభూతకృపాకటాక్ష! యసకృ
న్మాద్యత్కళింగాంగనా
బందీగ్రాహవిగాహితోత్తరకకు
బ్ధాటీసమాటీకనా!"

కం. "తిరుమలదేవీ చరణో
దరలాక్షాకల్పకల్పితస్థలకమల
స్ఫురదిందీవరబంధుర
హరిహయమణివలయకూటహర్మ్యవిహారీ!"

ఉత్సాహము—

"వర్ణనీయకీర్తివైభవా! ప్రభూతభూతిదృక్
కర్ణకుండలా! వితీర్ణికర్ణ! దీర్ణహృద్భ్రమ
ద్దుర్ణయారిమానహారి! దుర్భరానకార్భటీ
ఘూర్ణమానకొండపల్లికొండవీడుమండలా!"

కవి ప్రవరుణ్ణి మరవలేదు. అతణ్ణి ఉగ్గడిస్తూనే ఉన్నాడు. ఇక తృతీయాశ్వాసముకథ మాయాప్రవరుని విషయం. ఎన్నోమాట్లు తిరస్కరించింది వరూథిని ఆ గంధర్వుణ్ణి.

అసకృన్మాద్యత్ అంగనా—అట్టి కళింగరాజ్యరమను కృష్ణరాయడు చెరపట్టినట్లే ఈ మాయాప్రవరుడున్నూ వరూథినిని చెరబట్టగలిగాడు.

రెండోపద్యంలో తిరుమలదేవిపాదముద్రలు గల మేడమీద కృష్ణరాయల విహరమనడంలో వరూథినీ మాయాప్రవరుల విహారకేళిని జ్ఞాపకానికి తెస్తున్నాడు.

3 వ పద్యంలో 'దీర్ణహృద్భ్రమద్దుర్ణయారిమానహారి' రాయలున్నూ గుండె పగిలి విరహార్తయై నీతిమాలిన వరూథిని తనను మున్ను తిరస్కరించినది కావుటచేత దాని గర్వం హరించగలిగాడు మాయాప్రవరుడు. ఇదిన్నీ చక్కగా ధ్వనితం.

౪. ఇక చతుర్థం:

చతుర్థాశ్వాసాదిని రాబోవు కథను ఎంత చక్కగా ధ్వనితంచేస్తాడో పెద్దన చూడండి:

"శ్రీకృష్ణరాయ, గుణర
త్నాకల్పా, కల్పకద్రుమాధికదాన
శ్రీకుతుకాగతలోకా
లోకాంతరసకలసుకవిలోకస్తుత్యా!"

స్వరోచికూడా గుణసంపన్నుడై వేటకు బయలుదేరి కల్పద్రుమమిచ్చే ధనకనకవస్తువాహనాది దానమే కాక తదధికంగా మనోరమాప్రాణదానం చేసినవాడు. తుదకు దివిజులు (ఆశ్వాసాంతమున) పూలవాన కురిపిస్తారు.

ఆశ్వాసాంతం:—

శా. "శ్లాఘాలంఘనజాంఘికోజ్జ్వలగుణా
లంకార! ఘీంకారహే
షాఘోషోద్భటధాటికాగజఘటా
శ్వాఘూర్ణవిశ్వంభరా!
మోఘీభూతభుజంగభోగభర! సం
ఫుల్లాబ్జపత్రేక్షణా!
ద్రాఘీయఃప్రతిభావిచక్షణ! త్రయీ
ధర్మైకసంరక్షణా!"

కం. "బహువీరహననమిళదఘ
వహనభ్రమకృత్కళంకదోగ్రాసి
గ్రహిళభుజయుగళ! గజప
త్యహిపహరణతార్క్ష్య! సజ్జనావనదక్షా!"

పృథ్వి :—

"సుధీమధురవాక్సుధా
సుముఖ! నాగమాంబాసుతా!
మధుప్రసవసాయక
స్మయవిరామరమ్యాకృతీ!
దధీచవిభుకామధుక్
ధనదముగ్ధసింధుప్రథా
వధీరణపరాయణో
జ్జ్వలవదాన్యతాలంకృతా!"

౧ వ పద్యము:—స్వారోచి పుట్టి బలపరాక్రమములచే 'జాంఘికోజ్జ్వలు'డైనాడు. వేటకని భూమి అదిరే సన్నాహాలు చేసినవాడు......'గజఘటాళ్వక్షుణ్ణవిశ్వంభరా!' ఈపరాక్రమానికి తోడు చక్కని రూపం కూడా ఉంది. మనోరమను వివాహమయే యోగ్యత. (సంఫుల్లాబ్జపత్రేక్షణా) రాక్షసుణ్ణి చూసి బెదరక ప్రతిఘటించిన 'ప్రతిభావిచక్షణుడు'. మనోరమను రక్షించిన 'నగ్నైకసంరక్షణుడు'.

ఎంతసొగసైన ధ్వని! సింహావలోకనం!

౨ వ పద్యము:—కృష్ణరాయనివలెనే స్వారోచియు శత్రురాజును జయించినవాడు. ఇట స్వారోచియు రాక్షసుని జయించినవాడు. సజ్జనావనదక్షులు ఉభయులును.

3 వ పద్యము:—రాబోవు పంచమాశ్వాసపు కథను సూచిస్తుంది. వివాహఘట్టానికి ఆయతపడతాడు కవి. మన్మథాదులను తిరస్కరించే రమ్యాకృతి. వరూథిని కుమారు డితడనే మాట మరువరాదని 'నాగమాంబాసుతా! అని' సూచన.

౫. పంచమాశ్వాసం ఆదినికూడా—

"శ్రీనందనసౌందర్య! సు
ధీనందన, వితరణాంధీరతబలిరా
డ్భానుజ! పరరాజస్వ
ర్భానుభుజామహేంద్ర! కృష్ణరాయమహేంద్రా!"

కథాఘట్టానికి తగిన విశేషణం—వితరణగుణప్రశంసకూడాను. మనోరమాప్రాణదానం ధ్వనిస్తుంది.

బలిరాజు మూడడుగుల మేర యిస్తే అది ముల్లోకా లయితేమాత్రం ప్రాణదానంతో సమానమవుతుందా?

పంచమాశ్వాసాంతంలో—

కా. "అతులక్షాంతిగభీర! భీరహితచి
త్తాంభోజ! భోజక్షమా
పతివిద్యాపరిపాక! పాకరిపుసం
భద్భోగ! భోగాశిప
త్రిస్థిరసూ్ఫర్త్యనుభావ! భావభరిత
శ్రీకాంత! కాంతారపా
లితకాళింగకులేశ! లేశతరవృ
త్తిక్షీణవైరివ్రజా!"

కం. "నాగాంబాసుత! జితకద
నాగతమదనాగసంగమానూపగృహా
భోగా! భోగపురందర!
భోగీంద్రశయానపురుషపూజాప్రవణా!"

మాలిని:—

"సరభసజయధాటీ చండవేదండకోటీ
కరవమధుహిమానీ కంపితాశావధూటీ
పరమహితహసంతీ భావభాగ్యాదితేజః
పరుషదహనకీలా ప్రస్ఫురచ్చక్రవాళా!"

౧ వ పద్యము ముక్తపదగ్రస్తము. స్వారోచి ఆయుర్వేదవిద్య గంధర్వుని దగ్గరనుంచి నేర్చుకొన్న దిట్ట. (విద్యాపరిపాక) ఇంద్రభోగంగా వివాహం అయింది. ఎవరికి? పాకరిపుసమానుడైన (రాక్షసవిజేత అయిన) స్వారోచికి.

౨ వ పద్యము: మళ్ళీ భోగపురందరత్వం, గృహభోగత్వం ("ఎవ్వాని వాకిట నిభమదపంకంబు రాజభూషణరజోరాజి దనరు" భారతం).

3 వ పద్యము: స్వారోచిభోగానికి నిమిత్తం అతని పరాక్రమం.

౬. షష్ఠమందు. ఆదిని—

కం. "శ్రీకృష్ణరాయమనుజేం
ద్రా! కాంతాపంచబాణ! నరసింహధరి
త్రీకాంతగర్భవార్నిధి
రాకాహిమధామ! కర్పూరదళవిరామా!
కాంతాపంచబాణుడు స్వారోచిన్నీ.

అంతమందు—

శా. "వ్యాయామస్థిరసంధిబంధ! కటకా
ధ్యక్షానుగక్షోణిభృ
త్కాయవ్యగ్రావళిధావిధాభిదురదోః
ఖడ్గాగ్ర! యుగ్రాచల
వ్యాయఃకీర్తిభరప్రపంచ! పరపం
చారామ, రామామణీ
గేయాకేయజయాంక! పంకజదృగం
గీకారధీరాకృతీ!"

ఇందులో పంచారామరామామణీగేయామేయ జయాంక—స్వరోచి మనోరమ, ఆమె చెలికత్తెలు విభావసి, కళావతి, వనదేవత, హారిణి, ఇదోది రాజ్యరమ —అందరికీ వరణీయుడై, వరుడై పంకజద్విగంగీ శారధీరాకృతి యైనాడు.

౨ వ పద్యము:—

"కాంతాలతాంతశర! యే
కాంతికథ క్తిప్రతాపోషితాంభోధిసుతా
కాంతా! ప్రతాపరవిశశి
కాంతాయితవిమతినృపతికాంతాహృదయా!"

స్వరోచికుమారుడో స్వారోచిషమనువు. తపస్సుచే విష్ణువును మెప్పించినవాడు. అతని ప్రతాపరవిచే శత్రురాజు లస్తమిస్తారు.

౩ వ పద్యము:—

వనమయూరము—

"రాజపరమేశ, ఫణిరాజబల, ఫుల్లాం
భోజముఖ, భోజముఖభూపవిపులాంశో
త్తేజితధరాభరణదీక్షితభుజా, ని
ర్వ్యాజభయదాజివిజితారినృపరాజీ!"

మనువున్ను ధరాభరణదీక్షితభుజుడు.

ఈరీతిగా మనుచరిత్రఆశ్వాసాంతపద్యాల్లో ఇంచుమించు అన్ని విశేషణములూ కేవలం కృతిపతిని స్తుతించడానికే కాకుండా కథావస్తువును ధ్వనితం చేస్తూ, సింహావలోకనం చేస్తున్నాయి. ప్రతివిశేషణం ఇంత శక్తి గలదా అని అడగడం పఠిత కవిశిల్పంమీద అధికారంచలాయించడ మన్నమాట. నాకిష్టం వచ్చినట్లు పద్యం వ్రాయి అంటే కవి వ్రాస్తాడా? వ్రాసిన దాంట్లో అందాన్ని గ్రహించవలసినమాత్రంవాళ్ళమే.

ప్రధానంగా మనుచరిత్ర ఆశ్వాసాంతపద్యాలు రాజసంబోధన చేసేవే అయినా—

౧. శార్దూలం, కందం, ఒక అపూర్వ సంస్కృత వృత్తం క్రమం తప్పకుండా ఉండడం;

౨. పూర్వపరాశ్వాసాల కథావిషయాన్ని పాఠకులకు జ్ఞాపకం చెయ్యడం;

౩. శబ్దసౌందర్యానికి (మొదట్లో చెప్పినట్లు) తోడ్పడడం;

—అనే మూడు గుణాలు కలవి.

షష్ఠ్యంతములలోకూడా—

"ఏవంవిధగుణసంయుత
కావల్గత్తురగబహువిధారోహకళా
రేవంతున కలితాంతున
కావిష్కృతకీర్తినవలితాశాంతునకున్."

అన్నదాంట్లో ప్రవరుని గుణములు—శాంతత, శృంగారవిరోధిత;

"పుంఖానుపుంఖసైంధవ
రింఖాసంఘాతజాతరేణూగ్రతమో
రింఖ దిపున్నృపదహార
ప్రేంఖదసుగ్రసనజఠరభృత్యసిఫణికిన్."

అన్న పద్యంలో తమోహృదయ యగు వరూథినీమోహము నడచుట;

"అవిరళవితరణవిద్యా
నవరాధేయునకు సజ్జనవిధేయునకున్
గవితాస్త్రీలోలునకున్
ఖవిటంకనటద్యశోద్ధకల్లోలునకున్."

ఈ పద్యంలో మాయాప్రవరుని స్త్రీలోలత;

"దిగధీశసహ్యధగ
ద్ధగిధద్ధగుచి ప్రతాపతపనస్ఫురణ
స్థగితద్యుమణికి నిమిషా
ర్ధగృహీతకళింగరాజతనయాగ్రణికిన్."

ఈపద్యంలో స్వరోచిప్రతాపవర్ణనం, మనోరమావివాహమున్నూ;

"కరుణాకర వేంకటవిభు
చరణస్మరణప్రసంగసంగతమతి కీ
శ్వరనరసింహమహీభృ
త్పరనందనకృష్ణరాయధరణీపతికిన్."

స్వారోచిషమనువు తపస్సు, మనుపట్టము, కృష్ణరాయలు ధరణీపతి—మనువు భూరమణుడు. ఇద్దరూ విష్ణుచరణధ్యానమనస్కులు.

ఈవిధంగా ఆశ్వాసాద్యంతపద్యాలూ, షష్ఠ్యంతాలూ విచ్చలవిడిగా అసందర్భంగా గాక కథావస్తుసూచకములుగానున్నూ, అసలు కథను మరువకయే కృతిపతిపరంగానూ, కథావస్తువు ధ్వనించేటట్టున్నూ, శిల్పకల్పనాచాతుర్యం ఇలిసేటట్టు రచించడం పెద్దన వంటి మహాకవులకే చెల్లుతుంది. అట్టివారి ప్రతిభకు నీరాజనం పట్టాలి.

ఈ దృష్టికూడా కొంచెం పెట్టుకొని, మనం సాధారణంగా వదిలివేసే షష్ఠ్యంతాలూ, ఆశ్వాసాద్యంతపద్యాలూ ఓపికతో చదివితే కవిశిల్పమూ, సొగసైన ధ్వనిస్థితీ పాఠకులకు లభించి ఇతోధికానందం కలుగగల దని మనవి.

# ప్రాక్ • పాణిని *

శ్రీ
శివశంకరశాస్త్రి

## ౧. ఐంద్రవ్యాకరణము

"బ్రహ్మణాతు తతః పశ్చాత్
సర్వం విజ్ఞాయ యోగతః
దేవానాం గురవే కించిత్
ప్రభాషిత మితి స్థితిః.

దివ్యం వర్ష సహస్రం హి
శునాసీరాయ ధీమతే
శబ్దపారాయణం సమ్యక్
ప్రోవాచాఽథ బృహస్పతిః.

సురాణా మనురోధేన
తత ఐంద్రం స్మృతం పురా
ఇంద్రేణ వాయునా సార్థం
ప్రాప్య సోమం సుధాసుఖమ్.

భరద్వాజో మునిశ్రేష్ఠ
ఇంద్రం శ్రుత్వా పురందరాత్
ప్రోవాచ శాబ్దికం తత్త్వం
మునిభ్య స్తదనంతరమ్."

మహర్షి శాకటాయనుడు తన ఋక్తంత్రమున నిట్లు స్మరించినాడు: "యథాఽఽచార్యా ఊచుః-బ్రహ్మ బృహస్పతయే ప్రోవాచ, బృహస్పతి రింద్రాయ, ఇంద్రో భారద్వాజాయ, భారద్వాజ ఋషిభ్యః, ఋషయో బ్రాహ్మణేభ్యః, తం ఖ ల్విమ మక్షరసమామ్నాయ మి త్యాచక్షతే. న భుక్త్వా న నక్తం ప్రబ్రూయాత్ బ్రహ్మరాశి రితి చ బ్రహ్మరాశి రితి చ." ఈ విషయము ఆచార్య పరంపరాప్రాప్త మని శాకటాయనుని యభిప్రాయము. బ్రహ్మకు గురు వెవరు? ఈ ప్రశ్నవలన అనవస్థాదోషము సిద్ధమగును. ముండకోపనిషత్తులో ని ట్లున్నది:

"బ్రహ్మా దేవానాం ప్రథమ స్సంబభూవ
విశ్వస్య కర్తా భువనస్య గోప్తా
స బ్రహ్మవిద్యాం సర్వవిద్యాప్రతిష్ఠాం
అథర్వాయ జ్యేష్ఠపుత్రాయ ప్రాహ."

సర్వశక్తిమంతులగు త్రిమూర్తులకు గురువు లెవరుందురు? శ్రీ శంకర భగవత్పాదు లిట్లు సెలవిచ్చినారు: "ఈశ్వరాణాం హిరణ్యగర్భాదీనాం వర్తమానకల్పాదౌ ప్రాదుర్భవతాం పరమేశ్వరానుగృహీతానాం సుప్తప్రబుద్ధవత్ కల్పాంతరవ్యవహారానుసంధానోపపత్తిః. తథా చ శ్రుతిః—యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై......" (౧-౩-౩౦; ౧-౪-౧ శారీరక భాష్యము). కావున, ధర్మజ్ఞానవైరాగ్యాదిసంపన్నులు, స్వయంప్రభులు నగు బ్రహ్మాదులకు గురుకల్పన సంగతము కాదు.

బృహస్పతికి పితామహుడు శబ్దశాస్త్రతత్త్వమంతయు ననుగ్రహింపలేదు. బృహస్పతికి దెలిసిన దానిని గ్రహించుటకు దేవరాజు ఇంద్రునకు బహుకాలము పట్టెను. "బృహస్పతి రింద్రాయ దివ్యం వర్షసహస్రం ప్రతిపదోక్తానాం శబ్దానాం శబ్దపారాయణం ప్రోవాచ, నాంతం జగామ" (మహాభాష్య

---

* 'వ్యాకరణదర్శనచరిత్ర'నుండి.

ద్ధృతప్రమాణము. ఈ విషయమున ప్రాచీనగాథ యిట్లున్నది:

"సముద్రవ ద్వ్యాకరణం మహేశ్వరే
తదర్ధ కుంభోద్ధరణం బృహస్పతౌ,
తద్భాగభాగా చ్చ శతం పురందరే
కుశాగ్రబిందూత్పతితం హి పాణినా."

బృహస్పతి సన్నిధిలో శాస్త్రాభ్యాసము చేయుట అందరకును సాధ్యము కాదు. ఇంద్రు డట్లు చేయుటచేతనే దేవతలు మంత్రాదివిశ్లేషణము చేయుమని అతనిని కోరిరి. ఈ సందర్భమున తైత్తిరీయ సంహితాకమున ఐంద్రవాయవబ్రాహ్మణమునం దిట్లామ్నాతమయినది: "వాగ్వై పరాచ్య వ్యాకృతావద త్తే దేవా ఇంద్ర మబ్రువన్. ఇమాం నో వాచం వ్యాకుర్వితి. సోఽబ్రవీత్ వరం వృణే. మహ్యం చైవైష వాయవే చ సహ గృహ్యాతా ఇతి. తస్మా దైంద్రవాయవః సహ గృహ్యతే. తామింద్రో మధ్యతోఽవక్రమ్య వ్యాకరోత్. తస్మా దియం వ్యాకృతా వా గుద్యతే." (తైత్తి. సం. ౬-౬-౪-౭) దీనిపై భాష్యకారుడు సాయణాచార్యు డిట్లు వ్రాసినాడు: "అగ్నిమీడే పురోహిత మిత్యాది వాక్ పూర్వస్మిన్ కాలే పరాచీ సముద్రాది ధ్వనివ దేకాత్మికా సతీ అవ్యాకృతా ప్రకృతిః ప్రత్యయః పదం వాక్య మిత్యాది విభాగకారిగ్రంథరహితా ఆసీత్. తదానీం దేవైః ప్రార్థిత ఇంద్రః ఏకస్మిన్నేవ పాత్రే వాయోః స్వస్యచ సోమరసగ్రహణరూపేణ వరేణ తుష్టః తా మఖండాం వాచం మధ్యే విచ్ఛిద్య ప్రకృతిప్రత్యయాదివిభాగం సర్వత్రాకరోత్. తస్మా దియం వా గిదానీమపి పాణిన్యాదిమహర్షిభి ర్వ్యాకృతా సర్వైః పఠ్యత ఇత్యర్థః." దేవతల యనురోగమువలన ఇంద్రుడు శబ్దాధికారమున చెప్పినదే ఐంద్రవ్యాకరణము.

అతిప్రాచీనకాలముననే ఐంద్రవ్యాకరణము లోపించిపోయినది. పాణిన్యాదుల గ్రంథములందు దీని నామము గోచరింపదు. ఈ వ్యాకరణవిషయము తర్వాతి భారద్వాజాదుల గ్రంథములలో లీనమై 'యథోత్తరం మునీనాం ప్రామాణ్యమ్' అను న్యాయ ప్రకారము విశిష్టత కోలుపోయినది. ఐంద్రవ్యాకరణ మను గ్రంథ ముండె ననుట నిస్సంశయము. గ్రంథ మున్నట్టు చిరకాలప్రసిద్ధి కలదు. ఈ ప్రమాణములు చూడనగును:

౧. నందికేశ్వరస్మృత 'కాశికా' వృత్తిపై 'తత్త్వవిమర్శినీ' వ్యాఖ్యలో భగవాన్ ఉపమన్యువు— "తథా చోక్త మింద్రేణ, అంత్య వర్ణసముద్భూతా ధాతవః పరికీర్తితాః ఇతి.".

౨. నానార్థశబ్దరత్నమున కాళిదాసు— "మహాభాష్యాధ్యయనము చేయనిచో ఇంద్రాదిప్రోక్త శబ్దరాశి అధిగతము కాదు"—ఈ గ్రంథమునకు టీక రచించిన నిచులుడు దీనిని సమర్థించినాడు.

౩. వరరుచిప్రణీతమైన ఐంద్రనిఘంటుప్రారంభమున—

"పూర్వం పద్మభువా ప్రోక్తం
శ్రుత్వేంద్రేణ ప్రకాశితమ్,
తద్భాగేభ్యో వరరుచిః
కృతవా నింద్రనామకమ్".

౪. కాత్యాయనుని వాజసనేయి ప్రాతిశాఖ్యలో— "అర్థః పదమ్." నిరుక్తఋజ్వర్థ వ్యాఖ్యలో దుర్గాచార్యుడు— "అర్థః పద మైంద్రాణామ్." (దీనివలన 'అర్థః పదమ్' అనునది ఇంద్రవ్యాకరణములోని సూత్ర మనిపించును.)

౫. క్రీ. శ. ౭వ శతాబ్దిలోని చీనాయాత్రికుడు యువాన్ చాంగ్ భరతఖండమునకు వచ్చినప్పుడు, ప్రథమమున ఇంద్రకృతవ్యాకరణనియమసమూహము ప్రవర్తిత మయిన దనియు, తరువాత బహుకాలమునకు మహేశ్వరానుగ్రహమువలన పాణిని ఉత్సర్గాపవాదముఖమున శబ్దానుశాసనము* రచించె ననియు విన్నాడు.

౬. ౧౩వ శతాబ్దిలోని జయద్రథుడు హరచరిత చింతామణిలో—

* మనుసంహితాభాష్యకర్త మేధాతిథి (క్రీ. శ. ౯ శతాబ్ది) "తథాహి భగవాన్ పాణిని రనుక్త్వైవ ప్రయోజనమ్, అథ శబ్దానుశాసనమ్, ఇతి సూత్ర సందర్భ మారభతే" అని లిఖించినాడు.

"ఐంద్రం వ్యాకరణం నష్టం సమగ్రం బాధన ద్భువి
తతో వరరుచిర్గుణం విద్యావిరహితోదధే."

౯. ౧౧వ శతాబ్దిలోని కథాసరిత్సాగరమున సోమదేవసూరి—

"తేన ప్రణష్ట మైంద్రం త
దస్మద్వ్యాకరణం భువి". (౪౫౪౦.)

గుణాఢ్యుని బృహత్కథానుసారముగా ఈ వివరణ మంతయు కథాసరిత్సాగరములోనో, హర చరితములోనో నిబద్ధ మయియుండును.

౮. వైష్ణవశ్రీ తత్త్వనిధిలో—

"ఐంద్రం చాంద్రం కాశకృత్స్నం
కౌమారం శాకటాయనం,
సారస్వతం చాపిశలం
శాకల్యం పాణినీయకమ్."

౯. కవికల్పద్రుమమున బోపదేవగోస్వామి—

"ఐంద్రః చంద్రః కాశ కృత్స్న
పిశలీ శాకటాయనః,
పాణి న్యమర జై నేంద్రా
జయం త్యష్టాదిశాబ్దికాః."

౧౦. సారస్వతప్రక్రియలో అనుభూతిస్వరూపాచార్యుడు—

"ఇంద్రాదయోఽపి య స్యాంతం
న యయుః శబ్దవారిధేః,
ప్రక్రియాం తస్య కృత్స్నస్య
క్షమో వక్తుం నరః కథమ్?"

౧౧. Dr A. C. Burnell—'The Aindra school of Sanskrit Grammarians' అను గ్రంథమున (౧౮౭౫ లో) ఇట్లు వ్రాసినాడు : "ఐంద్ర వ్యాకరణము లుప్తమయినను 'తొల్ కాప్యమ్' అను తమిళవ్యాకరణమున తత్సత్త్వ ప్రత్యుద్బోధకచిహ్నములు లక్షితములు."

౧౨. మహామహోపాధ్యాయ హరప్రసాద శాస్త్రి యిట్లు వ్రాసినాడు :

"It has already been said that there were grammars before Panini, and the first place, among these grammars, is given to Aindra school. No ancient work of this school has come down to us. The only grammar of this school that is extant, is the Katantra or Kalapa. It takes the alphabet as it is, and attempts at no Siva Sutras. Its nomenclature is taken from the ordinary languages and they are not algebraical like those of Panini and the subsequent schools. No Pratisakhyas seen to be the ancient representatives of this school. But they do not count as they are not treatises on grammar (Vyk. Mssp. XXXVIII).

అష్టాధ్యాయిలో శివసూత్రములవలె కామారమున "సిద్ధో వర్ణసమామ్నాయః", "తత్ర చతుర్దశాదౌ స్వరాః" అను సూత్రములు చేరిన వనియు, ఐంద్ర వ్యాకరణములోని భవంత్యాదిసంజ్ఞలు కాతంత్రమున ప్రవేశించిన వనియు పురాతత్త్వవేత్త లనుచున్నారు. ఇవి కేవలము నిరాధారములు కావు. ఐంద్రసంజ్ఞలు, వచనాదులు ఋక్ప్రాతిశాఖ్యలో కనబడియుండును; ఆ ప్రాతిశాఖ్యావచనము లనేకములు కాత్యాయన సూత్రమున రూపొందియుండవచ్చును.

వరరుచి - కాత్యాయనుడు ఐంద్రవ్యాకరణము పఠించిన పిమ్మట పాణినీయప్రవిష్టు డయినాడని హర చరితాదికథలవలన తెలియవచ్చుచున్నది. ఈ విషయము నిస్సంశయముగా చెప్పుటకు వీలులేదు. కాని వరరుచి అక్కడక్కడ పాణినిపై వార్తికములలో అచ్ హల్ అక్ లట్ లుఙ్ ప్రభృతిస్థానములలో యథాక్రమముగా స్వర, వ్యంజన సమానాక్షరములు, భవంతీ, అద్యతనీ ప్రభృతి ఐంద్రసంజ్ఞలను ప్రయోగించినాడు. "వర్తమానే లట్" (౩-౨-౧౨౩) సూత్రవార్తికమున, "ప్రవృత్తస్యావిరామే శిష్యా భవంత్యవర్తమానత్వాత్" అని వివరించినాడు. దీనిపై ప్రదీపమున కైయటుడు "భవంతీతి లటః పూర్వాచార్య సంజ్ఞా" అని వ్రాసినాడు. ఇది ఐంద్రసంప్రదాయ సంజ్ఞ. కాత్యాయనుడు ఐంద్రవ్యాకరణమును సంపూర్ణముగా జూచియున్నచో పాణిన్యష్టకమున దాని సూచన లేదేమి? ఆయన వివిధప్రాతిశాఖ్యలలో ఐంద్ర సంజ్ఞలు, వచనములు దొరకినంతవరకు గ్రహించి, వార్తికపాఠములలో ప్రయోగించినాడనుట సమంజసము.

ఐంద్రవ్యాకరణ మను గ్రంథము కల దనియు, దేవరాజు ఇంద్రునకును, దానికిని సంబంధ మేమియు లే దనియు కొందరందురు. ఉపమన్యు ప్రపితామహుడు, వసుపితామహుడు, పైలశిష్యు డగు ఇంద్రప్రమతికి తండ్రియు నగు వాగింద్రుడు ఈ వ్యాకరణము రచించె నని వారి మతము. మహాభారత-అనుశాసనపర్వములో (అధ్యా. ౮) వాగింద్రాదుల సందర్భము కలదు.'

"ప్రకాశస్యచ వాగింద్రో బభూవ జయతాం వరః,
తస్యాత్మజ శ్చ ప్రమతిః వేదవేదాంగపారగః."

వాగింద్రుని ప్రపౌత్రుడు ఉపమన్యుడు స్మృతి కర్త. యాజ్ఞవల్క్యమితాక్షరమున విజ్ఞానేశ్వరుడును, గౌతమధర్మసూత్రీయమితాక్షరమున హరదత్త మిశ్రుడును ఆయనను పేర్కొన్నారు. సీతానాథ ప్రధాన మహాశయుని మతమున వాగింద్రుడు జనమేజయుని సమకాలికుడు.

దిగంబరసంప్రదాయమున ఐంద్రవ్యాకరణ మొకటి కల దని వినవచ్చుచున్నది. జినుని, అనగా మహావీర వర్ధమానుని ముఖారవిందమునుండి తప్పియ శిష్యుడగు ఇంద్రభూమి గౌతముడు విన్న వ్యాకరణ విషయములే ఐంద్రవ్యాకరణ మయ్యె నని వారి మతము. బృహత్ ఖరతరగచ్ఛకు సంబంధించిన సమయసుందర సూరి కల్పసూత్రటీకలో నిట్లు వ్రాసినాడు:

"య దింద్రాయ జినేంద్రేణ
కౌమారేఽపి నిరూపితమ్,
ఐంద్రం జైనేంద్ర మి త్యేతత్
ప్రాహుః శబ్దానుశాసనమ్."

శాకటాయనీయశబ్దానుశాసనమున "జరాయాఙ్ ఙింద్రస్యాచి" (౧-౨-౩౭) సూత్రమున ఇంద్ర నామము కలదు. జైనేంద్రవ్యాకరణమున "జరాయాఙ్ శ్చ" అను సూత్రము కానవచ్చుచున్నది. శాకటాయనుని అమోఘవృత్తికి సంగ్రహరూపమగు 'చింతామణీ' లఘువృత్తిలో యక్షరాజాచార్యుడు ఇంద్ర నామము గ్రహించినాడు:

"ఇంద్రచంద్రాదిభి శ్శబ్దైః
య దుక్తం శబ్దలక్షణమ్,
త దిహాఽస్తి సమస్తం చ
య న్నేహాస్తి న తత్ క్వచిత్."

ఈ స్థానము లన్నింటిలో ఇంద్రశబ్దమువలన మహావీరుని శిష్యుడు ఇంద్రభూతి గౌతముడే లక్షితుడగుచున్నాడు. పూజ్యార్థమున ఇంద్రశబ్దము గృహీత మని పాశ్చాత్యవిద్వాంసుల మతము. ఇం దాశ్చర్యము లేదు. క్రీ. శ. ౬౭౮ లో జైనుల పద్మపురాణరచనకు ముందు రవిషేణుడు దీనిని వర్ధమాన-ఇంద్రభూతి సంవాదమున చెప్పినాడు. పద్మపురాణమువలె జైనేంద్ర వ్యాకరణము ఇప్పటికిని కల దని కింవదంతి. ౫, ౬ శతాబ్దులలోని దేవనంది దీనిని రచించె నని పురాతత్త్వవేత్తలు నిస్సందేహముగా ప్రతిపాదించుచున్నారు. కావున తైత్తిరీయసంహితలో గాని, మహర్షి శాకటాయనుని ఋక్తంత్రమున గాని పేర్కొన్న ఇంద్రునికి జైనేంద్రవ్యాకరణముతో నెట్టి సంబంధము లేదు.

బౌద్ధసంప్రదాయమున ఇంద్రవ్యాకరణము కలదట. క్రీ. శ. ప్రథమ శతాబ్దిలో ఇంద్రద్రువు డను పర్యాయనామము కల ఐంద్రగోమి దీనిని రచించినాడు. దీనిలో ప్రాచీన-ఇంద్రవ్యాకరణములోని సంజ్ఞా, సూత్ర, వచనములు నిబద్ధము లయినవట. పాణిని ననుసరించిన చాంద్రునివలె, ఇంద్రగోమి-ఇంద్రమతము ననుసరించి శర్వవర్మ కాతంత్రము రచించె నని తారానాథ లామా వ్రాసినాడు. (Wassiliew and Schiefner) దీని ననుసరించి కీత్ మహాశయుడు ఇట్లు వ్రాసినాడు:

"Tibetan tradition ascribes to Sarva Varma the use of the grammar of Indragomi and this work seems to have been popular among the Buddhists of Nepal, but it is lost though the reality of its author's existance is certain." (H. S. L. p. 431)

క్రీ. శ. ౧౧౧౧ లోని విశ్వప్రకాశపరిశిష్టస్థానమగు శబ్దభేదప్రకాశటీకయందు, ౧౫౯౮ లోని జైనపండితుడు జ్ఞానవిమలగణి "సిద్ధి రనుక్తానాం రూఢేః" అను సూత్రము ఇంద్రగోమివిరచితఐంద్ర వ్యాకరణములోని ప్రథమసూత్ర మన్నాడు. "లోకోపచారాత్ గ్రహణసిద్ధిః" (సంధి ౨౩) అను కాతంత్ర

సూత్రమునకై శర్వవర్మయు, "సిద్ధిః స్యాద్ వాదా ల్లోకాత్" (౧-౧-౨,౩) అను హైమవ్యాకరణ సూత్రద్వయమునకై హేమచంద్రుడును ఇంద్రగోమికి కృతజ్ఞులు కావలెనని తోచును. ఇంద్రగోమి ప్రాచీన ఐంద్రవ్యాకరణసూత్రములను గ్రహించియున్నచో ఎవరును అతనికి కృతజ్ఞత చూప నక్కరలేదు. ఇంద్రగోమివ్యాకరణము నాధారముచేసికొని నాలందా విద్యాలయాచార్యుడు చంద్రకీర్తి 'సమంతభద్ర' నామకపద్యవ్యాకరణము రచించినట్లు ప్రతీతి. క్రీ. శ. తృతీయశతాబ్ది చివరలో సమంతభద్రు డను బౌద్ధపండితుడు నాలందాలో ఆచార్యుడుగా నుండెను. ఆయన రచించిన వ్యాకరణ మేదో ౮,౫ శతాబ్దులలోని చంద్రకీర్తి సంస్కరించి ప్రచురించుటచే దానికి చంద్రకీర్తివ్యాకరణ మను పేరు వచ్చియుండ నోపును. ఈ గ్రంథమందలి శ్లోకము లనేకములు దౌర్గవృత్తిలోను, దౌర్గటీకలోను ఉండుటయే కాక, మూలములోని సమాస తద్ధిత ప్రకరణములలోనికిని ప్రవేశించినవని కొంద రనుచున్నారు. "అభిధానలక్షణా హి కృత్తద్ధితసమాసాః" అను న్యాయప్రకారము కాతంత్రములో కేవల సంధి, నామ, కారక, ఆఖ్యాతము లుపదిష్టము లనియు, తరువాత నెప్పుడో అన్యవిషయ సన్నివేశముచే కలాపకగణగ్రంథపూరణ మయ్యెననియు వీరి యభిప్రాయము. "కృత్తద్ధితసమాసాది రభిధానానుసారతః" అనునట్లు దౌర్గగణమువారు కేవలకృత్ప్రకరణము శర్వవర్మది కాదని యంగీకరింతురు. "నహి కుక్కుటాదే రేకదేశో భోగాయ పచ్యతే, ఏకదేశస్తు ప్రసవాయ కల్ప్యతే, విరోధాత్" అనునట్లు కృత్ప్రకరణమునకు ఇంద్రమూలకత్వమును, సమాసతద్ధితములకు సమంతభద్రమూలకత్వమును ఊహింతురు! ఇంద్రగోమిచంద్రకీర్తుల గ్రంథములు బహుకాలముక్రిందటనే లోపించిపోయినవి.

బృహద్వృత్తిన్యాసమున హేమచంద్రుడు తవచుగా ఇంద్రగోమితో కలాపమును, దుర్గసింహునితో శ్రుతపాలుని పేర్కొన్నాడు. దుర్గసింహునివలెనే శ్రుతపాలుడును వ్యాఖ్యాకారుడని దీనివలన తోచును. కలాపములోని "నిష్ఠా యాం చ" (కృత్ ౭౧), "బృంహేః స్వరేఽనిటి వా" (కృత్ ౬౭) అను సూత్రముల టీకలో దుర్గసింహుడు శ్రుతపాలుని పేరు ఉదాహరించినాడు. ఈ సూత్రద్వయమునుగూర్చి శ్రుతపాలుడు చెప్పిన వాక్కులను దుర్గసింహు డుద్ధరించినా డనిపించును. ఇంద్రగోమి వ్యాకరణమునుండి కృత్ సూత్రములు కలాపమున ప్రవేశించినచో, శ్రుతపాలుడు వానికి వృత్తి వ్రాసియుండునా? దేవనందిప్రణీత ధాతుపాఠమున కతడు వ్యాఖ్య రచించినట్లు జైను లందురు. ఒకడు రెండు భిన్నసంప్రదాయగ్రంథములకు వ్యాఖ్యలు వ్రాయునా యని యాశ్చర్యము చెంద నక్కరలేదు. దేవనంది పాణినిపై క్షపణకన్యాసమును, (Pawate) జైనేంద్రవ్యాకరణముపై క్షపణకవ్యాకరణమహాన్యాసమును (తంత్రప్రదీపము) రచించినాడట. అనేకులు వరరుచిని కాతంత్రవృత్తికారు డనియు, అష్టాధ్యాయీవృత్తికారు డనియు పేర్కొన్నారు. నవద్వీపనివాసి కాశీనాథ విద్యానివాసుడు సారస్వత సూత్రభాష్యకారు డనియు, ముగ్ధబోధటీకాకారు డనియు ప్రసిద్ధి.

౧౭వ శతాబ్దిలోని కవీంద్రాచార్యుని సూచీపత్రమున ఐంద్రవ్యాకరణోల్లేఖ మున్నది. బహుకాలము క్రిందటనే లోపించిన గ్రంథముపేరు కల యీ గ్రంథ మెట్టిదో పరిశీలింపదగినది. ౧౬వ శతాబ్దిలోని పుండరీక విద్యాసాగరుడు కాతంత్రప్రదీపములో, "ఆయాచితార మిత్యాది ప్రయోగోఽసాధురేవ సదాచారస్య స్మృతితో దుర్బలతా ద్వదితి ఇంద్రమిశ్రేణోక్తం, తత్తుచ్ఛమేవ" అని వ్రాసినాడు (౨-౪-౧౩). ౧౨వ శతాబ్దిలోని హేమచంద్రసూరి బృహన్న్యాసాదిగ్రంథములలో బహువారములు ఐంద్రమిశ్రుని పేర్కొన్నాడు. మిశ్రుని గ్రంథనామము తెలియదు; కాని కవీంద్రాచార్యుని సూచీపత్రములోని వ్యాకరణ మితనిదేమో. ఇంద్రవ్యాకరణగ్రంథ మీ కాలమున లభింపదు.

## ౨. భాగురీయ వ్యాకరణము

"ఉజ్జహార తత శ్శబ్ద
శాస్త్రతో భాగురిర్మునిః."

భారద్వాజుని పిమ్మట, భాగురికి పూర్వము శాబ్దికులైన మును లెవరెవరు జన్మించిరో తెలుపుట

శక్యము. కాని భాగురిముని బహుప్రాచీను డనియు, వైయాకరణు డనియు నిస్సంశయముగా జెప్పవచ్చును. పాణినికి పూర్వుడు, నిరుక్తభాష్యకారుడు నగు యాస్కునకు, నైరుక్తవైయాకరణు డగు కాత్థక్య మునికి సమకాలికుడు. కాత్థక్యుని 'బృహద్దేవత' యందు భాగురినామధేయము కానవచ్చును. అం దిట్లున్నది :

"పరా శ్ఛతస్రో యత్రేతి
ఇంద్రోలూఖలయోః స్తుతిః
మన్యేతే యాస్కకాత్థక్యా
వింద్రస్యేతి తు భాగురిః"

యాస్కకాత్థక్యాదిమునులు యాజ్ఞవల్క్యునికి తర్వాతివారు. భాగురిమాత్రము వారికి వెనుకటివాడు. "పురాణప్రోక్తేషు బ్రాహ్మణకల్పేషు" అను పాణిని సూత్రమువలెనే 'సంక్షిప్తసారము' నందు "ఋషేరయాజ్ఞవల్క్యాదేః బ్రాహ్మణే" (తద్ధిత-౪౫౪) అని యున్నది. దీని టీకలో గోయీచంద్రఠొత్థాసనికుడు ఇట్లు వ్రాసినాడు: "యాజ్ఞవల్క్యాదివ్యతిరిక్తా దృషివాచకాత్ బ్రాహ్మణే వాచ్యే విహితః ప్రోక్తప్రత్యయ స్తదధ్యేతృతద్వేదితృవిషయ ఏవ భవతి. శాట్యాయనీ భాగురీ ఐతరేయా......" కావున గోయీచంద్రుని మతమున శాట్యాయనాదులవలెనే భాగురి ప్రాచీనఋషి. 'ప్రక్రియాప్రసాద' మందు విట్ఠలస్వామికూడ భాగురిని ఋషి అన్నాడు: (ప్ర. కౌ. ౩౧౭ పుట. ప్రథమఖండము). జైమిని గృహ్యసూత్రమున తర్పణప్రకరణములో ఏ త్రయోదశ ఋషులకు తర్పణ మీయవలెనో అందు భాగురిఋషి కూడ కలడు: "రాణాయనిః సాత్యముగ్రిః దుర్వాసా అథ భాగురిః". 'చరణవ్యూహ' టీకలో మహిదాసుడు ఈ ప్రమాణము నుద్ధరించినాడు. సుబ్రహ్మణ్యశాస్త్రి ప్రణీత మగు గోభిలగృహ్యకర్మప్రకాశనిత్యాహ్నిక ప్రయోగమందును రాణాయని, సాత్యముగ్రి, వ్యాస, భాగురినామములు కానవచ్చుచున్నవి.

భాగురి మార్కండేయమునికి సమకాలికు డని కొందరు తలచినారు. ఇది అసంగతము కాదు. దీనికి కారణము సప్తశతీగ్రంథమున—

"మేధాశ్చ కథయామాస
సురథాయ సమాధయే;
సా కథా కథితా పశ్చాత్
మార్కండేయేన భాగురౌ.
తమేవ కథయామాసుః
పక్షిణో జైమినిం ప్రతి,
అనేనైవ విధానేన
కథాః షడ్విధికా మతాః."

దీనినిబట్టి వారి మతమును సమర్థించుకొందురు. విష్ణుపురాణమున, భాగురిముని స్వాయంభువమనువు వంశమువాడగు ప్రియవ్రతునికడనుండి విష్ణుపురాణమును స్వీకరించి స్తవమిత్రున కిచ్చినా డని యున్నది. స్తవమిత్రుడు మార్కండేయున కించుమించుగా సమకాలికుడు.

భాగురిముని త్రికాండనామకకోశమును రచించినాడు. ఈవిషయమున కొందరకు సందేహము కలదు; కాని నిజముగా దాని కవకాశము లేదు. "శిష శేమరిష్టస్య కరే" (౪-౪-౧౪౩) క్రీ. శ. ౧౨-వ శతాబ్దిలోని పురుషోత్తమదేవుడు సూత్రీయ భాషావృత్తిగ్రంథమున "అమీ శబ్దాః ఛాందసా అపి క్వచిద్ భాషాయాం ప్రయుజ్యంతే, ఇతి త్రికాండే భాగురినిబంధనాత్" అని వ్రాసినాడు. దీని వ్యాఖ్యలో ఆచార్యసృష్టిధరుడు "త్రికాండే కోశవిశేషే భాగురే రేవాచార్యస్య య దేషాం నిబంధనం తస్మాచ్చ" అన్నాడు. (భాషావృత్త్యర్థవివృతి).

భాగురిత్రికాండగ్రంథము కానరాలేదు. అయినను ప్రాచీను లనేకులు తమతమ గ్రంథములలో భాగురనామాదికము నుదాహరించినారు :

(౧) ఓషధివిశేషార్థమున వర్షాభూశబ్దమును గూర్చి క్రీ. శ. ౧౪ శతాబ్దిలోని సాయణాచార్యుడు మాధవీయధాతువృత్తిలో "తిథా భాగురిరపి, యథాచ—

భార్యా భేకస్య వర్షాభీ, శృంగీస్యాత్ మద్గురస్యతు,
శిలీ గండూపదస్యాపి, కచ్ఛపస్య డులిః స్మృతా"

అన్నాడు.

(౨) క్రీ. శ. ౧౩ శతాబ్దిలోని శ్రీపతిదత్తుడు కాతంత్రపరిశిష్టములో "ధురంధరస్తు భాగురిమతే ధురాశబ్దేన ధారేః ఖే హ్రస్వోఽపి ఇష్యతే" (సంధి ౧౪౨) అని వ్రాసినాడు.

(౩) సంక్షిప్తసారములో తద్ధితపాదమున "ఖిరో రిత్యేకే" (౧౦౬) అను సూత్రముమీద రసవతిగ్రంథ

మున క్రీ. శ. ౧౨ వ శతాబ్దిలోని మహారాజకుమారనంది "భామినీ కామినీ భీరుః సుందరీ దయితా ప్రియేతి త్రికాండమ్" అన్నాడు.

(౪) క్రీ. శ. ౧౨ వ శతాబ్దిలోని కేశవస్వామి నానార్థార్ణవ సంక్షేపములోను, హేమచంద్రసూరి అభిధానచింతామణిలోను భాగురివాక్యములను ఉద్ధరించినారు.

(౫) క్రీ. శ. ౧౧౫౯లో సర్వానందవంద్యోపాధ్యాయుడు టీకాసర్వస్వములో "త్రికాండోత్పలిన్యాదీని నామమాత్ర తంత్రాణి" అన్నాడు. ఉత్పలిని వ్యాడిమునివిరచితమైన కోశగ్రంథము.

(౬) క్రీ. శ. ౧౧-౧౨ శతాబ్దులలోని క్షీరస్వామి అమరకోశోద్ఘాటనమున "ఏతచ్చ ద్రపసంశర మితి భాగురిపాఠే సరమితి బుద్ధ్వా మాలాకృద్భ్రాంతః. కేచి న్నష్టేషు నాశితా ఇత్యయమపి మాలాపాఠేన విప్రలబ్ధః" అని లిఖించినాడు.

(౭) క్రీ. శ. ౧౧౧౧ లో మహేశ్వరుడు విశ్వప్రకాశములో—

"భోగీంద్ర కాత్యాయన సాహసాంక
వాచస్పతి వ్యాడి పురస్సరాణామ్,
స విశ్వరూపామరమంగలానాం
శుభాంక వోపాలిత భాగురీణామ్".

(౮) ౧౧,౧౨ శతాబ్దులలోని మంఖకుడు అనేకార్థకోశమున—

"భాగురి కాత్య హలాయుధ
హుగ్గామరసింహ శాశ్వతాదికృతాన్
కోశాన్ నిరీక్ష్య నిపుణం
ధన్వంతరినిర్మితం నిఘంటుం చ."

(౯) ౧౦ వ శతాబ్దిలో హలాయుధుడు అభిధానరత్నమాలలో—

"ఇయ మమరదత్త వరరుచి
భాగురి వోపాలితాది శాస్త్రేభ్యః
అభిధానరత్నమాలా
కవికంఠవిభూషణార్థ ముద్ధ్రియతే."

(౧౦) ౬ శతాబ్దిలో వరాహమిహిరాచార్యుడు బృహత్సంహితలో భాగురిమతవాదము నుద్ధరించినాడు.

**Aufrecht** మహాశయుడు భాగురి అభిధానికుడనియు, వైయాకరణు డనియు **Catalogus Catalogorum (C. C. ZDMO.** ౨౭, ౧౧౩) గ్రంథమున లిఖించినాడు.

భాగురి వైయాకరణు డను విషయము ప్రాచీనుల వాక్యములవలనను ఉపపన్నమగుచున్నది:

(౧) భర్తృహరి వాక్యపదీయములో నిట్లన్నాడు:

"ధాతో రర్థాంతరే వృత్తేః ధాత్వర్థే నోపసంగ్రహాత్
ప్రసిద్ధే రవివక్షాతః కర్మణో౽కర్మికా క్రియా."

ముగ్ధబోధవ్యాకరణవ్యాఖ్యాత యగు రామతర్కవాగీశుడు ఇది భాగురిశ్లోకమన్నాడు. (౨౭౨ సూత్రీయ ప్రమోదజననీ, కారక ప్ర.) వ్యాకరణ ప్రసంగమున ఈ శ్లోకము చెప్పియుండవచ్చును.

(౨) భాగురి గంధాదులవలె శౌక్ల్యాదిశబ్దములకు కేవల గుణవృత్తిత్వము స్వీకరించి షష్ఠ్యంతపదముతో వానిని సమాసమున విధించినాడు.

"యథా గంధాదయ శ్శబ్దా గుణమాత్రవ్యవస్థితాః,
తథా శౌక్ల్యాదయ స్తేనపట శౌక్ల్యాదయః స్మృతాః"

అను భాగురిమతము నంగీకరించి త్రిలోచనదాసుడు కాతంత్రపంజికయందు పాణినినియమమును ప్రత్యాఖ్యానము చేయుటకై ఇట్లు వ్రాసినాడు: "పూరణగుణసుహితార్థసదవ్యయతవ్య సమానాధికరణేన (౨-౨-౧౧) ఇతి ప్రతిషేధో నాద్రియతే. యదపి బలాకాయాః శౌక్ల్యం కాకస్య కార్ష్ణ్య మితి గుణే నోదాహృతం, తద ప్యనుచితమ్. ఇహ బలాకాశౌక్ల మిత్యపి భవత్యేవ." (చ. ౨౬౬)

(౩) అష్టాధ్యాయిలో వైదికప్రకరణమున ఈ సూత్రము లున్నవి: "సగర్భసయూథసనుతాద్ యన్" (౪-౪-౧౧౪); "అగ్రాద్ యత్" (౪-౪-౧౧౬); "ఘచ్ఛౌచ" (౪-౪-౧౧౭); "సముద్రాభ్రాద్ఘః" (౪-౪-౧౧౮); "మాతస్య భాగకర్మణి" (౧౨౦); "మత్వర్థే మాసతన్వోః" (౧౨౮); "మధోర్ఞ్చచ" (౧౨౯); "నక్షత్రాద్ ఘః" (౧౪౧); "శివశమరిష్టస్య కరే" (౧౪౩). పాణినిమతప్రకారము లౌకికభాషలో ఈ సూత్రనిష్పన్నములయిన శబ్దముల ప్రయోగము అనుమోదితము కాదు. అయినను పాణిని సంప్రదాయప్రభావవృత్తియందు "ఏభి ర్నవభిః సూత్రై ర్నిష్పన్నా శ్ఛాందసా అపి శబ్దాః సర్వథా భాషాయాం సాధవో భవన్తి...త్రికాండే భాగురినిబంధాత్" అని లిఖించియున్నది. త్రికాండగ్రంథప్రామాణ్యమును ధ్రువపరచుటకు కొందరు "అవ్యుత్పన్నసంజ్ఞాశబ్దత్వాత్" అన్నారు. కాని యిది చింతనీయము. భాషలో స్రోత్యాదిశబ్దప్రసక్తి అప్పుడు

దుర్నివార్య మగును. ఈ స్థితిలో శబ్దశాస్త్రమున భాగురివచనప్రామాణ్యాతిశయమును స్వీకరింపకుండుట కెట్లును వలనుపడదు.

భాగురీయగ్రంథమందు "చర్మణి ద్వీపినం హన్తి..." అను తావున సప్తమికి చతుర్థి బాధక మని యున్నది. కావుననే భర్తృహరి మహాభాష్య దీపిక యందు—

"హన్తేః కర్మ ణ్యుపష్టంభే
ప్రాప్తు మర్థేతు సప్తమీమ్,
చతుర్థీం బాధికా మాహు
శ్చూర్ణిభాగురివాగ్భటాః"

అని వ్రాసినాడు. మహాభాష్యదీపిక యిప్పుడు దుర్లభమయినను ఇది భర్తృహరిరచన యనుటకు సందేహము లేదు. జగదీశ తర్కాలంకారుడు శబ్దశక్తిప్రకాశికయందు ఈ శ్లోకము భర్తృహరి దని యుద్ధరించినాడు (కారక ప్రక. ౭౮౩). ఒకానొకప్పుడు భాగురివ్యాకరణముగాని, సంప్రదాయముగాని లేనిపక్షమున భర్తృహరి యేల యిట్లు వ్రాయును?

భాగురికోశమువలెనే వ్యాకరణము త్రికాండ నామమున ప్రసిద్ధి నొందెనేమో తెలియదు. దానిని భాగురీయవ్యాకరణ మన్నచో అసంగతము కాదు. "అవాప్యో రల్లుగ్వా" అను సూత్ర మందులో కలదు. అందుచే పాణినిసంప్రదాయోక్తి యిట్లున్నది:.

"వష్టి భాగురి రల్లోప మవాప్యో రుపసర్గయోః
టాపంచాపి హలంతానాం యథా వాచా నిశా దిశా"

ఈ ప్రమాణమునుజూచి క్రమదీశ్వరుడు సంక్షిప్తసారగ్రంథమున "అపే రల్లుగ్ ధాతౌ వా" (తిఙ్. ౬౦౯) అని విధించినాడు. గోయీచంద్రు డీ సందర్భమున "అవప్యో ర్యల్లుక్ క్వచి దితి వక్తవ్యమ్" అన్నాడు. హల్ శబ్దము శ్లోకమున విన్నప్పుడు భాగురి వ్యాకరణమున శివసూత్ర మభ్యుపగత మయియుండు ననిపించును. కౌమారసంప్రదాయమున ఈ శ్లోకములోని చివరిచరణములో 'క్షుధా వాచా నిశా గిరా' అను పాఠభేద మున్నది. సంక్షిప్తసార - కృదంతపాద- ౩౬౫ సూత్రవృత్తి టీకలో జౌమరసంప్రదాయ ప్రకారము శేషచరణమున 'క్షుధా వాచా దిశా గిరా' అని యున్నది. ఇతర సంప్రదాయములో ద్వితీయ భాగమున అన్యపాఠాంతరములు కానవచ్చుచున్నవి. సుపద్మవ్యాకరణమున విభక్తిప్రకరణము ౫౦ సూత్రవృత్తిలో "తతో వతంస వహిత పిధాన పిహితాదికమ్" అని యున్నది.

పినద్ధ, పిధానశబ్దములు మహాభారతమున పలు తావుల ప్రయుక్తము లయినవి. తాండ్యబ్రాహ్మణమున పిహితశబ్దము గోచరించును. ప్రాకృతభాషానుకరణముగా భాగురి 'అవ', 'అపి' అనువానికి అల్లోపము విధించినా డనుట సంగతము కాదు. సంక్షిప్తసారమున తిఙన్తపాదములో "హలిజ్ భ్యా మీయాయో రాదేః" అను సూత్రటీకలో "ఇచ్ఛతి భాగురి రంతమకారం ప్రావృడుశిక్ శరదాం దరదశ్చ" అని భాగురివచన ముద్ధృత మైనది.

"వర్త్రికా భాగురీ లోకాయతస్య...వర్త్రికా భాగురీ లోకాయతస్య"అని మహాభాష్యమున పతంజలి పలికినాడు (౭-౩-౪౫). ఇక్కడ భాగురీశబ్దమునకు భాగురిభగిని లక్షిత కావచ్చును. ప్రదీపోద్ద్యోతమున నాగేశభట్టు "వర్త్రికా భాగురీ ఇత్యత్రాపి, వర్త్రికా ఇత్యస్య వ్యాఖ్యాత్రీ ఇత్యర్థః" అని లిఖించినాడు. ఇట్లగుచో దక్షపుత్ర దాక్షి, దక్షకన్యా దాక్షి మొదలగు జాతీయనామములను గమనించి "భగురస్యాపత్యం పుమాన్ భాగురిః, భగురస్యాపత్యం స్త్రీ భాగురీ" అనవచ్చును.

కేవలము వేదమంత్రమునందే కాక పురాణములందుగూడ భాగురియెడల నాదరము కనబడుచున్నది. సప్తశతీషట్‌సంవాదమున "సా కథా కథితా పశ్చాత్ మార్కండేయేన భాగురౌ" అని యున్నది కదా.

పౌరాణికుల మతప్రకారము ఆతని సంపూర్ణ నామము క్రోష్టుకి భాగురి. యాస్కుని నిరుక్తమున క్రోష్టుకినామము కానవచ్చుచున్నది. "తత్కో ద్రవిణోదాః? ఇంద్ర ఇతి క్రోష్టుకిః" (౮-౧). షట్సంవాదమున భాగురినామమునుగూర్చి వ్యాఖ్యాతలు క్రోష్టుకి అతని నామాంతర మన్నారు. నాగేశుని ప్రయోగవిధి యందును "మార్కండేయేన క్రోష్టుకిం భాగురిం ప్రతి ఉక్తం స్తోత్రం జైమినిం ప్రతి పక్షిరూపై ర్మునిపుత్రై రుక్తం మార్కండేయపురాణే..." అన్నాడు. భాగురి జనకుడు భగురక్రోష్టుకనామప్రసిద్ధు డని దీనివలన ఉపపన్న మగుచున్నది. భగురనామము కానవచ్చుట లేదు. కాని క్రోష్టుకనామము సుప్రచారిత మగుటచే భగురపదము లభించుట లే దని తోచును. భాగురి, భాగురీ శబ్దములు గోచరించుటచే పై విధమున భావింప వలసివచ్చినది. భగురస్థలమున భాగురశబ్ద ముచ్చరించినను ఆపత్తి లేదు. [సశేషము]

# ద్రావిడభాషలు ఆర్యభాషలకు విలక్షణములా?

శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

భారతీయభాషలను ద్రావిడభాష లని, ఆర్యభాష లని విభజించుట మామూలైనది. కేవలము ఆర్యులుగాని, కేవలము ద్రావిడులుగాని భారతదేశమున లేరని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. భారతదేశమున వ్యాపించిన సంస్కృతి ఇంచుమించుగా అన్ని ప్రదేశములలోను సమానమేననికూడ చెప్పబడుచున్నది.

సంస్కృతభాష ఆర్యభాషాకుటుంబములోనిదని భాషాతత్త్వవేత్తలు చెప్పుట గలదు. ప్రాచీనపారశీకము, ఆర్మీనియన్, అల్బేనియన్, బాల్టోస్లావానిక్, గ్రీక్, లాటిన్, ట్యూటనిక్, కెల్టిక్ భాషలు ఈవంశములోనివి. తుకేనియన్ కూడ ఈ కూటమిలోనిదే. వీనిలో తుల్య (cognate) పదములు, పదవాక్యనిర్మాణము, సంఖ్యావాచకశబ్దము లుండుటచే వీనికి ఒక మూల ఆర్యభాష ఉండెడిదని శాస్త్రజ్ఞులు కల్పించినారు.

తెలుగు, తమిళము, కన్నడము, తుళు, మళయాళము అనునవి ద్రావిడభాష లని, ఆర్యభాషలకన్న భిన్నము లని కాల్డ్వెల్ ఒక వాదమును లేవదీసినాడు. ఈ కాల్డ్వెల్‌కు సంస్కృతముగాని, వైదికభాషగాని, పాళీప్రాకృతములుగాని తెలియని మాట వాస్తవము. ద్రావిడభాషలు ఆర్యభాషలకన్న విలక్షణములా, కాదా యని విమర్శించుటకు ముందు ప్రాచీన వైదికభాషాచరిత్రను గమనించకతప్పదు.

౧

వైదికభాష సంహితలలోను, బ్రాహ్మణములలోను కలదు. ఇది కేవలము వ్యవహారదశలో నున్న భాష. అనగా ప్రాకృతభాష యని నిరూపింపవచ్చును. కాలక్రమేణ దేశకాలభేదముల ననుసరించి ఈ భాషలో భేదములు బయలుదేరినవి. శబ్దస్వరూపములోనే కాక, అర్థనిర్ణయమునకూడ దేశభేదములు భాషాభేదమును తెచ్చినవని యాస్కపతంజలుల ద్వారా తెలియుచున్నది. అనగా వైదికకాలముననే అనేకప్రాకృతశాఖ లనబడు భాషాభేదములు బయలుదేరినవి. అట్టి ప్రాకృతములలో నొకదానిని సంస్కరించగా నది సంస్కృతమైనది. అనగా సంస్కరించబడిన ఒక ప్రాకృతమే సంస్కృతము. దీనినే Standard Dialect అందురు. కావున ప్రాకృతభాషలను వివేచించువారు వైదికభాషాశాఖలతో పరిచయము గలిగినవారై యుండవలెకతప్పదు. ఈ వైదికభాషలలోని శాఖలు, లేక ప్రాకృతములను అనుసరించి బాష్కల, శాంఖాయన, వాజసనేయ, తైత్తిరీయాదిశాఖ లుద్భవించినవి.

ఇక ప్రస్తుతవిషయము: ద్రావిడభాషలు ఆర్యభాషలకన్న విలక్షణములగుచో, ఈ వైదికయుగములోని ప్రాకృతములకన్నకూడ విలక్షణములా యని ప్రశ్నించకతప్పదు. వైలక్షణ్యము చూపవెంచువారు ఒక విచిత్రకారణమును చెప్పుచున్నారు. శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారు గత కార్తికమాసపు భారతిలో ద్రావిడభాషలలో ఎ, ఒ, చ, జ, ఱ, అరసున్నలు కలవని, ఇవి ఆర్యభాషలలో లేవని సెలవిచ్చినారు. ఈ వాదము విచారణార్హము.

ఆంగ్రమునకే శాఖ, ద్రావిడభాషలలోను, ఆర్య భాషలలోను సహితము తత్సమ, తద్భవ, దేశ్య విభాగ మున్నది. ఈ దేశ్యమును ద్రావిడ మనిన, ఉత్తర హిందూస్థానపు భాషలను సహితము ద్రావిడభాష లవ లని వచ్చునని మరచిపోరాదు. ఐనచో ప్రకృతిలో లేని ఎ, ఒ, చ, జ, ఱలు తెనుగులోని కెట్లు వచ్చినవి? ప్రకృతి యనగా సంస్కృతము అని చెప్పికొనుట పరిపాటి యైనది. కాని సర్వభారతీయభాషలకు మూలము వైదికభాషాశాఖలే నని యంగీకరించకతప్ప దనువారు ఈ ప్రకృతిని వైదికభాష యందురు. ఆ వాదము ననుసరించి ఈ వింతయక్షరములను పరిశీలింతము.

## ౨

ఎకార ఒకారములు వేదమున లేవనుట సాహస వాక్యము. ఋగ్వేదములోని ఈ క్రింది ఋక్కును పరిశీలింపుడు:

"విపృక్షో అగ్నే మఘవానో అశ్యా
ర్వి సూరయో దదతో విశ్వమాయుః
సనేమ వాజం సమిథేషు అర్యో
భాగం దేవేషు శ్రవసే దధానాః" (౧-౭౩-౫)

ఇది త్రిష్టుప్ఛందము. నాల్గు పంక్తులలోను మూడవ యక్షరమును, తొమ్మిదవ యక్షరమును గమనింపుడు. ఇవి హ్రస్వాక్షరము లైననే ఛందస్సు సరియైన లయతాళములు గల దగును. కావున ప్రథమపంక్తిలోని ఒకారము హ్రస్వము. ఇట్లే—

వినూరయః శతిహిమానో అశ్యాః (౧-౭౩-౯)
అర్చంతో అర్కం జనయంత ఇంద్రియ
మధిశ్రియో దధిరే పృశ్నిమాతరః (౧-౮౫-౨)
ఏవానో అగ్నే సమిధా వృధానో
రేవత్పావక శ్రవసే విభాహి (౧-౯౬-౧౧)
వర్ధో అగ్నే వయో అస్య ద్విబర్హా
యాసద్రాయా సరథం యాజునాసి
(౧-౭౧-౬)
మానో మహాంత ముతమానో అర్భకం
మాన ఉక్షంత ముతమాన ఉక్షితం
(౧-౧౧౪-౭)
దేవోనో అత్ర సవితాదమానా
అనాగసో లోచతి సూర్యాయ (౧-౧౨౩-౩)
ప్రతే సుతాసో మధుమంతో అస్థిరన్
(౧-౧౩౫-౧)

ఈ పైపదములలో క్రింద గీతగీచిన ఒకారములు హ్రస్వములే గాని దీర్ఘములు కావు ఇట్లే హ్రస్వమగు ఎకారము సహితము ఋగ్వేదమున విరివిగా వాడబడినది. ఈ ఉదాహరణలను పరిశీలింపుడు:

ఏతా తె అగ్న ఉచథాని వేధో
జుష్టాని సంతు మనసే హృదేచ (౧-౭౩-౧౦)
గోమాతరో య చ్ఛుభయంతె అంజిభి
స్తనూషు శుభ్రా దధిరే విరుక్మతః (౧-౮౫-౩)
క్షయద్వీరసుమ్న మస్మె తె అస్తు
(౧-౧౧౪-౧౦)
మదాయ హృష్ట్వె అస్థిరన్ (౧-౧౩౫-౧)
ఉత చ్యవంతె అచ్యుతా ధ్రువాణి
(౧-౧౬౭-౮)
సవిద్వా ఉభయం చష్టె అంతః
(౧-౧౯౦-౭)

వీనిలో క్రింద గీతగీచిన ఎకారములు హ్రస్వములు కానిచో ఛందము, లయతాళము లను **Metrical Cadence** నాశనము అగును.

కావున హ్రస్వములగు 'ఎ', 'ఒ'లు వైదిక భాషలోనే కలవు. ద్రావిడభాషలనుంచి వచ్చిన వనుట యెంతమాత్రము సమంజసము కాదు. వైదికభాష నుంచియే తర్వాతి ప్రాకృతములలోనికి, దక్షిణదేశ భాషలలోనికి ఎ, ఒ లు సంక్రమించిన వనుట భాషా శాస్త్రసంప్రదాయసిద్ధ మనుట నిర్వివాదము. అనగా ఎ, ఒ లను చేత బుచ్చుకొని ద్రావిడభాషలు విలక్షణములుగా చెప్పుట చెల్లదు. ఆంగ్లమున, ఫ్రెంచిలోను, జర్మనులోను గన్పించు హ్రస్వ ఎ, ఒ లు ద్రావిడ భాషలనుంచి చేరిన వని యనరు గదా.

### 3

ఐ, ఔ అను సంయుక్తాక్షరములు ద్రావిడ భాష లనబడువానిలో లేవని యొక వాద మున్నది. వీనికి బదులు అయ్, అవ్ అని యున్నవని చెప్పుదురు. ఈ అయ్, అవ్ అనునవి కూడ ద్రావిడభాషలలోని సొత్తు గాదని చెప్ప వీలున్నది. సంస్కృతమున, వైదికమునకూడ ఐ, ఔలు కేవలసంయుక్తాక్షరము లని యెంచుట ఒక పెద్ద భ్రమ. పాణిన్యాచార్యుడు "ఏచోఽయవాయావః" అని అవాదేశసంధిని సూత్రించినాడు. ఏ ఐ ఓ ఔ లు సంధిలో అయ్, ఆయ్, అవ్, ఆవ్ అను రూపములను పొందును. వైదికభాషలోని ఈ క్రింది ప్రయోగములను గమనింపుడు:

"వాయ వాయాహి దర్శత" (౧-౨-౧)

ఇచ్చట 'వాయో + ఆయాహి' అను సంధివలన 'వాయవాయాహి' అను రూపము వచ్చినది.

"తా వాయాత ముపద్రవత్" (౧-౨-౫)

ఇచ్చట 'తౌ + ఆయాతం' అని సంధి కుదిరినది.

"ఉపస్తుతా వవతం నాసమానం" (౧-౧౮౧-౭)

ఇచ్చటి సంధి 'ఉపస్తుతౌ + అవతం' అని. ఈ అయాదేశ అవాదేశములవలన తెలియున దేమనగా: దక్షిణదేశభాషలలోని అయ్, అవ్‌లు ఈ సంధిగత రూపముల నుంచియే ఉత్పన్నము లైనవి.

### ౪

తర్వాత తెలుగున క్రొత్తగా కన్పించు అక్షరములు ౘ, ౙలు. వైదికసంస్కృతములలో చ, ఛ, జ, ఝలు మాత్రమే యున్నవి. కాని ప్రాకృతమున ఆంధ్రమహారాష్ట్రీభాషలలో ౘ, ౙ, లు కలవు ప్రాకృతమున ఛ, ఝలుకూడ నున్నవి. సంస్కృతములోని తాలవ్యములగు చ, ఛ, జ, ఝలు చాలవరకు మూలఆర్యభాషలలోని కంఠ్యములకు ఇకారఎకారములు పరమ మైనపుడు తాలవ్యము లైనవని తాలవ్యీకరణసూత్రము (Law of Palatalization) చెప్పుచున్నది. ఒక్క 'ఉజ్ఝతి' శబ్దములోని ఝకారమే మూలఆర్యభాషలోనిది. కాగా తాలవ్యాక్షరములగు చ, ఛ, జ, ఝలు ప్రాచీనకంఠ్యములనుంచి నిష్పన్నము లైనవి. వీనితోపాటు నిష్పన్నమైనవే ౘ, ఛ, ౙ, ఝలుకూడ. కాని ఇవి ప్రాకృతమున నిలచినవి. సంస్కృతమున వీనిని వదలివేసినారు. ఆంధ్రమహారాష్ట్రులు ౘ, ౙ లను మాత్రమే నిలిపికొనినారు. కాని వ్యావహారికమగు 'ఉంఛాడు' గమనింపుడు.

### ౫

ఇక శకటరేఫ మున్నది. సంస్కృతమున నిది లేని మాట వాస్తవమే. కాని కొన్ని తెనుగుపదములను గమనించిన మంచిది. 'గుఱ్ఱము' అనునది 'ఘోడా' అని హిందీలోను, 'ఘోటా' యని సంస్కృతమునను కలదు. ఇచట ట, డ, ఱలు తుల్యాక్షరము లనవచ్చును. తాడికొండ అను శబ్దము అత్తివర్మగోరంట్ల శాసనమున తాన్తికొన్త అని గలదు. తాళశబ్దమే తాడిగా ప్రస్తుతము వాడబడుచున్నది. అనగా ల, ళ, డ, ఱలు అభిన్నాక్షరము లని తెలగలము. కావున శకటరేఫాన్వేషణలో వైదికసంస్కృతప్రాకృతములలోని, ళ, ష, డ, ర లు విచారింపబడవలెను. వీనికి, ఱ-కు భేదము లేదు.

శకటరేఫ విచారణకు పదాంతనకారము కొంత సాహాయ్య మొసగు నను వాదము చూతము. రెండును నాసికాక్షరములుగా తమిళమున స్వీకరింపబడినవి. ఱ యనునది పరుషము. పదాంతనకారము సరళము. ఈ పదాంతనకారము తమిళభాషల వైలక్షణ్యమును చూపజాలినది కాదు. దీనికి, సంస్కృతమందలి అనునాసికలకు అతిసన్నిహితసంబంధ మున్న దనుటకు దీని పరిణామమే ఆధారము. ఈ పరిణామమున ఉకారచరిత్ర కొంత యున్నది.

### ౬

ఒకానొక కాలమున తెనుగులో స్వరచలనము (Shift of Accent) కలిగినదని, అందుచే ప్రాచీన భాషలో హలంతములైన శబ్దములు తెలుగులో నొక

'ఉ'కారము నూతగా గ్రహించి అజంతము లైన వని చెప్పుదురు. స్వర మనునది ఆర్యభాషలలో వలె ద్రావిడభాషలలో కలదా యని ప్రథమ ప్రశ్న. ఆర్యభాషలలో రానురాను స్వర మంతరించి, తెలుగులోని అరసున్నవలె గ్రంథస్థమై పోయినది. ఈ స్వరము ద్రావిడభాషలలో లేదు. కాని వ్యవహరింపబడు భాషకు స్వర మేదో రీతిగా నుండు నని యొప్పికొందము. స్వరచలనమువలన 'ఉ' కారమే యేల రావలె నని రెండవ ప్రశ్న. ఉకారాంతత్వము తెలుగుభాషవిశిష్టత. అట్టివానిని స్వరచలనముతో ముడి పెట్టరాదు.

ఈ ఉకారము వైదికప్రాకృతములలోనిది. వైదిక భాషలో ప్రయోజనాపేక్ష లేకయే, ఉచ్చారణము కొరకై పదములు కొన్ని ఉకారాంతము లైనట్లు కన్పించును.

"ఇహ బ్రవీతు య ఉ తచ్చికేతత్" (౧-౩౫-౬)

అనుచో ఉకారమునకు ప్రయోజనము లేదు. కాని—

"ఉరుం యజ్ఞాయ చక్రథు రులోకం"

(౧-౯౩-౬)

ను ప్రయోగమున "చక్రథుర్ఉ" అని విడదీసిన క్రియాపదమున ఉకారము రాగలదు. లేనిచో 'ఉలోక'మను శబ్దము రాగా, తమిళమున నిది 'ఉలగ' మైనది. దీనిని Prothosis అనినారు.

"అర్థమిద్వా ఉ అర్థిన
ఆజాయా. యువతే పతిం" (౧-౧౦౫-౨)

అనుచోట ఉకారముతో 'ద్వాఉ', లేక ఉచ్చారణములో 'ద్వావు' అని యున్నది. ఇట్లే 'బర్హిరు', 'తాభిరు' మొదలైనవి :

"యత్స్రుచా బర్హి రుత్తిరాణా"(౧-౧౦౭-౪)

"తాభిరూషు ఊతిభి రశ్వినా గతం" (౧-౧౧౨)

అని మనుటము కన్పించుచున్నది. ఇదేరీతిగా 'రాయ' శబ్దమున ఉకారము చేరగా 'రాయను' అనిగాని, 'రాయవు' అనిగాని యేర్పడును :

"ఆభోగయ ఇష్టయే రాయ ఉత్వం"

(౧-౧౧౩-౫)

ఇట్టివే గాక మరికొన్ని విశిష్టప్రయోగములు కలవు. వానిని గమనించిన సంశయనివృత్తి కాగలదు.

అదు, ఇదు, ఉదు అను ప్రాతిపదికల నాశ్రయించుకొని కొన్ని శబ్దములు ద్రావిడభాషలలో బయలు దేరిన వనిన కాల్డ్వెల్, అతని అనుయాయులును ఈక్రింది ప్రయోగములను గమనించవలెను:

"తతం మె అప స్తదు తాయతే పునః
స్వాదిష్ఠా ధీతి రుచథాయ శస్యతే
అయం సముద్ర ఇహ విశ్వదేవ్యః
స్వాహాకృతస్య సము తృప్ణుత ఋభవః"

(౧-౧౧౦-౧)

"ఉద్రుస్య దేవః......స్థాత్" (౨-౩౭-౧)

"నేద్రు హోతా" (౩-౪-౧౦)

ఈ ప్రయోగములలో 'తదు', 'సము', 'ఉదు', 'ఇదు' అను శబ్దములకు ఉకారము చేరుట కలదు. ఇవి సంస్కృతమున హలంతములు. కాని వైదికమున అజంతములుకూడ నని, ఈ అజంతములే తెనుగులోనికి వచ్చినవని తెలియగలదు.

"ప్రార్వా ఏ జగద్రుస్వ్యేనో రాయో అఖ్యక్"

(౧-౧౧౩-౪)

"యత్రు క్రియాదమేషు" (౨-౭-౩)

"సత్రు క్షేయాక్" (౩-౭-౪)

"తిప్ర ఉతే" (౩-౨౦-౨)

"అస్మాభి రూను ప్రతిచక్ష్యాభూత్"

(౧-౧౧౩-౧౧)

"యాత్రు చాయవః" (౩-౨౪-౬)

"సదృశీ రద్య సదృశీరిద్రు శ్వో" (౧-౧౨౩-౭)

"స్వస్తు లోకే" (౩-౨౯-౭)

"వ్యుప్రథతే వితరం వరీయ" (౧-౧౨౪-౫)

"ప్రియాద్రుచిన్మన్మనః ప్రేరో అస్తుతే"

(౧-౧౪౦-౧౧)

"తురయా ఉగమ్యః" (౪-౨౩-౧౦)

"యాతు త్రిధాతు పృథివీ మతద్యాం"

(౧-౧౫౪-౪)

"అస్య వాసా ఉ అర్చిషా" (౫-౧౭-౩)

ఇత్యాది ప్రయోగములలోని ఉకారాగమము చిత్రమైనది.

అర్థవంతములైన ప్రయోగములలో సమ్మేళనము నందు ఉకారమును గమనింతము.

"ఇమా తే" (౩-౩౮-౨; ౩-౫౭-౪; ౪-౩-౨)

"ఇమా ఉ షు" (౨-౬-౧)

వీనిలో ఉకారము చేరగా ఉచ్చారణలో 'ఇమావు' అని వచ్చును. తెనుగులోని 'ఇవి' 'అవి' యనువాని పూర్వరూప మిచట లే దనలేము.

"దివి యద్దు ద్రవిణం యత్ పృథివ్యాం" (౪-౫-౧౧)

అనచో యచ్ఛబ్దమున దుగాగమము కలిగినది. యత్ అనగా 'ఏది' యని అర్థము. 'యదు' 'ఏది' అను శబ్దములు సమానజాతీయకములే కదా.

"అయాంసము మఘవద్భ్యః" (౨-౩౫-౧౫)

అను ప్రయోగమున క్రియాపదమునకు ముకారాత్పరమైన ఉకారము ఉత్తమపురుష బహువచనమునకు మూలము.

"ఏవిందన్ను దర్శతం" (౩-౧-౩)

అనుదానిని 'తెలిసికొనుచున్ను', 'చేయుచున్ను', 'వచ్చుచున్ను' మొదలగువానిలోని అంత్యద్విత్వనుకారనుతో పోల్చ వీలున్నది.

ఇంతేకాక ఏతచ్ఛబ్దమునకు "ఏతమ్ముత్యం" (౯-౧౫-౮) అను ప్రయోగమున 'ఏతము' అను రూపము కన్పించుచున్నది. ఈ క్రింది ప్రయోగములను గమనింపుడు :

"తము ష్టుహీంద్రం" (౧-౧౭౩-౫)
"తము స్తోతారః" (౧-౧౫౬-౩)
"త్వం త్రాతా త్వము నః" (౧-౧౭౮-౫)
"తము త్వా వాజినం నరః" (౯-౧౭-౭)
"తము త్వా సత్యసోమపా" (౬-౪౫-౧౦)
"తము త్వా యః పురాసిథ" (౬-౪౫-౧౧)
"తముష్టవ ఇంద్ర" (౨-౨౦-౪)
"తము తే గావః" (౬-౪౦-౨)
"త్వాము వో అప్రహణంగృణీషే" (౬-౪౪-౪)
"తము ప్రహోషి" (౬-౪౪-౧౪)
"త్వాము నః పరస్పాః" (౨-౯-౨)
"తము నస్త వామ" (౪-౩౯-౧)
"తముష్టుహి" (౫-౪౨-౧౧; ౬-౧౮-౧)
"తము స్తవ ఇంద్రం" (౬-౨౧-౨)
"తము నః పూర్వే పితరో నవగ్వాః" (౬-౨౨-౨)

మొదలగు ప్రయోగములలో 'తము', 'త్వాము' అని కలదు. ఇట్లే—

"ఇదముత్య త్పురుతమం" (౪-౫౧-౧)
"ఇదముత్యా న్మహిమహా మనీకం" (౪-౫-౯)

అనుచో 'ఇదము' కలదు. ఈ 'ఇదము' లోని ఉపధామకారము లోపింప తమిళమున 'ఇదు' బయలు దేరినది. ఇంతేగాక 'కిము' అనికూడ గలదని—

"కిముష్విద స్మై" (౪-౧౮-౭)
"కిమ్వస్య పీతా వింద్రః" (౬-౨౭-౧)
"కిమోను వః కృణవామ" (౨-౨౯-౩)
"కిము శ్రేష్ఠః" (౧-౧౬౧-౧)

అను ప్రయోగములవలన తేలుచున్నది. పైగా—

"వయము త్వా గృహపతే" (౬-౧౫-౧౯)

అనుటవలన 'వయము' (=మేము) అను శబ్దము కూడ ఉన్నది. ఈ 'వయము'నకు, 'మేము'నకు తుల్యజాతీయత కలదు.

"అన్యదు" (౬-౨౪-౪)
"తదుషు ప్రవోచం" (౧-౧౬౪-౨౬)

అను ప్రయోగములలో 'అన్యదు', 'తదు' అను రూపములు కన్పించుచున్నవి. 'తాన్' అనుటయేకాక, వైదికకాలమున 'తాను' అనికూడ అనెడివా రని—

"తాను మే పుంస ఆహుః" (౧-౧౬౪-౧౬)
"తాను పరాఞ్చ ఆహుః" (౧-౧౬౪-౧౯)
"తాను అర్వాచ ఆహుః" (౧-౧౬౪-౧౯)

ఇత్యాది ప్రయోగములవలన గానవచ్చుచున్నది.

ఇంకొక విశేషము కలదు. ఈ క్రింది ప్రయోగములను గమనింపుడు :

"ఘృత మ్యస్యధామ" (=ఘృతము+అస్య) (౨-౩-౧౧)

"తౌసా మేకా మదఘు ర్మగ్ని ర్భుజము
లోకము ద్వే ఉపజామి మీయతుః" (౩-౭-౯)

ఇత్యాది ప్రయోగములలో స్పష్టముగా 'ఘృతము', 'భుజము', 'లోకము' అను రూపములు ఉకారాంతములుగా కన్పించుచున్నవి. కావున తెనుగులోని ఉకారాంతత్వము వైదికప్రాకృతనిష్ఠము. దీనిచే వైదికకాలమందలి ఆర్యభాషాశాఖలలో నొకదానినుంచి తెను గుత్పన్న మైన దని నిష్కర్షగా చెప్పవీలున్నది. కాగా స్వరచలనము మొదలగు ద్రావిడప్రాణాయామములతో నీ ఉకారోత్పత్తినిగాని, తెనుగు భాషయొక్క మూలరూపమునుగాని పరామర్శించుట యుక్తము కాదు. కాబట్టి వైదికభాషలో కొన్ని శబ్దములకు ఉకారము చేర్చు ఆచారము కలదు. ఈ ఆచారమే కొన్ని ప్రాకృతములకు వచ్చి, తెలుగులోనికి వచ్చిన దని పై దృష్టాంతములవలన ఋజువు కాగలదు.

౭

తెలుగులోని అర్ధానుస్వారము సంస్కృతమున గల అనునాసికనకారపరిణామమే కాని వేరు గాదు. అనునాసికాక్షరములు కొన్ని మూలఆర్యభాషలలో దీర్ఘములుగూడ ఉండెడివని, హ్రస్వములలో కొన్ని వైదికసంస్కృతములలో అకారముగా మారినవని భాషాతత్త్వశాస్త్రము చెప్పుచున్నది. తొమ్మిది అను అర్థము గల 'నవ' శబ్దమునకు సమానజాతీయము (cognate) ఆంగ్లమున 'నైన్'అని, జర్మన్‌లో 'నాయ్న్'అని కలదు. వీనిలోని ద్వితీయనకారము అనునాసికము. ఇది సంస్కృతమున అకారమైనది. ఇట్టి పరిణామమే తెనుగునకూడ సంక్రమించుటచేత అనునాసికాక్షరము క్రమేణ తెనుగులో ఉచ్చరింపబడక పోయినది. తత్స్థానే అర్ధానుస్వారము మిగిలినది.

పదాంతనకారము పుంలింగవాచక మని, మనకు తెలియబడని స్వరచలనమువలన నీ నకారము ఉకారమును గ్రహించిన దని, స్వరయుక్తముగ నిది పలుకబడుటచే ఉకారము కొంత ఒత్తిపలుకబడిన దని, తమ్మిలమున అనునాసికాద్వారము మూతపడగా నకారస్థానీయమగు పరుషధ్వనియగు 'ట'కారము వచ్చిన దని, ఈ సంయుక్త 'న్టు' క్రమముగా 'న్డు' ఐన దని 'డు' ప్రత్యయచరిత్రగా కాల్డ్వెల్, అతని అనుయాయులు పల్కు వాదము. ఇచ్చటి యూహలను గమనింపుడు. స్వరచలనమువలన హలంతశబ్దములకు ఉకారము చేరిన దని మొదటి యూహ. ఇది స్వరయుక్తము కాగా ఒత్తిపలుకబడిన దని రెండవ యూహ. "న్ + ఉ" అనునది ఒత్తి యేల పలుకబడవలసిన అగత్యము వచ్చినదో పరమాత్మున కెరుక. ఈ యూహ నాశ్రయించుకొని 'ట' వచ్చిన దని మూడవ యూహ. పై యూహ పొసగదుగాన, ఈ యూహకు తావులేదు. ఈ 'ట' యనునది 'డ'గా ధ్వనించ 'న్డు'వచ్చిన దనుట నాల్గవ యూహ. ట డ లు మూర్ధన్యాక్షరములే. ఈ పాపమున జేసి టుగాగమము సిద్ధించవలె నన్నారు.

శకటరేఫము ద్విత్వమైన ద్విత్వటకారోచ్చారణ తమిళమున గలదు. సంస్కృతమందలి సంయుక్త టకారముకూడ ప్రాకృతమున ద్విత్వటకార మగుట కలదు. 'కాష్ఠం' కట్టె యైనది. కష్టముకూడ మూలము కాష్ఠమే. 'గిరి' యనునది 'గుట్ట'గా మారిన దని గమనించినచో కేవలరేఫముకూడ ద్విత్వటకార మైనట్లు ప్రాకృతమున కన్పించును. షకార టకార రేఫములుకూడ ద్విత్వటకారము నిచ్చినవి. ఉష్ట్రము ఒంటె యైనది కాని రాష్ట్రము 'రట్టె'యై 'రచ్చ' కూడ నైనది. అనగా ద్విత్వటకారము కన్పించిన మాత్రమున ద్విత్వటకారమునుమాత్రమే చూచి భ్రమింపరాదు.

ఐనచో 'డు' ప్రత్యయ మెట్లు వచ్చినది? ఈ 'డు' అనునది 'న్డు', లేక 'ణ్డు'గా కన్పించుచున్నది. అనగా 'న్ + డ్ + ఉ'లు కలవు. అంత్యఉకారము వైదికయుగపు ఒక భాషాలక్షణము. 'న్'కు పూర్వము ఉకారము గాని అకారముగాని యుండుటచే 'అన్', 'ఉన్' అనునవి ప్రత్యయప్రాతిపదికలు. మతుబర్థకముగా కన్పించు 'వాన్'నుంచి 'వాన్ + ఉ' వచ్చి, ఉచ్చారణలో మధ్య డకారాగమము సంప్రాప్తించ వచ్చు నను సమాధానము కుదురును. సంస్కృతపుంలింగ శబ్దముల ప్రథమైకవచనములకు 'అన్', 'ఉన్'లు

చేరగా 'రామః', 'శంభుః' అను రూపములు కలుగు చున్నవి. ఈ అంత్యసకారమే తెనుగున 'ను'కార మైనది. 'అయస్'నుంచి 'ఇనుము' తెనుగున రాగా, ఆంగ్లమున 'ఐరన్' వచ్చుటల్లో సకారనకారములు తుల్యము లని తేలుచున్నది 'అస్' అను సంస్కృత ధాతువు జర్మనులో 'సైన్' ఐనది. మాసశబ్దమునకు లాటిన్‌లో 'మెన్సిస్', ఆంగ్లమున 'మంత్' గలవు. ఈ విధముగానే 'అద్', 'అన్న', 'అశన' అను వానిని గమనింపుడు. వీటి అన్నింటివలన తేలున దేమనగా: నకారసకారములు సమానాక్షరములని, సకారమునకు బదులు నకారముకూడ తుల్యపదములలో ఆర్యభాషలందు గలదని. ఇదే తీరున 'రామస్' తెనుగున 'రామన్' అని కాగా, దీనికి మరల ప్రథమా ప్రత్యయము 'డు' చేర్పబడినది. ద్విబహువచన ప్రత్యయములవంటి దగు నిది వేదప్రసిద్ధము.

సంస్కృత 'మనస్' లాటిన్‌లో 'మెన్స్' గాను, ఆంగ్లమున 'మైండ్'గాను కన్పించుచున్నది. కాని దంతశబ్దము ఆంగ్లమున 'టూత్' కాగా, లాటిన్‌లో 'డెన్స్'అని కన్పించుచున్నది అనగా నకారమునకు పరముగు సకారమునకు ఆర్యభాషలలో తకారముగాని, డకారముగాని కూడ కన్పించుచున్నది. స్వనశబ్దము లాటిన్‌లో 'సోనుస్'అని, ఆంగ్లమున 'సౌండ్'అని కలదు. ఇదేవిధముగా 'రామస్' అనునది 'రామన్' కాగా ప్రథమావిభక్తిప్రత్యయముగు 'డు' చేర్పవలెను.

'రామ్ + అన్ + స్' అని నిల్వగా పై యుదాహరణలు పల్కురీతిగా సకారమునకు డకారము రాగా 'రామ్ + అన్ + డ్'అను రూపము వచ్చును. తెనుగునకు వైదికభాషలనుంచి సంప్రాప్తమైన అంత్యఉకారము చేర్పగా 'రామండు' అని నిల్వగా, అంత్యఉకారము పూర్వమందలి అచ్చును మార్చ రాముండు అను రూపము నిష్పన్నమైనది.

ఇదేవిధముగా 'శంభ్ + ఉ + స్' అని నిల్వగా 'స్'కు బదులు న్ వచ్చినది. 'శంభ్ + ఉన్ + స్' అని రాగా స్‌కు బదులు డ్, తర్వాత ఉ చేరగా శంభుండు అని వచ్చును.

ప్రాచీనశాసనములలో డ, లలను పోలిన యక్షరము 'డ'గా ఉచ్చరించవలెను. డకారము ఒత్తక్షరముగా వ్రాయుచో నీ'ఱ' అను రూప మొకానొక కాలమున నున్న దనజెల్లును. ఈ అక్షరము ఱ, ట, డ అని క్రమేణ మారినది. అచ్చువాన్డు, అచ్చినవాన్డు అను దిమ్మగుడి పొట్లను త్రిశాసనములలోని రూపములవలన నకారపరముగు 'ఱ' యనునది డకారమే నని తేలగలదు, తొమ్మిదవ శతాబ్దిలోని పాండురంగని అద్దంకిశాసనములోని 'కొట్టంబు ల్వన్డాండు' అను ప్రయోగమును గమనించినచో నాకాలమున వ్రాయడిని 'ఱ' తో కూడ నిర్దేశించి రని, ఱ యను వేరొక యక్షరము కాదని తేలగలదు. యుద్ధమల్లుని బెజవాడ శాసనములోని 'పాపంబు గొన్డు' కూడ ఇట్టిదే నని వేరుగా చెప్పనక్కరలేదు, కాగా ఱ, రలకు భేదము లే దని బోధపడుచున్నది.

సంఖ్యావాచకములను గమనించిన ఆర్యభాషలలోనే రెండు రకముల సంఖ్య లున్నవని యెంచ వీలున్నది. ఏకశబ్దమునకు, ఆంగ్లమందలి 'వన్'కు, జర్మన్‌లోని 'ఐన్'కు సంబంధము లేదు. ఏకశబ్దము 'ఒకటి' సన్నిహితములు. 'ఐన్' 'వన్'లకు 'ఒన్'కు సంబంధమున్నది. రెండు, మూడులలోని చివరి 'న్ + డ్ + ఉ'లు వెనుకటి ప్రథమావిభక్తిప్రత్యయమువలె సాధింపబడదగినవి. 'మూన్డు' అని వ్రాసినను 'ఱ'ను 'డ'గనే ఉచ్చరింపకతప్పదు. ఈ ఱ యనునది దకారముగా మారుట కూడ కలదు. అనగా డ, ద యనునవి అభిన్నాక్షరములు. వేదమున సహితము త, దలకు బదులు ట,డలు కన్పించుట కలదు.

కొన్ని యుదాహరణలను గమనింతము: 'అహన్' అను శబ్దము 'అహన్' అని కూడ కన్పించుచున్నది. దీనికి తుల్యశబ్ద మాంగ్లమున 'డే' యని, 'టాగ్' అని జర్మన్‌లోను గలదు. దివశ్శబ్దముతో కొంత సాంకర్యమున్నను, వీనికి సమానమగు పదము అహన్, లేక అహన్. హాకారము యకారగకారములుగా కన్పించుచున్న దనగా నిది మూలఆర్యభాషలలో ఘకారమై యుండవలెను. కావుననే 'అహం' 'ఏగో' గా మారి 'ఇక్' 'ఐ'గా నైనది. అనగా ప్రాచీన ఘకారము హాకారము

కావలెననిన అనునాసికాన్వితము కావలెను. 'మాం', 'మయా', 'మహ్యం' ఇత్యాదివిభక్తులలోని ఆద్యమకారమును, ఆంగ్లమందలి 'మై', 'మైన్'లను, హిందీలోని 'మైం', 'మేరా' లను గమనించిన అహం శబ్దములోని ఆద్యాక్షరము అనునాసికాక్షర మని తేలగలదు. అనగా "అనునాసిక + అనునాసికాన్వితము 'గ' కారము + నకారము" దక్షిణభాషలలో సంప్రాప్తించగా నేను కటివలెనే 'న', 'ను'లు చేరగా 'నాండు' వచ్చినది.

'తింపి' యను శబ్దము తృణశబ్దభవము. ఋ, ర లు తుల్యములు. 'తృ' యనునది 'తిర్'గా మార, వర్ణవ్యత్యయముచే 'త్రిని' వచ్చి, తర్వాత 'తింపి' యైనది. ఉష్ణశబ్దమును గమనించిన ష, డ, ర, ల లకున్న తుల్యత బోధపడగలదు. ష, డ, రలు అభిన్నములుగాన ఉష్ణ యనునది 'ఉష్ణ' లేక 'ఉర్ణ' కాగా, వర్ణవ్యత్యయమున ఉన్ఠ సంప్రాప్తించి ఎండ యైనది.

సంస్కృతశబ్దమగు 'ఈరణః' (=గాలి) అనునది 'ఇర్' ధాతుజము. ఇదే 'తెమ్మెరల్' అనుచో 'ఇరల్'గా గన్పించుచున్నది. ఇచట ణ (=న) కారము లకారముగా మారుట కలదు. ఇచట 'ఇరల్' అనుటకు బదులు ద్రావిడభాష లని వాదించువారు 'ఎరల్' కల్పించిరి. తేమతో కూడిన గాలి కొట్టి తెమ్మ + ఇరల్ కాగా 'తెమ్మెరల్' అని యైనది.

పదాంతనకారము మకారమై 'పాలము' ఐన దని, అట్లు గానిచో 'క్రూను', 'కొలను'ల వలె నుండెడి దని చెప్పుచున్నారు. అనగా 'పాలము'నకు పూర్వరూపము 'పులన్' కావలెను. వండిన బియ్యము, లేక అన్నపు గంజి యను అర్థ మొసగు 'పులాకం' అను శబ్దమును గమనింపుడు. 'కొలను'కు పూర్వరూపము 'కుళన్' అనిన, 'కూలం' అను సంస్కృతశబ్దముతో సమానజాతీయత అంగీకృతమే గదా. ఇట్లే 'మ్రోగు' అను శబ్దమును సంస్కృతములోని 'మురజ', 'మృదంగ'ములతో పోల్చుడు.

## ౭

వైదికయుగములోని ప్రాకృతములనుంచి భారతదేశభాషలన్నియు ఉత్పన్నము లైనవి. ఈ ప్రాకృతములలో నొకటి సంస్కరింపబడి రాజభాష కాగా నది సంస్కృత మైనది. తెనుగుకూడ అట్టి ప్రాకృతములనుంచియే జన్మించినది. కావుననే సమానజాతీయక పదములు కొన్ని సంస్కృతమున గన్పించకపోయినను, ఇతరఇండోయూరోపియన్ వంశభాషలలో దొరకుచున్నవి. కొన్ని ఉదాహరణలను గమనింతము:

'స్రాతి' యని తెలుగు. తమిళమున 'పఋమ్' అని కలదు. గ్రీకుభాషలో 'పత్రైయోస్' అని కలదు. తమిళములోని 'కుళిర్', తెనుగు 'చలి', ఆంగ్లమందలి 'కూల్' సమానజాతీయకములు. జర్మన్‌లోని 'కుర్ట్స్', తెనుగులోని 'కురుచ' తుల్యములు. లాటిన్‌లోని 'లిక్నోస్'కు, తెనుగులోని 'రాతి'కి సన్నిహితబాంధవ్య మున్నది. ఈవిధముగా సమానజాతీయక పదము లనేకములు సంస్కృతమున దొరకకపోయినను, వైదికభాషలోగాని, లేక అన్యఇండోయూరోపియన్ భాషలలోగాని కన్పించుచున్నవి. వీటిని అన్నింటిని సమగ్రముగా పరిశీలించిన ద్రావిడభాష లని ప్రత్యేకించి ఆర్యభాషావిలక్షణములగు భాషలు భారతభూమిలో లే వని తేలగలము.



# ధర్మంకోసం

[ కథానిక ]

●

**శ్రీ రా. సి. ఆంజనేయశాస్త్రి**

సుబ్రహ్మణ్యం జీవితంలో సుఖమనేది ఎరగడు.

ఆ మాటకొస్తే నిజాని కతను కష్టాలనుభవించిందీ లేదు, నిరుడు భార్య పోవటంతప్ప. ఇంటర్మీడియేటు ఒకటికి రెండుసార్లు తప్పేసరికి, యిక అలాంటి పనులు చెయ్యడం భావ్యంకాదని తాలూకాఫీసులో గుమాస్తాగా చేరేశాడు. దాంతోటి లంగరుపడింది అతని భావవిహారానికి. బి. ఏ. ప్యాసైనాక ఎం. ఏ. కు వెడదామని కాస్సేపూ, లా చదువుదామని కాస్సేపూ మథనపడి అసలు ఏ ఐ. సి. యస్. కో పోతే, అలాగ్గా జిల్లాకలెక్టరవవచ్చుగదా అని ఆఖరికి ఐ. సి. యస్. కే పోదామని నిర్ణయించుకున్న రోజులుకూడా వున్నాయి సుబ్రహ్మణ్యం, ఇంటర్మీడియేటు చదివేకాలంలో. కవిత్వంకూడా రాసేవాడు అప్పుడప్పుడు. కెమెరా కొన్నాడు ఆ వేసవిశెలవులలో "ఫొటోగ్రఫీ"ని క్షుణ్ణంగా మథించివేద్దామనే ఉద్దేశంతో. ఆటల్లోనూ పాటల్లోనూ ముందుకు తోసుకొచ్చేవాడు. "అతి చురుకు" అని ఆక్షేపించినవాళ్లు కూడా లేకపోలేదు. కాని తాలూకాఫీసులో చేరిన తర్వాత అతని తరహా అంతా మంత్రకట్టుగా మారిపోయింది. సరే, ఆయేడే పెళ్ళికూడా కావటంతో సాంతం పెద్దవాడై వూరుకున్నాడు. తన ఆఫీసేమో యిల్లేమో! అంతేగాని మూడోవిషయంలో జోక్యమే కల్పించుకునేవాడు కాదు. దేశసేవచేద్దామని ఒకప్పుడు ఉరకలెత్తించిన అతని రక్తంలోని వేడికూడాలం సాంతం చల్లబడి, ఆఖరికి ఖద్దరుబట్టలకు సైతం స్వస్తి [illegible]

ఎంతమాత్రం పనికిరాననీ, తాను కేవలం అసమర్థుడిననీ, స్వార్థపరుడిననీ స్నేహితులముందు చాలాసార్లు ఒప్పుకున్నాడుకూడాను. జాతీయోద్యమం మహోద్రేకంతో నడిచిన రోజుల్లోకూడా సుబ్రహ్మణ్యం ఎంతమాత్రం చలించకుండా, తాలూకాఫీసు గుమాస్తాగా తాను నిర్వహించవలసిన పనిని ఎంతో సక్రమంగా నిర్వహించి దేశభక్తుల విమర్శనకూ, రాజభక్తుల పొగడ్తకూ గురయ్యాడు చాలాసార్లు. చెడబరువురికాగుల్ని ప్రతి రోజూ యింటికి మోసుకొచ్చి, అర్ధరాత్రీ, తెల్లారుఝామునాకూడా రాస్తూ పై అధికారుల నోటిమెప్పు పొందటమూ, తీరా వాళ్లు బదిలీఅయి వెళ్ళేసమయంలో యితన్నిగురించి నానా ఆభాసుగానూ రాయడమూ, ఆ కారణంగా ఉద్యోగంలో ప్రమోషను లేకపోవడమూ అతనికి మామూలైపోయింది. ఇంట్లోమటుకు ప్రతి రెండేళ్ళకీ ఒకశిశువు ఉదయించడంవల్ల క్రమం తప్పకుండా కుటుంబాభివృద్ధి మాత్రం జరుగుతూ వచ్చింది. అదేం శాపమోగాని పుట్టిన మొగపిల్లలంతా ఆరోనెలలోపుగానే పోతూవచ్చారు. అందువల్ల ఎనమండుగురు ఆడపిల్లలుమాత్రమే మిగిలారు. మొదటి పిల్లను మేనరికంయిస్తే, తనకాపరం తను చేసుకుంటోంది. కాస్త ముదురయినా, యింత తిండానికుందని రెండోపెళ్ళివాడి కిచ్చాడు రెండోపిల్లని. మూడోపిల్ల పెళ్ళికి అదీయిదీ పోగుచేసి రెండువేలు ఖర్చుచేశాడు. అన్నవస్త్రాలకు లోటులేని సంబరధమే వచ్చింది. అంతవరకూ అతను డబ్బుకి యిబ్బందిపడలేదనే [illegible]

కాని మాయదారి యుద్ధం వచ్చినతర్వాత అతని పని కిచకిచయిపోయింది. గుంపెడు పిల్లలూ, వచ్చేపోయే బంధువులూ, నాలుగువేళ్ళూ నోట్లోకెళ్ళడమే కష్టమయిపోయే కాలంలో ఆ పరమాత్ముడి దయవల్ల డిప్యూటీ తాసిల్దారు పని అయింది. ఏదో సంసారం వెళ్ళిపోతోందే తప్పితే, కాలూ చెయ్యీ కూడదీసుకుని పిల్లల పెళ్ళి చేసే అవకాశంమటుకు కనిపించలేదు. "మంచిరోజొచ్చినపుడు చూసుకుందాంలే! నాలుగు ముక్కలు చెప్పిస్తే వాళ్ళ మొగుళ్ళని వాళ్ళే తెచ్చుకుంటారు." అనే వేదాంతంలోదిగి పిల్లల పెళ్ళిమాటే తలపెట్టకుండా చదువులు చెప్పించడం మొదలెట్టాడు తెగించి. పెళ్ళీ పేరంటం లేకుండా తనంత ఎత్తు ఎదుగుతున్న కూతుళ్ళను చూస్తే జానకమ్మకు మొదట్లో కాస్త ఎబ్బెట్టుగావుండి "సంబంధాలు చూడండి" అంటూ భర్త సుబ్రహ్మణ్యాన్ని పోరేది కాని, "ఇవి ఒడుగులూ పెళ్ళిళ్ళూ చేసే రోజులా? ప్రతివస్తువూ మండిపోతుంటే!" అని భర్త అనేసరికి ఏమీ చెప్పలేకపోయేది. "ప్రతి వస్తువూ" అనే పదంలో పెళ్ళికొడుకులు కూడా చేరుతారని జానకమ్మకు వెంటనే స్ఫురించేదికాదు. తండ్రి మాటలలోని ధ్వనిని యిట్టే కనిపెట్టిన కూతుళ్లు ముసిముసి నవ్వులు నవ్వుకుంటుంటే ఆఖరికి జానకమ్మకు కూడా అర్థమయి ఫక్కున నవ్వేది. "ఏమో బాబూ! మీ అర్థాలూ మీరూను... నేనేమీ చదువుకున్నదాన్ని కాదయ్యో!" అంటూను. అదీ గాక సబ్ జడ్జీగారి అమ్మాయిలకీ, ఇన్స్పెక్టరుగారి అమ్మాయిలకీ బిడ్డల తల్లుల్లాగా పెరిగినా కూడా పెళ్లిళ్లు చేయక పోవడంవల్ల జానకమ్మకు కొంచెం మనోధైర్యంగా వుండేది. పెళ్లిళ్ల ప్రసంగం వచ్చినప్పుడు "చదువు పూర్తి కానియ్యండి నాన్నగారూ! అప్పుడే తొందరేమిటి? వాళ్లసుశీల నాకంటే రెండేళ్లు పెద్ద. ఇంతవరకూ అసలా మాటే లేదు" అనేవరకూ వచ్చారు కూతుళ్లు క్రమంగా.

"ఏమో బాబూ! సావిత్రియీయాడుకి నేను ముగ్గురు బిడ్డల తల్లిని. సరస్వతియీయాడునే రెండోఅమ్మాయికి రెండో పిల్లాడు పుట్టి పోయాడు. శారదయీయాడుకి [illegible] బిడ్డతల్లి అయింది. శేషాలు యీయాడుకి పెద్దమ్మాయి కాపరానికెళ్లి ఏడాదైంది." అంటూ జానకమ్మ తన ప్రయోజకత్వాన్నీ, కాపరాలుచేస్తున్న తన కూతుళ్ల ప్రయోజకత్వాన్నీ ప్రదర్శించడం ద్వారా పెళ్లి కాని కూతుళ్ల దురదృష్టతని స్ఫురింపజేస్తూ తరుచూ అవ్యక్తంగా వాళ్ల హృదయాలికి గిలిగింతలు పెట్టేది. ఇప్పుడు జానకమ్మకూడా పోవటంతో పిల్లలే అన్నింటికీ పెద్దలై వ్యవహరించాలి సొచ్చేసరికి పాపం సుబ్రహ్మణ్యానికి మహాకష్టంగా వుండేది. ఈ ఏడు కనీసం సావిత్రి నన్నా ఒక అయ్యచేతిలోపెట్టి నమస్కారం చెయ్యడం అవసరమని నిశ్చయించుకున్నాడు.

౨

అనంతకోటి నక్షత్రాల్ని ఆకాశంలోనూ, అంతులేని చిక్కని చీకట్లను తుమ్మబొందల చింపిరి తలల్లోనూ దాచేసి ఆనిశీథంలో చతుర్దశి అమావాస్యని కావిలించుకుంది. కీచురాళ్లు తన కీర్తిగానం చేస్తుంటే, కాలపురుషుని నాలుకలాగా పరుచుకున్న ఆరోడ్డు మీద, చింతలకింద, అమావాస్య కాటుక నూరుతోంది. హఠాత్తుగా చెలరేగిన గాలిదేవుడు తీవ్రంగా కాస్సేపు చెట్లని ఊపి ఊపి, యిట్టే విశ్రమించేసరికి, రోడ్డును కావిలించుకు కూర్చున్న మేఘశకలం కన్నీరు కార్చడం మొదలెట్టింది.

వర్షం పెద్దదవుతుందేమో నని, ఎక్కువవేగంగా నడుపుకొస్తున్న సుబ్రహ్మణ్యం "జీప్" కారు కళ్ళకి ఒక లారీల వరస కనిపించింది. పూటుగా బియ్యపు బస్తాలతో నిండిన తొమ్మిది లారీలున్నాయి. సుబ్రహ్మణ్యం కారు ఆపి లారీల్ని అటకాయించాడు. తాసిల్దారుగార్ని చూసేసరికి, మాంచి నిషాలోవున్న లారీ డ్రైవర్లకి సైతం గుండె గుభేలుమంది. సుబ్రహ్మణ్యం వల్ల చివాట్లో, జరిమానో పొందని డ్రైవరు ఒక్కడూ లేడు. అసలతన్ని అసహ్యించుకోని వ్యాపారస్థుడుగాని, లారీడ్రైవరుగాని తాలూకా మొత్తం మీద లేనేలేడని చెప్పవచ్చు. తోడి ఉద్యోగస్థులూ, తనకింది గుమాస్తాలూ, ఆఖరికి బంట్రోతులు సైతం సుబ్రహ్మణ్యం అంటే కంటగించుకొనేవాళ్ళే. ఇంతకు ముందు డిప్యూటీ తాసిల్దార్లుగా పనిచేసి వెళ్ళిన [illegible] శ్రీ [illegible]

రంటే ఆశ్చర్యపడక్కర్లేదు. మరీ కంట్రోలూ, రేషనూ వచ్చింతర్వాత, బిళ్ళబంట్రోతు దగ్గిరనుంచీ రోజుకు అయిదూ ఆరూ కళ్ళ జూసేవాళ్లు. సుబ్రహ్మణ్యం వచ్చిన తరవాత అందరిపొట్టమీదా కొట్టాడు. తను దమ్మిడీ పుచ్చుకోడు. ఇతర్లని పుచ్చుకోనియ్యడు. ఒట్టి అసమర్థుడు కాకపోతే, బాగా ఎదిగిన నలుగురు పిల్లలకి తాసిల్దారీ అయిన వెంటనే జమ్మన పెళ్ళిళ్లు చేసేవాడు కాదూ!

"పర్మిటు చూపించు" అని సుబ్రహ్మణ్యం అనే సరికి డ్రైవర్లూ, యితర నౌకర్లూ నీళ్ళునమిలి చివరిలారీ ఫ్రంటుసీటులో పడుకున్న అసలు యజమాని రామయ్యకి కబురుచేశారు. సుబ్రహ్మణ్యం పేరు వినే సరికి రామయ్య ప్రాణా లెగిరిపోయాయి. ఒకటిరెండు సార్లు రామయ్య సుబ్రహ్మణ్యానికి వెండి చెప్పు చూపించబోవడం, "అబ్బే! అలాంటివి నా దగ్గర సాగవు..." అని ఖచ్చితంగా సుబ్రహ్మణ్యం చెప్పే సెయ్యాషం జరిగింది. పెద్దపెద్ద ఆఫీసర్లతో రామయ్యకి స్వయంగా పరిచయాలూ, ప్రాపకాలూ వుండడంచేత బియ్యం వ్యాపారం దొంగతనంగా ఎంతచేసినా రామయ్యని పట్టుకొనే దమ్ములు ఎవరికీ లేకపోయాయి. అస లారాత్రి కూడా రామయ్య వాకబు బాగానే చేశాడు సుబ్రహ్మణ్యం రాకపోకలవిషయమై. క్యాంపు నుంచి పొద్దూకు వేళకు తిరిగొస్తే ఒచ్చినట్లూ, లేకపోతే మొన్నాడు ఉదయంగాని రాడనీ గుమాస్తాలు చెప్పారు. రాత్రి పదిగంటలదాకా సుబ్రహ్మణ్యం రాకపోయే సరికి రామయ్య అప్పటికప్పుడు లారీలకి బియ్యపు బస్తా లెక్కించి తాను కూడా బయలుదేరాడు.

కాలం కర్మం మూడితే అన్నీ అలాగే ఒస్తాయి. అనుకున్నప్రకార్మే క్యాంపునుంచి సుబ్రహ్మణ్యం బయలుదేరాడు. సరిగాఒస్తే చీకటిపడేసరికి పట్నం చేరుకునేవాడే! కాని నడిమధ్యన కారుచెడి రాత్రి పండెండు గంటలదాకా పడివుండాల్సొచ్చింది. తనూ, డ్రైవరూ నానాఅవస్థాపడి బాగుచేసి, మళ్ళా వెన క్కొచ్చేదేమిటని, ముందుకెళ్ళాగారు. దాంతోటి యీ దొంగబియ్యం పట్టుబడ్డాయి.

"ఆట్టేకాకపోతే, నాలుగునెలలు ఖైదుపడు తుంది మనకిని...అంతా రామయ్యగారే చూసు కుంటాడు" అనే మొండిధైర్యంతో, బీడీలు కాల్చు కుంటూ కూర్చున్నారు డ్రైవర్లంతాను. రామయ్య మటుకు సుబ్రహ్మణ్యాన్ని చివరిలారీ ఫ్రంటుసీటులో కూచోపెట్టి ప్రాధేయపడటం మొదలెట్టాడు. సుబ్ర హ్మణ్యం జీపుడ్రైవరూ, బిళ్ల బంట్రోతూ కూడా లారీ డ్రైవర్లతోచేరి సుబ్రహ్మణ్యంఅసమర్థతనీ, కర్కోటక త్వాన్నీ విమర్శించుకుంటున్నారు. "ఇది పెద్ద లాటులే. ఇటోఅటో తేలిపోవాలి." అని తుదినిర్ణయం కోసం నిరీక్షిస్తున్నారు వాళ్లు.

లారీకి వందచొప్పున మొదలెట్టి, వెయ్యివరకూ బేరంపెట్టాడు రామయ్య, సుబ్రహ్మణ్యం ఎంతమాత్రం సందుయివ్వకపోయినా కూడా. "అదికాదు స్వామీ! నా పరువూ, ప్రతిష్ఠా గంగపాలవుతాయి కేసుపెడితే. అందువల్ల మీకుమాత్రం ఏంలాభం?...మీరూ నలుగురు పిల్లలకు పెళ్లిళ్లుచేయాలి...ఊళ్లో ఏమనుకుంటు న్నారో కాస్త గ్రహించండి...వెనక యింతఉన్న వాళ్ళూ కాదయ్యే!... ఈ కాలంలో ఎంతలేదన్నా నాలుగువేలయితేగాని ఆడపిల్లపెళ్ళి కాదు." అని కాస్త ఆగాడు రామయ్య. సుబ్రహ్మణ్యం ఏమీ సమాధానం చెప్పకపోయేసరికి, మెత్తపడుతాడనే ఉద్దేశంతో... "నలుగురి పెళ్ళిళ్ళకి నాలుగునాలుగులు పదహారువేలూ తీసుకుని నన్ను బయటపడేయండి..." అని కాళ్ళమీద పడ్డాడు. "అసలు తన అంతస్థుకి తను యిలా దీనాలాపాలూ, ప్రార్థనలూ చెయ్యవలసినవాడు కాదు. ఎంత మహామహావాళ్లనయినా, పచ్చనోట్లు పారేసి యిష్టే కట్టేసుకున్నవాడు. ఇప్పుడు ప్రాణం మీదికొచ్చింది. దొంగవ్యాపారంలో లక్షలు గడించినా వేలుపెట్టి చూపించటానికి ఒక్కకేసన్నా లేకుండా జరుపుకుంటూ ఒచ్చాడు యింతకాలమూను. నేటికి దౌర్భాగ్యుడు తీరా కేసుపెడితే యిక తలెత్తుకు తిరగటాని కాస్కారం వుండదు. ఆనాడు వసుదేవుడు గాడిదకాళ్లు పట్టుకోలేదూ!" అని సమాధానపరుచుకున్నాడు రామయ్య.

సుబ్రహ్మణ్యం తల తిరిగిపోతోంది. ఇంత కాలం తను ఒక్క రాగిదమ్మిడీకాదు కదా, అక్షరికి

ఒక్క అరటిపండన్నా కూడా పుచ్చుకోలేదు. "లంచాలు పుచ్చుకోడు" అని బాగా పేరు పడిపోయినాక ఎవరూ యివ్వొచ్చేవాళ్లే కాదు. ఇంట్లో ఎంత యిదిగావున్నా తన కాబుద్ధేపుట్టేది కాదు. పాపం, తన పెళ్లాం అప్పుడప్పుడు చూచాయగా అంటూవుండేది... "పిల్లల పెళ్లిళ్లు చెయ్యాలి గదా మరి! నలుగురిలా బాటు మీరూను." అంటే, తనింతెత్తులేచి "అయితే లంచపు బతుకు బతకమంటావా?... వెధవ సలహాలు చెప్పావంటే ఒళ్లు చీలుస్తా..." నంటూ, మీద దెబ్బ వేసేటంతవరకూ వెళ్లాడో మాటు! అయితేమాత్రం ఏం లాభం? తను లంచగొండి కాదని ఆఫీసర్లందరికీ తెలుసు. కాని ప్రమోషన్ ఏదీ మరి? బోలెడన్ని బ్లాక్ మార్కులూ, రిపోర్టులూ వుండి, ఆఖరికి సస్పెన్షనువరకూ వచ్చిన నీలకంఠం డిప్యూటీ కలెక్టరయి కూర్చున్నాడు. తన జూనియర్లంతమందో యిట్టే తన నెత్తిమీది కెక్కి వచ్చారు. తన నిజాయితీ తనకి తెచ్చిపెట్టిన ఘనత ఏముందీ? నలుగురితో బాటు నడవకుండా వుండటంవల్ల ఆఖరికి బంట్రోతు దగ్గర్నుంచీ తనంటే వెగటే! అవును మరి! పిల్లల పెళ్లిళ్లు ఏనాడో చెయ్యవలసింది. డబ్బులేకేగా నోరుమూసుకుకూర్చుంది? ఒకటే అరా కాదు. పదహారు వేలు! జీవితమంతా నౌకరీచేసే మట్టుకు నిలవచేసి ఏడుస్తారా యింత మొత్తం! పదహారు కాదు యిరవై యివ్వమన్నా యిస్తాడు రామయ్యా... గారు. పిల్లలు నలుగురి కన్యచెరా ఒదిలించినవాడవుతాడు. ఇహ సుశీల ఒక్కత్తేగా మిగిలేది?...అది పసి పన్నాని...ఇప్పుడప్పుడే ఏమీ తొందరలేదు. చచ్చి స్వర్గానవున్న వాళ్ల తల్లి సంతోషిస్తుంది-పిల్లలంతా ఒకింటివాళ్లయి వాళ్ల కాపరాలు వాళ్లు చేసుకుంటుంటే... "ఫరవా లేదు పుచ్చుకోండి నాన్నగారూ" అని కూతుళ్లూ, "పుచ్చుకోకపోతే పిల్లల పెళ్లిళ్లుకావు..." అని భార్యా అతన్ని తొందరపెడుతున్నట్టనిపించింది. స్వప్నంలోంచి లేచివచ్చినవాడి మాదిరిగా కళ్లారుస్తూ చూసేసరికి, రామయ్యా వంది రూపాయలనోట్ల కట్టలు లెక్కపెడుతున్నాడు. "ఇరవై చేసుకోండి" అందామని అనుకుంటుంటే సుబ్రహ్మణ్యం నాలుకని ఎవరో బలవంతాన వెనక్కి లాగినట్టనిపించింది. పెదిమెలు వణికాయి. ఒళ్లు ముచ్చెమటలు పోసింది. కళ్లు గిర్రున తిరిగాయి. దూరాన మేఘాలు మూలుగు ధ్వనితో ఏడ్చాయి. వాన బొట్లు సన్నగా పడుతూనే వున్నాయి. ఒక్క మెరుపు మెరిసింది కూడాను.

సుబ్రహ్మణ్యం లేచి నుంచున్నాడు. బియ్యపు గింజ దొరక్క ఆకలిడొక్కలతో అలమటించే అశేషజనం తనముందు దీనాలాపాలతో పడివున్నట్టనిపించింది. దేశంలో ఎక్కడా తలదాచుకుంటానికి చోటులేక, తన హృదయంలో యింతకాలంగా నిశ్చింతతో కాపరంచేస్తున్న ధర్మదేవతలు కన్నీరు కారుస్తూ లేచిపోతున్నారు. ఉద్యోగం యింకా చేసినన్నాళ్లు చెయ్యబోడు. చివరి రోజుల్లో యీ కక్కుర్తిపడి హృదయాన్ని చంపుకోటం మహాఘోరమనిపించింది. నారు పోసినవాడు నీరు పొయ్యకపోడు.

పాపం! రామయ్యా లెక్క పూర్తిచేసి లేస్తున్నాడు. కేసుపెడితే అతని కిక తలెత్తుకు తిరిగే ఆశవుండదు. పోనీ, కేసుపెట్టనే పెట్టడు తను. కాని డబ్బు మాత్రం ముట్టుకోరాదు......

రామయ్యా లేచి "చిత్తం...స్వీకరించండి. అంత పైకం యిక్కడలేదు. నేనేం కల గన్నానా తేవటానికి?...రేపు రాత్రి తమ దర్శనం చేస్తా... ఉన్నంత వరకు పట్టుకు పొండి..." అంటూ నోట్ల కట్ట అందియ్యబోయాడు. సుబ్రహ్మణ్యం మందహాసం చేస్తూ "క్షమించండి...నేను తీసుకోను..." అంటూ "కాసిం!" అని తన డ్రైవర్ని పిలిచాడు.

రామయ్యకు గంగవెర్రులెత్తాయి. ఏం చెయ్యటానికీ తోచలేదు. సుబ్రహ్మణ్యం జీప్‌లో ఎక్కబోతున్నాడు. క్షణాలమీద కర్తవ్యాన్ని నిర్ణయించుకోవాలి. ఒక్క గడియలో తన పేరూ, ప్రతిష్ఠా, సర్వమూ దగ్ధపటలం అయిపోతాయి. ఒక్క నిట్టూర్పువిడిచి చుట్టూ చూశాడు. తొమ్మిదిమంది డ్రైవర్లూ, తొమ్మిదిమంది క్లీనర్లూ, పద్దెనిమిదిమంది కూలీలూ కనిపించారు. చరచరా జీపుముందరికెళ్లి "తాసిల్దారుగారూ! మీ ప్రాణాలు దక్కవు...పదహారు కాకపోతే యిరవై తీసుకోండి...తప్పితే..." అన్నాడు రామయ్యా. సుబ్ర

హ్మణ్యం హృదయంలోని దేవతలు చర్రున లేచారు "మీ ప్రాణాలు దక్కవు" అనేమాట వినేసరికి. అతను నిర్లక్ష్యంగా నవ్వి "పోనియ్యవోయి! కానిం..." అన్నాడు డ్రైవరుతో.

రామయ్యకి ఆలోచించటానికి టైములేదు. మరుక్షణంలోనే రామయ్య చేతిలోని దుడ్డుకర్ర సుబ్రహ్మణ్యం నెత్తిన పడింది. ఆయువుపట్టులో తగిలిందో ఏమో సుబ్రహ్మణ్యం వెంటనే నేలకొరగాడు. గల్లంతుగా మూగిన డ్రైవర్లకూ, కూలీలకూ సంగతి బోధపడింది. కానింకూ, తాసిల్దారుగారి బంట్రోతుకూ చెరో వెయ్యిరూపాయలకట్టా అప్పుడే పడేశాడు రామయ్య.

## 3

తెల్లారేటప్పటికి ఊరంతా గప్పుమంది, ధర్మరాజులాంటి సుబ్రహ్మణ్యంగారిని దొంగలు కొట్టి చంపారని. కానీముకీ, తాసీల్దారు గారి బంట్రోతుకీ దెబ్బలయితే తగిలాయికాని అదృష్టవశాత్తూ చావలేదు.

"మంచివాళ్లకి కాలంకాదు." అని ముసలాళ్లనుకున్నారు. "పీడ విరగడైపోయిం"దని తోటి ఉద్యోగులు సంతోషించారు. "బతికాంరా బాబూ! నాలుగు డబ్బు లేరుకోవచ్చు"నని ఆఫీసు బంట్రోతులు లోలోపల ఆనందించారు.

పౌరులు ఒక సానుభూతిసభ ఏర్పాటు చేశారు ఆ సాయంత్రం. "ఉద్యోగస్థులలో లంచం తినని వాళ్లుంటారంటే నమ్మటం అసంభవమనీ, కాని సుబ్రహ్మణ్యంగారు ఎర్రని యాగానీకూడా ముట్టుకోకుండా ఉద్యోగధర్మాన్ని చక్కగా నిర్వర్తించాడనీ, అలాంటి సత్పురుషుడికిలాంటి దుర్మరణం ప్రాప్తించటం విధివైపరీత్యమేననీ చాలామంది ఉపన్యాసాలు చెప్పారు.

సభాంతాన అధ్యక్షులు రామయ్యగారు అశ్రుపూరితనయనాలతో "సుబ్రహ్మణ్యంగారి ఆత్మకు శాంతి కలుగుగాక!" అని భగవంతుని ప్రార్థించటానికి అందరినీ ఒక్కమాటు లేచినుంచోమన్నారు.



# స్వతంత్ర భారతి

●

శ్రీ ముదివర్తి కొండమాచార్యులు

స్వాతంత్ర్యోదయ రేఖ భారతిశుభాస్యమ్మందు పుష్పించి, ఆ
శాతంత్రుల్ బలికించి నేటి కొక వర్షమ్మయ్యె; హృత్పాత్రికల్
ప్రీతిస్వాదు మరంద మొల్కవు; కనుల్ విప్పారి ఆనందగో
ప్రాతక్షీరము తొల్కరింప; నెట దోపంబోవు శాంతిద్యుతుల్.

ఆనాడో—దిశలెల్ల విచ్చిన ప్రసన్నాస్యాల వేదోక్తది
వ్యానూనాశిషముల్ వెలార్చెనఁ;—వర్షాంభస్సులన్ మంగళ
స్నాన మ్మాడి, శిరోజముల్ ముడిచి, స్వేచ్ఛావస్త్రముల్ గట్టి, వ
క్త్రానన్ కుంకుమబొట్టు పెట్టి భరతక్ష్మామాత తా శోభిలెన్.

క్రతుధూమమ్ముల కప్పవడ్డయది ఆర్యావర్తపుణ్యోర్వి సం
తత వేదామృతనిస్వనమ్ముల దిగంతాల్ మారుమ్రోయంగ ధ
న్యత చేపట్టిన కర్మభూమి;—చదలంటన్ కాష్ఠధూమాళి, ది
క్తతి 'హాహారవమున్' ధ్వనింపఁ ఇక చిత్త మ్మెట్లు శాంతిం జెందున్?

నా దేశమ్మున, నాదు కంఠమున ప్రాణ మ్ముండగా పుణ్యకాం
తాదుర్వారతరార్తనాదములు, ఏతన్మానభంగమ్ము లూ
హద్బ్రహ్మాండల మెట్లు దాటిన? వికేలా భూమికిన్ భారమై
యీ దామోదరు డున్నవాడు? ఫల మేమీ వీడు జీవించియున్?

కనులన్ నెత్తురుచుక్క లేదుర! బుభుక్షాతీవ్రదావానల
మ్మున భస్మ మ్మయిపోయె నస్థులును; ఊర్పుల్, బొబ్బలున్, మూల్గు లీ
కను దిగ్భిత్తుల ప్రీల్చుచున్నయవి; కాంతుల్ పండి ఈ జన్మమం
దున సౌఖ్యమ్మును జెందు భాగ్య మది లేదో హైందవప్రాణికిన్?

నా తండ్రుల్ చెఱలందు మ్రగ్గుటలు, ప్రాణాల్ వీడుటల్ 'రామ!' యీ
స్వాతంత్ర్యమ్మున కేన? యీ కటికహింసాకాళి నా నెత్తురుల్
ప్రీతిం ద్రావుటకేన? నా భరతధాత్రీదేవి నెమ్మోమునన్
శాంతిజ్యోత్స్నలు వెల్వెలంజనుటకేనా? అయ్యో! అయ్యయ్యయో!

---

# అజ్ఞాత చిత్రకారుడు

కొందరు చిత్రకళ శ్రమపడి నేర్చుకుంటారు. కొందరికి వంశపారంపర్యంగా వస్తుంది. కొద్దిమందిమాత్రమే ఈ కళలో పుట్టుకతో ప్రతిభావంతులు.

శ్రీ చాగంటి వీరభద్రయ్య ప్రతిభావంతమైన భావి చూచి ఆనందించే పుణ్యము ఆంధ్రులు చేసుకోలేదు. ఇరవై అయిదు ఏళ్లు నిండినవో, లేదో-దుర్విధి చూడలేకపోయింది. అతను (ఈమధ్యనే) పరమపదించాడు.

అనుకొంటే అవాచ్యంగా ఉంది.

వీరభద్రయ్యను ఇంట్లో బాబాయి అని పిలిచేవారు. అతనికి మిత్రులన్న ఏకోదరులు. అంతఃకరణ అంత



శ్రీ చాగంటి వీరభద్రయ్య

గొప్పది. అందుచేతనే మిత్రులందరం బాబాయి అనే పిలిచేవాళ్ళం. తాతగారిపేరు బాబాయికి పెట్టారు.

తాతగారు సంస్కృతాంధ్రములలోనేగాక ఆంగ్ల భాషలోకూడా భాషాస్వామి. ఆయన ఆంధ్రదేశములో అనేకమంది విద్యార్థులకు గురువులు.

తాతగారివలెనే మనుమడు ధీమంతుడు. బ్రతికి బాగుంటే నిర్వాహకు డయ్యేవాడు. ఆంధ్రచిత్రకారులలో దిట్ట అనిపించుకునేవాడు. ఆ అదృష్టము ఆంధ్రులకు పట్టలేదు.

తండ్రిగారు సంగీతకళోపాసకులు. సంగీతము వీరి వంశవిద్య యని చెప్పవచ్చును. తల్లిగారికి సంస్కృతాంధ్రములలో చక్కని పాండిత్యము ఉంది. దేశసేవ తమ సౌభాగ్యంగా ఎంచుకొని, తమ సర్వస్వము దేశజననిపాదాల మ్రోల సమర్పించిన ఈ పుణ్యదంపతుల జ్యేష్ఠకుమారుడు బాబాయి. తండ్రిగారు పరమభక్తులు. వీరు నమ్మిన దైవము రామభద్రుడు. భగవంతుని పరీక్షకు అంతము లేదుగావును. బాబాయి పరమపదించినాడు.

తలిదండ్రుల దుఃఖమునకు మేర లేదు.

ఆంధ్రదేశములో అన్నపూర్ణాదేవియై అవతరించిన డొక్కా-సీతమ్మగా రనిన వీరి కుటుంబమునకు దైవసమానురాలు. కనుకనేనేమో తలిదండ్రు లిద్దరూ కరుణాసముద్రులు. దీనులను చూచి కరిగిపోతారు.

తలిదండ్రుల ఆదర్శములన్నీ పుత్రునిలో ప్రతిబింబించాయి.

వీరి కాపురస్థలము అమలాపురము. ఆ తాలూకాలో వీరి కుటుంబము నెరుగనివారు లేరు. ఎరిగి ఆదరణపొందనివారు లేరు.

బాబాయితాతతండ్రులు చేతికి ఎముకలేని దాతలు.

అతను విజ్ఞానధనుల వంశములో పుట్టాడు. దేశభక్తి ఉగ్గుపాలతోనే అలవడింది. మానవసేవ మాధవసేవగా ఎంచుకునే వంశము వారిది.

ఆనాటి విద్యావిధానమును బహిష్కరించిన కారణమున బాబాయి కళాశాలలో చదువుకొనలేదు.

గాంధీమహాత్ముని అడుగుజాడలలో నడచిన మహావీరుల్లో తండ్రిగారు. ఒకసారి వీరు మహాత్ముని దర్శనానికి వెళ్ళినప్పుడు ఇష్టాగోష్ఠిలో పిల్లల చదువుమాట వచ్చి ముందుముందు ఏమిచేయాలో తమకు తోచటం లే దన్నారట.

మహాత్ముడు చిరునవ్వు నవ్వుతూ "మీకు, నాకు రేపు అనేది ఉన్నట్లయితే మీపిల్లల కెందుకు ఉండ?"దన్నారుట. తరువాత మహాత్ముడు నందలాలుబోసుగారి పేర లేఖ వ్రాసి బాబాయిని శాంతినికేతనంలో చేర్పించారు.

బోసుగారికి మహాత్ముడన్న అమితగౌరవము. కనుక బాబాయిని స్వజనంలోవానిగా ఎంచుకొని చిత్రకళ నేర్పుతూ ఉండేవారు.

అవి యుద్ధమురోజులు. శాంతినికేతనంవించి విద్యార్థులను ఇళ్ళకు పంపివేసినప్పుడుకూడా నందలాలు బోసుగారు ఈ శిష్యుని వదలలేకపోయినారు. తన పిల్లలతోపాటే తన ఇంటిలోనే ఉండిపొమ్మన్నారు. ఆయనకు బాబాయి అంటే అంత ప్రీతి. తరువాత ఆయన వ్రాసిన లేఖలలోకూడా ఇతనియెడల ఉన్న వాత్సల్యము, ప్రేమ నిండిఉన్నాయి.

ఇద్దరు మహనీయుల ఆశీస్సు లందుకొని శాంతినికేతనస్నాతకుడై బాబాయి ఆంధ్రదేశానికి వచ్చి తీరా అయిదేళ్ళయిందో, లేదో!

అతను చిత్రకళలోనేకాక కుటీరపరిశ్రమలలోనూ ఎంతో నేర్పరి. వాటియం దెంతో అభిలాష ఉండేది. కుటీరపరిశ్రమలకు, చిత్రకళకు ఉన్న సన్నిహితసంబంధము గుర్తించి కృషిచేసిన చిత్రకారులు ఆంధ్రదేశములో అరుదుగా ఉన్నారు. ఇతను ఆ కొరత తీర్చగలడని ఆనందించేవాడను.

బాబాయి మద్రాసుకు వచ్చి ఏడాదిపైన అయింది. ఉద్యోగరీత్యా పట్టణవాసం చేయడం ఇదే తొలిసారి. ఇంతకుపూర్వం పల్లెపట్టులనీడనే విశ్రమించి చక్కని చిత్రాలు చిత్రించుకొన్నాడు.

మద్రాసుకు వచ్చి జీవనోపాధి చూచుకొంటూ చిత్రకళాధిదేవతను ఉపాసించుకొన్న ఈ రసాత్మకుని లోకము ఎరుగదు. ఎప్పుడూ చిరునవ్వులతో మిత్రులను పలుకరించేవాడు. మా నెచ్చెలుల కందరకు సమాదరణీయుడు.

మాఅందరికన్నా వయస్సులో చిన్న అయినా ఔదార్యములో పెద్ద.

మెరుపులా మాయమైనాడు. బ్రతికినన్నాళ్లూ అజ్ఞాతంగానే ఉండిపోయాడు. అతని చిత్రాలు మిగిలాయి.

ఆంధ్రచిత్రకారులకు ఇతను చిరస్మరణీయుడు. అతనిని స్మరించుకొని గౌరవించటం పున్ని మనం గౌరవించుకోవటం.

పరమేశ్వరుడు సర్వదా అతని ఆత్మకు శాంతి ప్రసాదించుగాక!

పిలకా లక్ష్మీనరసింహామూర్తి.





## నేనెరిగిన

# చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు

●

శ్రీ నండూరు బంగారయ్య

ఆంధ్రదేశమున ఎక్కడ చూచినా తిరుపతి వేంకటేశ్వరుల జయదుందుభులు మారు మ్రోగే రోజులవి. వాఙ్మయమందు ఏమాత్ర మభిరుచి యున్నవారికైనా ఆశుకవిత్వము చెప్పవలెనని, అవధానములు చేయవలెనని, తిరుపతి వేంకటేశ్వరుల శిష్యులు కావలెనని – ఇవే ఆశయములు. తిరుపతి వేంకటేశ్వరుల ద్ద ఏమాత్రమో చదువుకొన్నవారు వారి శిష్యుల మనుకోవడము సహజమే. వారి ముఖమే ఎన్నడు చూచి ఎరుగని ఏకలవ్యశిష్యులుకూడ ఎంత మందో ఉండేవారు. ఇక జంటకవులుగా ఏర్పడడము ఇంచుమించుగ ఒక అంటురోగముగనే వ్యాపించి పోయినది.

## ౨

ఈ అంటురోగము మాకుగూడ చిన్నతనమున సోకినదికాని మానలేదు. అప్పుడు నేను మూడవ ఫారము చదువుకునేవాడిని. నా తరగతిలోనే, నా యీడువాడే, నూరాబత్తుల సుబ్రహ్మణ్యముగారని— ఇప్పుడు గవర్నమెంటువిద్యాశాఖలో పనిచేయుచున్నారు—సంస్కృతమున 'విద్వాన్' పరీక్షలోను, హిందీలో 'విశారద' పరీక్షలోను, ఇంగ్లీషులో ఎం. ఎ., ఎల్. టి. పరీక్షలలోను ఉత్తీర్ణులు కావడమేకాకుండా అఖండపాండిత్యము సాధించి తెనుగులో తియ్యగ కవిత్వము చెప్పనేర్చినవారు. వారును, నేనును కలసి కొంత కాలము 'సోదరద్వయము' అను పేరిట జంటకవులుగ నేర్పడినాము. (కలసి చేసిన రచనలు ఏవీ యిప్పటికి నిలచినవి లేవనుకొనుడు.) అప్పటికి తిరుపతిశాస్త్రిగారు [illegible] శ్రీ పోలవరము రాజాగారివద్ద ఉండేవారు. వారి కుమారులు వేంకటావధానిగారు మాకు కళాశాలలో సహాధ్యాయి. తిరుపతిశాస్త్రిగారిని దూరమునుండి చూచియే మనస్సులో నమస్కరించుకొనేవారము. వేంకటశాస్త్రిగారివలె కురచగ పీలగ ఉండక మిక్కిలి ఉన్నతమయిన, పుష్టిఅయిన విగ్రహము. వారిని చూడగనే "తిరుపతి యేన్గుగాగ" ఇత్యాదిపద్యములు జ్ఞప్తికి వచ్చేవి. వారు పద్యముమాత్రము సొగసుగ చదువలేక పోయేవారు. వారు రచించిన పద్యములే వారి నోటనే సభలో విని అనంతర మచ్చులో చదువుకొని, "ఇంత చక్కని పద్యములను వారు ఆమాదిరిగా ఎలా చదువ గలిగినారురా!" అనుకునేవాళ్ళము. ఎప్పటికయినా తిరుపతి వేంకటేశ్వరుల శిష్యులము కావలెనని ఉవ్విళ్లూరుచుండేవారము.

## ౩

రెండుమూడేండ్లు నడచినవి. క్రమేణ ఆశుకవిత్వముమీదను, అవధానవిద్యమీదను మాకు మోజు తగ్గజొచ్చినది. "ఇవన్నీ వాఙ్మయములో ఒకవిధమయిన గారడీలంటివి. నిజమయిన కవిత్వము వీనిలో దుర్లభము" అనే అభిప్రాయము ప్రబలజొచ్చినది. స్కూలు ఫైనలులోనికి వచ్చేసరికి ఈ అభిప్రాయము బాగా దృఢపడినది. కవుల కలహములంటే అప్పటికప్పుడే అనాదరము హెచ్చినది. వ్యక్తిగతముగ దూషించుకోవడము, పద్యములలో నడచినంతమాత్రమున కవిత్వమనిపించుకుంటుందా? అనే ప్రశ్న బయలుదేరినది.

## ౪

ఇంటరు తరగతి చదువుకొనుటకు కాకినాడనుండి రాజమహేంద్రవరము రావలసివచ్చినది. అప్పటికి

శ్రీ వేంకటశాస్త్రిగారు బందరు విడిచి కడియములో ఉండేవారు. ఆర్ట్సుకాలేజీహాస్టలువిద్యార్థులు ప్రతీ సంవత్సరము వినాయకచవితికి గొప్ప ఉత్సవము చేసే వారు. అందు విధిగా వెంకటశాస్త్రిగారి ఉపన్యాస ముండేది. ఉపన్యాస మని పేరు. వారు ఎక్కడ మొదలుపెట్టి ఎక్కడకు పోయేవారో ఎవరికిని తెలిసేది కాదు. ఒకరివరకు పోనేల? వారికే తెలిసేది కాదు. కొంతదూరము పోయిపోయి నడుమ "ఎక్కడ నున్నాము?" అని సభ్యులను ప్రశ్నించేవారు. సభ్యులలో ఎవరికైనా స్మృతి ఉంటేగా? శాస్త్రిగార నోట వచ్చే ప్రతివాక్కును సభ్యులు మధు రసమును ఆస్వాదించేటట్లు ఆస్వాదించేవారు. ఇక శాస్త్రిగారు పద్యము చదివితే అది సమ్మోహ నాస్త్రమే. ఎన్నిగంటలు మాట్లాడినా ఎవ్వరికీ విసుగు అనే మాట ఉండేది కాదు. కాలమును అతిక్రమించు చున్నారని అధ్యక్షులకు లోలోపల ఇబ్బందిగా నున్నను హెచ్చరించడానికి భయము! శాస్త్రిలు గారు ఏమి దెబ్బ కొడతారో? సభలో ఏమి అల్లరి జరుగుతుందో! అంత నిరంకుశముగా నడిచేవి వారి ఉపన్యాసములు—ఉపన్యాసములు అనడముకంటె వానిని ఇష్టాగోష్ఠు లనడము ఉచితముగ ఉంటుందేమో!

✻

దూరమునుండి వేంకటశాస్త్రిగారి గోష్ఠి విని ఆనందించడమేకాని వారి పరిచయభాగ్యము చాల కాలమువరకు లభించినది కాదు.

౧౯౨౧ లో వడ్డాది సుబ్బారాయ కవిగారి యింట్లో నే నద్దెకుండేవాడిని. ఆ రోజులలో వారి కుమారుని అక్షరాభ్యాసము జరిగినది. అక్షరా భ్యాసము నడపిన గురువులు వేంకటశాస్త్రిగారు. చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు, జనమంచి వెంకటరామయ్యగారు మున్నగు పండితు లెందరో విందారగించిరి. భోజనసమయమున విసనకర్ర పుచ్చుకొని వారికి సేవ చేయుట నావంతుకు వచ్చెను. తరువాత ౧౯౨౨లో కాబోలు నేను బి. ఏ. సీనియర్ చదువుచుండగా పానుగంటివారి "తెనుగుక్లాసుతమాషా" అను ప్రహసనమును ప్రకటించిరి. అందులో నేను తెనుగుమాష్టరుభూమిక ధరించితిని. అప్పుడు వేంకట శాస్త్రిగారు నన్ను మెచ్చుకొన్నారని తరువాత తెలిసినది. ఏమయినను ఈ రెండు సందర్భములనుబట్టికూడ నేను వారి పరిచితవర్గమునకు చేరడమునకు తగిన యోగ్యత కలుగలేదు.

ఇటీవల వారికిని, కృష్ణమూర్తిశాస్త్రిగారికిని వాదోపవాదములు బయలుదేరినవి. 'పాండిత్యలక్షణమా?' అను శీర్షికక్రింద ఇట్టి వాఙ్మయయుద్ధములను నిరసించుచు గాండీవపత్రికలో నే నొక వ్యాసము వ్రాసితిని. దానివలన నేను వెంకటశాస్త్రిగారికి సుపరిచితుడ నయితిని. లంక సోమయాజులుగారని—ట్రెయినింగుకాలేజీ తెలుగుపండితులు; శాస్త్రిగారి శిష్యులు—వారియింట బసచేసి భమిడిపాటి కామేశ్వరరావు గారిచే నాకు కబురుపెట్టిరి. నేను వారి దర్శనము చేయగా అప్పటికింకను అచ్చుపడని 'జయంతి' అను గ్రంథమును నాకు చదివి వినిపించిరి. దానిలో నా ప్రసక్తి కూడ వచ్చినది. గాండీవములో నేను వ్రాసిన వ్యాసమున నేను కృష్ణమూర్తిగారి వాదము నొక్కదానినే ఖండించినట్లు వేంకటశాస్త్రిగారు వ్యాఖ్యానముచేయజూచిరి. వ్యక్తిగతరోషము గ్రంథస్థము గావించి దానిని వాఙ్మయమని కొనియాడుట అనుచితమని నిరూపించుటయే ఆ వ్యాసమువలన నే నాశించిన ప్రయోజనముకాని ఏదో యొక పక్షమును సమర్థింప జూచుట నా యుద్దేశము కాదని శాస్త్రిగారితో చెప్పి నే నింటికి చక్కావచ్చితిని.

తరువాత వసురాయకవిగారి సహస్రమాసోత్సవ సందర్భమునకాబోలును, మేము మరల గలసికొంటిమి. నాటిసభ కధ్యక్షులన్నట్లుగ జ్ఞప్తి. అయినను కాకున్నను వారి యుపన్యాసము నా యుపన్యాసము తరువాత వచ్చినది. నాటి యుపన్యాసములో, వసురాయ కవిగారు, వీరేశలింగముగారు, తిరుపతి వేంకటేశ్వరులు—వీరందరు యుగసంధికి చెందిన రచయితలనియు, వీరికందరకు సామాన్యముగ కొన్ని లక్షణములు గోచరించుచున్నవనియు చెప్పుచు ప్రసంగవశమున ఆశుకవిత్వమును, అవధానవిద్యను కొంత విమర్శించితిని. ఇది వేంకటశాస్త్రిగారికి కోపకారణ [illegible]

తరువాత వచ్చిన వారి ఉపన్యాసములో నా యుపన్యాసములోని ప్రత్యంశమును వారు ఖండించుచు మాటాడిరి. వందనసమర్పణసమయమున వారికి సమాధానము చెప్పుటకు నా కవకాశము దొరకినను నేను వాదము పెంచుట కిష్టపడక వారికి వందనసమర్పణము మాత్ర మాచరించి విరమించితిని.

౬

ఈరీతిగ మా యిద్దరకు తాతామనుమలవరుస నడచుచుండగా శ్రీ వసురాయకవిగారు స్వర్గస్థులు కావడము, ఆ సందర్భమున నొక మహాసభ జరగడము, దానికి శాస్త్రిగారు మున్నగు మహాపండితులు ఉపన్యాసప్రదానార్థము రావడము, ఆ సభకు న్యాయపతి సుబ్బారావుపంతులుగా రధ్యక్షత వహించడము జరిగినవి. ఏందుచేతనోగాని పంతులుగారికి మొదటినుండీ నామీద అమితమయిన వాత్సల్యము. ఆ సభలో తమ అధ్యక్షోపన్యాసములోనే పంతులుగారు, వసురాయకవిగారు దివంగతులయినా యువకులలో కొందరు వారి వాఙ్మయకృషిని అందుకోగల్గినవారు ఉన్నారంటూ నాపేరు చెప్పి అప్పటికి నేను నూతనముగ ప్రకటించిన రాజ్యలక్ష్మి అను నాటకమును ప్రశంసించిరి. మరునాడు హిందూసమాజములో పంతులుగారు, చిలకమర్తివారు, శాస్త్రిగారు మున్నగు పెద్దలంతా మాటా మంతీ ఆడుకుంటూన్న సమయములో, అక్కడనే కొంచెము దూరముగా ఇంకొకరితోనో మాట్లాడుతూ కూర్చుండివున్న నన్ను పంతులుగారు పిలచి "మీ 'రాజ్యలక్ష్మి' కాపీని శాస్త్రిగారి కిచ్చినారా?" అని ప్రశ్నించిరి. వెంటనే హిందూ సమాజము నౌకరును ఇంటికి బంపి ఒక ప్రతిని దెప్పించి శాస్త్రిగారికి సమర్పించితిని సమర్పించితిని గాని ఇక నాకు వారి అభిప్రాయ మెట్లుండునో తెలిసికోవలెనన్న దృష్టి లేదు. అప్పటికప్పుడే నేను భావుకు లనుకున్న వారి కందరికీ దాని ప్రతులు పంపడము, వారు పెదవి విరిచి దానిని మెచ్చుకోకపోవడము జరిగినది. చిలకమర్తివారు మెచ్చుకొన్నారుగాని అది వాత్సల్యప్రేరితమని సంశయించితిని. ఇక అప్పటికి తాతామనుమల వరుసగనున్న శాస్త్రిగారు నా రచనను మెచ్చుకొంటారా! మరునాడు మామూలుగా కోర్టుకు పోయేసరికి సోమిద కామేశ్వరరావుగా రను న్యాయవాదిశేఖరులు (రాజమహేంద్రవరము వచ్చినప్పుడు తరచు శాస్త్రిగారు వీరి ఇంటనే బసచేయుచుండురు) వచ్చి ఏదో లాపుస్తకము చూచుకొనుచున్న నాతో "అంత ఉత్తమనాటకము వ్రాయగల్గినందుకు మిమ్ము నే నభినందించుచున్నాను" అనిరి. వారు రాజ్యలక్ష్మినిగూర్చి ముచ్చటించుచున్నారని తెలిసికొనుటకు తగిన దృష్టిలో లేక, నేను తెల్లబోయి చూచుచుండగా "నిన్న రాత్రియంతయు శాస్త్రిగారు మీరు వ్రాసిన రాజ్యలక్ష్మి మాకు చదివి వినిపించి దాని యందమును విశదపరచి చెప్పినారు. చాల చక్కగ నున్నది" అని పలికిరి. స్వతహాగా కామేశ్వరరావుగారు ఇంగ్లీషులోను, సంస్కృతములోను చక్కని కృషి సలిపినవారు. వారు మెచ్చుకొనుటకు తోడు శాస్త్రిగారుకూడా మెచ్చుకొన్నా రనగనే నాకు కొంత ఉత్సాహము జనించెను. నాటిసాయంకాలము మామూలుప్రకారము నేను హిందూసమాజమునకు పోయేసరికి చిలకమర్తివారిని, మరి కొందరిని తమ చుట్టూ చేర్చుకొని శాస్త్రిగారు ఏదో నూతనముగ తాము వ్రాసికొని వచ్చిన వ్యాసము చదివి వినిపించుచున్నారు. అది నా రాజ్యలక్ష్మిని గూర్చియే అయియుండునని నే నేలాగున అనుకునేది! వచ్చితే ఏవో మాటవరుసగా కొంచెం ప్రశంసావాక్యములు పలుకుతారుగాని పెద్ద వ్యాసము వ్రాసి యిస్తారా! కాని చూడగా అది కృష్ణాపత్రికకు ఉద్దేశించిన 'రాజ్యలక్ష్మి'ని గూర్చిన వ్యాసమే. ఆ నాడు నేను పొందిన సంతోషమునకు మేరలేదు. "మా తండ్రిగారు విద్యాధిదేవతయగు హయగ్రీవోపాసకులు. శాస్త్రిగారి ప్రశంస దాని ఫలితము" అనుకొంటిని. శాస్త్రిగారి ప్రశంసకంతకూ నా 'రాజ్యలక్ష్మి'లోని గుణమే కారణమని అప్పుడుగాని, ఇప్పుడుగాని నే ననుకొనుట లేదు. కాని ఆనాడు నాకు ప్రత్యక్షమయినది శాస్త్రిగారి ఔదార్యహృదయము. యుగకర్తలని ప్రఖ్యాతి గడించిన శాస్త్రిగా రెక్కడ? ఊరూ, పేరూ లేని నే నెక్కడ? వాఙ్మయస్య సాయమున ప్రోడు పడియున్న నా హృదయము నిజముగ ఆనాడు పునర్జీవమును గాంచినది. 'శాస్త్రిగారి వ్యాసమే రాక

పోయినచో నేను మరి నాటకమే వ్రాసియుండనేమో! దానివలన వాఙ్మయమున కేదో నష్టము సంభవించునని కాదు. వ్యక్తిగతముగ నా మానసమున నొక నూతన చైతన్య ముదయించినది.

౮

అటుతరువాత శాస్త్రిగా రెప్పుడునూ నామీద ఒకేరీతి ననురాగము వర్షించుచువచ్చిరి. వారిపట్ల నేను మాత్రము సర్వదా విధేయుడనయి నే సంచరించినవాడను గాను. అందుచే నీ యంశమునొక విశేషముగ చెప్పుకొనవలసివచ్చినది. ఈ సందర్భమున నొక చిన్న యుదంతము మనవిచేయవలసియున్నది. కొంతకాలమునకు తరువాత మా యూరి గౌతమీ గ్రంథాలయములో 'భావకవిత్వ'ముని గూర్చి చర్చించుటకు ఒక సభ జరిగినది. దానిలో శ్రీ కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారు మున్నగువారు పాల్గొన్నారు. ఆ సభ కధ్యక్షులు శాస్త్రిగారే. నేను ఉపన్యాసకుడను కానుగాని సభలో నున్నాను. పెమ్మరాజు రాజగోపాలముగారు (తణుకు) భావకవిత్వమునకు అనుకూలముగా మాటాడుచుండగా శాస్త్రిగారు కేవో ప్రశ్నలు వేయ నారంభించిరి. ఉపన్యాసకునకు ఇబ్బంది కలిగించి వారి ఉపన్యాసము నాటంకపరుప జొచ్చినవిగాని వారు "అయ్యా, నా ఉపన్యాసమునకు ట్లాటంకము గల్పించుట ధర్మము కాదు" అని చెప్పుటకు జంకుచుండిరి. ఇది కనిపెట్టి సభలోనుండి నేను లేచి, "అయ్యా, మీరు అధ్యక్షధర్మమునకు విరుద్ధముగ వర్తించుచున్నారు. వారిని (రాజగోపాలము గారిని) పరీక్షార్థము ఇక్కడకు మనము పిలువలేదు. వారి ఉపన్యాసాంశములు మీకు నచ్చకపోయినచో తరువాత మీ ఉపన్యాసములో ఖండించవచ్చును. అంతేగాని ఉపన్యాసము నాటంకపరచుట ధర్మము గాదు" అంటిని. శాస్త్రిగారు మరొకరైనచో ఈ అవిధేయతకు ఏమి చేసియుందురో నేను చెప్పజాలను. కాని నే నీలాగున పలుకగనే నవ్వుకొని మరి మాట్లాడక ఉపన్యాసమును సాగనిచ్చినారు. సభ జయప్రదముగ ముగిసినది. తరువాత నా యవినయమునకు నేనే కొంచెము పశ్చాత్తాపము నొంది సభ ముగిసిన వెనుక శాస్త్రిగారిని జేరి "శాస్త్రిగారూ, దాసుని తప్పు దండనములో సరి" అంటిని. వారును నాపై చేయి వైచి యథాపూర్వమయిన అనురాగమునే వర్షించిరిగాని అంతకు భిన్నముగ వర్తింపలేదు. ఇంత వాత్సల్యప్రపూర్ణులు కావుననే వేనవేలు వాఙ్మయారాధకులు వారియెడల గాఢమయిన భక్తిప్రపత్తులతో సంచరించుచుందురు.

౯

వేంకటశాస్త్రిగారి గ్రంథములు చదువడము మూలముగా కలిగే అభిప్రాయంకంటె వారితో పరిచయ మేర్పడిన తరువాత కలిగే అభిప్రాయమే గాఢతరముగా వుంటుంది. వ్యక్తిగతముగా ప్రేమించతగ్గ లక్షణాలు వారియందు ఎన్నో వున్నవి. సౌందరనందమును రచించిన కవులు "అద్యతనాంధ్రకవిప్రపంచనిర్మాత" లని శాస్త్రిగారిని గూర్చి ఒక విశేషణము వాడినారు. నిజమునకు దిగ్గజములవంటి పండితులును, కవులును శాస్త్రిగారి యనుగ్రహమే తమ పాండిత్యమునకు, కవిత్వమునకు కారణముగా చెప్పుకొనుచుందురు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, వేలూరి శివరామశాస్త్రిగారు, విశ్వనాథ సత్యనారాయణగారు, పింగళి లక్ష్మీకాంతముగారు, కాటూరి వెంకటేశ్వరరావుగారు—ఇట్లా ఒకరా, ఇద్దరా! ఆధునికాంధ్రసారస్వతమునకు మూలవిరాట్టులని చెప్పదగిన కవిసామ్రాట్టులం దెక్కుండ్రు వీరి శిష్యపరమాణువులని గుర్తించినపుడు శాస్త్రిగారు ఆంధ్రసారస్వతమునకు పెట్టిన భిక్ష ఎట్టిదో కొంతవరకయిన మనము గ్రహింపగలుగుదుము. పాండిత్యమదమత్తులయిన ఇట్టి దిగ్గజములను, కవిసింహములను పాదాక్రాంత మొనర్చుకొని వానిచే నిష్టము వచ్చినట్లు సర్కసు చేయించుటకు పాండిత్యమూ, ప్రతిభా మాత్రమే చాలవు. ఇతరలక్షణములుకూడ కొన్ని ఉండితీరవలెను.

బాహ్యావిగ్రహములోగాని, వేషములోగాని పేర్కొనతగ్గ విశేషము లేవీ కనబడవు. పొడుగ్గా, పీలగ వుంటారు. నడుము బాగా వంగిపోయి వుంటుంది. ముఖములోకూడా పెద్ద గ్రుస్సుతున్నదని చెప్పడానికి వీలులేదు. రుద్రాక్షంచుపంచె ఒళ్లెగొచ్చి పెట్టి పైనొక ఉత్తరీయము ధరించి చేతిలో బెత్తమూలందుకు మాత్రమే ఒక అంగవస్త్రముతో తయారవుతారు. సాధారణముగా

బండి ఎక్కడము వీరికి యిష్టములేది కాదు. ఎంత దూరమయినా కాలినడకనే పోవాలి. ఇప్పుడిప్పుడు ఆ ఓపిక పూర్తిగా తగ్గిపోయిన దనుకొనుడు.

విగ్రహమూ, వేషమూ ఎట్లా వున్నా వారి వాక్కునకు మాత్రము అమోఘమయిన ఆకర్షణశక్తి ఉండేది. సభలోనే కాదు, ఇతర మాట్లాడినాసరే, ఎంతసేపు విన్నా తనివితీరదు. ఎన్నో వాఙ్మయవిశేషాలు, శాస్త్రవిశేషాలు వారి గురువుగారి జీవితమునుగూర్చి, వారి జీవితమునుగూర్చి మనకు తెలియని ఉదంతములు ప్రవాహధోరణిగ నడిచేవి. దిగ్భ్రమగొలిపే ప్రతిభ ఒక్కటేకాదు అందు ప్రతిబింబించెను—సానుభూతి గల హృదయముకూడాను.

వేంకటశాస్త్రిగారి వాక్కుకు ఆత్మవిశ్వాసము ఒక ప్రత్యేకలక్షణమని చెప్పాలి. కవిత్వములోగాని, ఉపన్యాసములోగాని, మామూలు ఇష్టాగోష్ఠిలోగాని అది ధారాళముగా ప్రవహించేది. "కవితార్థం బుదయించితిన్" అని ఢంకామీద దెబ్బకొట్టి చెప్పుకోవడము వీరికే చెల్లినది. సభలో ఏదైనా ఒకానొకటి వాఙ్మయవివాదమును గూర్చి ముచ్చటిస్తూ, "ఇలా వుండేవాడా అప్పుడీ వెంకటేశ్వరుడు—'అహమేవ పండితః' అనే అవస్థలో ఉండేవాడుగాని" అని తమ్ముగూర్చి తామే ప్రసంగించు కొనేటప్పుడు ఆ ధీమా చూచితీరాలి. ఒకమారు ఆర్ట్సు కాలేజీలో రసమునుగూర్చి ఏదో పార్లమెంటరీ చర్చ ఏర్పాటుచేశారు. ఒకవైపున శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు, చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు, ఇంకా ఎవరో మరి వొకరు వుండాలి. వారికి ఎదురుగా జటావల్లభుల పురుషోత్తముగారు, పిలకా గణపతి శాస్త్రిగారు, నేను ఉన్నాము. గణపతి శాస్త్రిగారు కాబోలు—ప్రసంగవశమున భారతములో శాంతరసము, రామాయణములో కరుణరసము ప్రధానరసము లని ఆనందవర్ధనులు నిర్ణయించారని చెప్పినారు. తరువాత వేంకటశాస్త్రిగారు తమ ఉపన్యాసములో "ఆనందవర్ధనుడు ఈ రోజున ఉన్నట్లయితే అంత పెద్ద కావ్యాలలో ప్రధానరసనిర్ణయము చేయడమే తప్పని నేను అతని ముఖముఎదుట చెప్పేవాడిని" అన్నారు. ఈ వాక్యము ఎంతవరకు విమర్శకు ఆగుతుంది అనే మాట అటుండగా శాస్త్రిగారి ఆత్మవిశ్వాసమునకు మాత్రము ఇది చక్కని ఉదాహరణము.

వీరియొద్ద కన్పించే మరియొక విశేషం రసజ్ఞత. శాస్త్రిగారు తత్త్వతః రసజ్ఞులు. గురుముఖతః చదువుకొన్నది వ్యాకరణశాస్త్రమే అయినా, కావ్యగోష్ఠిలో వ్యాకరణము విస్మరించగల శక్తి వీరి కున్నది. "కవిత్వం చెప్పడానికి వ్యాకరణజ్ఞత ఎందుకు?" అనే వారు. ఇట్లా అనడం వీరి స్వాతంత్ర్యమును నిరూపిస్తుంది. శబ్దశాసను డయిన నన్నయభట్టు అంతటి రససామ్రాట్టు ఎలా కాగలిగినాడా అనిపిస్తుంది. వీరి సాహచర్యము చేసినప్పుడు కూడా ఆ ఆశ్చర్యము కొంతవరకు జనించకపోదు. రసము ఎక్కడ ఉన్నా మెచ్చుకోవడము వీరికి స్వాభావికము. సమకాలికులను మెచ్చుకోరని వీరిమీద ఒక అపప్రథ వేయడానికి కొందరు ప్రతికక్షులు ప్రయత్నిస్తారు. అనగా తమ తరువాతి కుఱ్ఱకారగును తమ ప్రతిష్ఠకు భంగము లేని పద్ధతిని మెచ్చుకోవడము కాకుండా తమ శకమువారి కవిత్వమును చూచి తలయూపరని. ఇదికూడా మిక్కిలి సత్యదూరము. దాసు శ్రీరాములుగారి 'తెనుగునాడు' అను కావ్యమునుండి ఎన్నో పద్యములు సభాముఖమున చదివి తమ హర్షమును వెలిబుచ్చడము చాలామంది ఎరుగుదురు.

'బెర్నార్డుషా'నుగూర్చి ఒక ఐతిహ్యమున్నది. తన మొట్టమొదటి గ్రంథమును ముద్రించుచు తానే ఒక విమర్శ వ్రాసి ఒక స్నేహితునిపేర దానిని ప్రకటింపజేసి మరల దానికి ప్రతివిమర్శ వ్రాసి తన పేరట ప్రచురించెనట! ఈ విమర్శప్రతివిమర్శల అట్టహాసముతో గ్రంథమునకు ప్రాచుర్యము హెచ్చి మంచి రాబడి వచ్చెనట. అట్లే ఏదో ఒక నెపమున వాదప్రతివాదములు లేవదీయుచు వానిని ఘోరమయిన వాఙ్మయ సంగ్రామములుగ పరిణమింపజేయుటవలన శాస్త్రిగారికి, వారి ప్రతికక్షులకుగూడ బాగా లాభించుచు వచ్చేది. ఈ వాదోపవాదములవలన జనులలో కుతూహలము ప్రబలి ఆ వాదగ్రంథములు కొనుక్కొని చదివేవారు. 'గీరతము', 'గుంటూరుసీమ' ఈ మున్నగు గ్రంథము లిట్టి తరగతికి చెందినవే. అంతేకాక, వాఙ్మయమునం దభిరుచి గలవారు కొంద రీపక్షమునకు, మరికొంద రా

పత్రికలకు చేరి 'సవాళ్లు' చరచుచు చేయు రచనల వలనకూడ శాస్త్రిగారి కనుయాయివర్గ మెక్కుడుగ చేర్పడేది.

'అభినవగామలింగబిరుదాంకుడ' అని శాస్త్రిగారు తమ్మగూర్చి తాము చెప్పుకొన్నారు. వీరు హాస్యరసప్రియులు. వీరి గోష్ఠులలో హాస్యరసము తొణికిసలాడుచుండును. ప్రజలకు హాస్యరసమునం దధికాను రాగము గదా! ఆ హాస్యమునందు కొంచెము కొంటె తనముకూడ మిళితమై యుండును. అవధానకవినిగూర్చి వ్రాయుచు "కొంటెలలోన కొంటెయుగా గావలె"నని వీరు నిర్వచించిరి. వీరి కొంటెతనమును నిరూపించుటకు జాలిన ఉదంతములను కొన్నిటిని పేర్కొందును. విద్యార్థుల సభలో ఉపన్యసించేటప్పుడు వారి మనస్సు నాకర్షింప జాలిన కొంటెపనిని దేనినో శాస్త్రిగారు తప్పక చేయుచుండువారు. లేచి ఉపన్యాసము ప్రారంభించడము, నడుమ రొంటినుండి పొడుము కాయ తీసి —పొడుము సభాపూజ్య స్తువుగనుక—తాను పొడుము పీల్చడము, అంతటినుంచి కూర్చుండి ఉపన్యాసము సాగించడము. ఒక్క పెట్టుగ కరతాళధ్వనులు చెలరేగిపోయేవి. వసురాయకవిగారి సహస్రమాసోత్సవము క్రైస్తవ కాలేజీ భవనమున జరుగుచున్నది. దాని ప్రిన్సిపాల్ విస్సా అప్పారావుగారు శాస్త్రిగారికి ప్రేమాస్పదులు. అప్పారావుగారు లేచి వసురాయ కవిగారు ఆ సందర్భమున తమకు వ్రాసిపంపిన పద్యమేదో చదివి, "ఇందులో రెం డర్థము లున్నవి. అవి మీకు స్పష్టమే" అని చెప్పి దిగబోవుచుండగా వారి నల్లగిపెట్టలె నని కాబోలు శాస్త్రిగారు పొవాయి కొక్కగ "అయినా, ఆ అర్థములు తమనోట వినవలె నని మా కుతూహలము" అన్నారు. అయితే అప్పారావు గారు మాత్రము తక్కువచేయికాదు. సమయస్ఫూర్తితో "హనుమంతుని ముందర కుప్పిగంతులా! మీరుండగా నే నర్థము చెప్పడమా!" అని తప్పించుకొన్నారు. ఇంకొకమారు హిందూసమాజభవనములో కాబోలును, ఉపన్యాసవశమున ఇప్పటి విద్యార్థుల దురభ్యాసములను విమర్శించుచున్నారు. ఆ సభలో వీరి యూరి కాపురస్థురాలే లేకాంఛవి దువ్వూరి సుబ్బమ్మగారుకూడా ఉన్నారు. "ఏమి సిగరెట్టు కాల్చడము హెచ్చిపోయినదండీ ఇప్పుడు. ప్రతీవాళ్లూ సిగరెట్టు కాల్చేవారే. అయితే ఆ అభ్యాసం ఈవిడకు ఏమయినా వున్నదో లేదో నేను చెప్పలేను" అని దువ్వూరి సుబ్బమ్మగారివంక జూచి అన్నారు. సభంతా గొల్లుమని చప్పట్లు కొట్టడము ప్రారంభించారు. "ఈయనకు వచ్చిన ఏళ్లు ఎవరికి వచ్చినవి?" అని వినపడీ వినపడక పోవడముగా నవ్వుకొంటూనే దువ్వూరి సుబ్బమ్మగారు అనుకోవడము నేను విన్నాను.

ఒకొక్కప్పుడు అనుచితముగా హాస్యము చేసినా ఆ హాస్యమునకు గురఅయినవారు నొచ్చుకొనక పోవడానికి కారణము శాస్త్రిగారి హృదయములో కల్మషము లేకపోవడమే.

ఇక వీరి శిష్యవాత్సల్యము నిరుపమానము. దానినిగూర్చి వ్రాయుటకు నాకంటె అధికారము గల వారెందరో ఇపుడు సజీవులయి యున్నారు. అయినా, ఒకటి రెండు సంగతులు మనవిచేస్తా. నందివాడ వెంకటరత్నముగా రని గ్రుడ్డివాడు. వర్ధికులస్థుడు. ఆయన వీరు యిచ్చిన శిక్షణమువలన కవిత్వము చక్కగా చెప్పగల స్థితికి వచ్చినాడు. (పాపము ఈ నడుమనే చనిపోయినాడు) ఒకప్పుడు అతనికికూడా ఏమైనా సన్మానము చేయించవలె ననే ఉద్దేశముతో ఒక రాజాస్థానమునకు తీసికొనిపోయి ఆ రాజాగారితో "నేను అసలు కవిని. ఈతడు వర్ధికవి" అన్నారట! అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిని గూర్చిన స్మారకసభలో "నా దగ్గర రవంత చదువుకున్న హేతువుచేత ఈతణ్ణి నేను శిష్యుడనుకోవలసివచ్చినా, శీలసంపదనుబట్టి నా గురువుగానే పరిగణించాలి" అన్నారు. ఎంతటి నిష్కపటస్వభావమో చూడుడు!

మా యిద్దరి అన్యోన్యతలోను ఒక నిసర్గమాధుర్య మున్నదని నా తాత్పర్యము. వార్ధకమున ఏ వస్తువు లభించినా, దానియం దొకవిధమయిన ప్రత్యేకమగు కారము బయలుదేరుకుం దనుకుంటాను. శాస్త్రిగారి దగ్గర వాడుగల చనవుకు మేర లేదు. ఎంతటి దుస్సాహస్య

మయిన కార్యమయినా సరే, నేను కోరితే అంగీకరించే వారు. దీనిని స్థాపించడానికి ఈ స్వల్పకాలములోనే నడచిన ఎన్నో ఉదంతములు నాకు స్మృతిపథమున ఉన్నాయి. అయితే వానివలన స్వోత్కర్ష కూడా రాక తప్పదు. సాధారణముగా ఇట్టి వ్యాసములలో నే నేర్పరచుకొన్న నియమము—నేను పాలుపడిన అంశములనే మనవిచేస్తూ ప్రధానవస్తువునందలి గొప్పదనము ప్రకటించవలెననే కాని స్వోత్కర్షకు తావీయకూడదని. ఇప్పటికే పరోక్షముగా నయినా—శాస్త్రిగారి ఔదార్యము స్థాపించుటకు స్వోత్కర్ష అనివార్య మయినది. అయినదేదో అయినది. ఇంకొక్క ఉదంతము చెప్పి ముగిస్తాను.

రాజ్యలక్ష్మిమీద వ్యాసము వ్రాసిన కొద్ది రోజులలో వీరు నామీద 23 పద్యములుకూడా రచించినారు. అవి రాజమహేంద్రమునుండి వీరి దర్శనార్థముయి వచ్చే సహృదయులకు వినిపిస్తూ వుండేవారు. స్వయముగా ఒకసారి వచ్చి వానిని వినవలసినదని నాకు కబురుచేసేవారు. నేను వెంటనే వెళ్ళలేకపోవడానికి కారణము అప్పటిలో వ్యాధిగ్రస్తుడ నయి ఉండడమే. అందుచే పదేపదే కబుర్లు వచ్చేవి. తుదకు పిలుచుకొని వెళ్లినారు. ఆ పద్యములును, మరి కొన్ని పద్యములును నాకు వినిపించి, "ఏం బంగారయ్యా, ఎలా వున్నాయి పద్యములు?" అని ప్రశ్నించినారు. అంతటితో ఊరుకోవచ్చునా? నే నింకా సమాధానం ఇవ్వకుండానే చిరునవ్వుతో, "ఎందుకు అడుగుతున్నానంటే, మీరు నియోగులు కారూ. అదే దేవుళ్లాటగా వంశానుక్రమముగా తంటాలుపడతారు కాబట్టి మీకు ఈ విషయంలో చాకచక్యం ఎక్కువ వుంటుంది. వానివలె గడ్డ గట్టుకొని ఆడనంటే సామిదేవమ్మ ఆడగలదా?" అన్నారు. ఇందులోని హాస్యం, కొంటెతనం గ్రహించుకొని ఆనందించవలెను చదువరులకే విడిచి పెడతాను. "నీకు బాగా జబ్బుగా వున్నప్పుడు—ఆ సంగతి నాకు తెలియకపోయినా—అప్రయత్నంగా యీ పద్యములు వ్రాశా. అందుచేతనే నీ జబ్బు నిమ్మళించివుంటుందికూడాను" అన్నారు. నా హృదయము అనురాగపూర్ణమయి "నిజము, నిజము" అని ప్రతిధ్వనించినది.



# శివకవుల పలుకుబడి

## శ్రీ నిడుదవోలు వెంకటరావు

మల్లికార్జునపండితుడు, నన్నెచోడ కవిరాజు, పాల్కురికి సోమనాథుడు, యథావాక్కుల అన్నమయ్య యను ప్రాచీనశివకవుల గ్రంథములలో తెలుగునకు వెలుగుదెచ్చు పలుకుబడి చాలగా గలదు. తిక్కనాదిమహాకవు లీ పలుకుబళ్లను నలవఱించికొనిరి. వీనివలన ప్రాచీనాంధ్రభాషాసంప్రదాయములు పెక్కు తెలియబడును. వానిలో కొన్ని—

*    *    *    *

### ౧. చెమటనెత్తురు

చెమరు నెత్తురు, లేక చెమటనెత్తురు. అనగా ఒడలినుండి చెమట కారినప్పుడు నెత్తురుగా భావించుట. అతిగారాబము, ప్రేమతో చూచుట అని యర్థము. సోమనాథుడు బసవపురాణమున 2 బెజ్జ మహాదేవి కథలో నుపయోగించినాడు.

౧. నీచెమటయు జూచి నెత్తురు నాదు
నోతల్లి ! యిటు నూఱనోపుదు నన్న—

(పుట ౯౭)

పండితారాధ్యచరిత్రమున 3 నంబెన్నకథలో నిది ప్రయుక్తము.

౨. నెట్టన చెమటయే నెత్తురగ దల్లి
పట్టి ! ని న్నాసియు బ్రదుకంగగలద ?

(పుట ౨౪౩)

(ఆంధ్రగ్రంథమాల ముద్రణమున జాతీయముల నిది చూపబడినది.)

---

1. చూ. భారతి తారణ అశ్వయుజము—'శివ కవుల పదములు'.

2, 3. ఆంధ్రగ్రంథమాల ప్రకటితములు.

3. తిక్కననిర్వచనోత్తరరామాయణములో—

గీ. చెమరునెత్తురుగనా బంధుసమితి గరము
బ్రీతి నఱకాళులకు నఱచేతులొత్త.

(౫-౧౦౪)

అను నీ పలుకుబడి గలదు. నేటి ముద్రితప్రతిలో-
"చమురునెత్తురుగనా బంధుసమితి గరము"
అని యపపాఠము గలదు. తాళపత్త్రప్రతులలో చెమరునెత్తు రనియే కలదు. ఇట్టి యపపాఠము లందు పెక్కులుగలవు. ఇచ్చటనేగాక తిక్కన భారతము శాంతిపర్వమున నీపలుకుబడి వాడినాడు.

౪. సీ. మంత్రి......భక్త్యనురాగసంభ్రమములెసఁగ
సమసుఖదుఃఖుడై చెమరునెత్తురుగాఁగ
దలచుచు.

(౨-౩౬౯)

ఇది కాలకవృక్షీయక్షేమదర్శిసంవాద మైనవెనుక భీష్మధర్మరాజసంభాషణమున గలదు. దీనికి సంస్కృత మూలములేదు.

౫. మడికిసింగన పద్మపురాణములో—

సీ. అలిగి నొచ్చియు నోర బలుకని పెనిమిటి.
................
నెఱి నాదుచెమటనెత్తురుగాఁగ దలతువు
మఱది కానల గాడుపఱచె నెట్టు?

(౯-౧౩)

౬. జక్కన విక్రమార్కచరిత్రలో నీ పలుకుబడి నందుకొన్నాడు:

సీ. చెమటనెత్తురుగాఁగ జిత్తమునఁ దలంచి
యుత్కలి బెంచు మవంబడెంచి.

౭. విశ్వపతి సోమయ పద్యబసవపురాణమున— "చెమటవెట్టగ ననగనా చిన్నివడుగ" (౧-౬౮); అని ప్రయోగము కలదు.

* * * *

## ౨. పెరుగును, వడ్లును కలుపుట

పచనమైన యన్నముతో, పెరుగును కలిసినయెడల నది యాస్వాదనీయమై యనుభవయోగ్యమగునుగాని కేవలము వడ్లును, పెరుగును కలిపిన నొకదానితో నొకటి యతుకుకొనక పొందిక లేకపోవును. మరియు నది తినుట కర్హము గాకపోవుటచే ప్రయత్నము వ్యర్థమే యగును. అట్లే పదపదార్థసంబంధకతత్త్వము గుర్తెఱిగి, రసౌచిత్యమును పాటించి చెప్పిన కవిత రసానుభవ యోగ్యమై యుండునుగాని, శిథిలబంధమై పొందిక లేనిదైయై, ఏవేని కొన్ని పలుకుబళ్ళతో దోష యుక్తముగా నుండు కవిత యెన్నికకెక్కదు.

౧. పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రలో—

"జాతుల రచనాప్రణేతల కావ్య
నీతుల రీతుల నేతులట్టుగ
వరకవుల్ గొనియాడ వర్ణనకెక్క
ధర జెప్ప కృతియ యుద్యత్కృతిగాక
జగ్గిపూరక మపశబ్ద మక్రమము
తిలవిరుపసమగ్రతి శిథిలబంధ...
మెలుపు...ప్రలాపోక్తి లాఘవంబనక
వనిగూర్చు కృతులునా వడ్లును పెరుగు
గిసుకచంవపు గిలిగిలిక్కృతుల్ కృతులె?"
(అవతారిక)

౨. మడికిసింగన సకలనీతిసమ్మతములో (ప్రాచీన కవిత్వములనుండి యేర్చికూర్చిన పద్యములు)—

గీ. "పెనచి వడ్లును పెరుగును బిసికినట్లు
కెలను నవ్వంగ గిలిబిలికృతులు సెప్పి"
(౨౬ ప.)

అను నీ పలుకుబడి గలదు. ఈ పద్యము మడికి సింగనకృతియే యనుటకు సింగనకృతమగు వాసిష్ఠ రామాయణమున నీ పలుకుబడి యుండుటయే ప్రమాణము.

గీ. కణగి వడ్లును పెరుగును గలుపుభంగి
అకటవికటంబులగు ప్రశ్నలడిగె నదియు.
(౨-౧౩౨)

పైవానిలో తొలుత పద్యపాదములు సోమనాథ కవిద్వయానుకరణమే.

౩. పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి జైమినీ భారతములో—

క. సారెది ననాచారంబుల
మరువగుచుం బ్రథమపాదమున కలిమహిమన్
పెరుగును వడ్లును కలిపిన
కరణిని వర్ణాశ్రమములు కత్తెర గలియున్.
(౮-౧౨౦)

దీని ననుసరించి, సముఖము వేంకటకృష్ణప్ప నాయని వచనజైమినిభారతమున నిట్లే ప్రయుక్తమై యున్నది.

౪. తాళ్ళపాక చిన్నన్న ద్విపదపరమయోగి విలాసమున—

సారెకు నిగ్రహస్థానంబు విడుచు
నేరీతి నిశ్చయంబెంచను లేక
పెరుగు వడ్లును కలిపిన రీతి నుండ
నరనాథుడెంతో చింతాక్రాంతు డయ్యె.
(౩౪౮ పుట-యామునాచార్యచరిత్ర)

౫. "వడ్లు పెరుగును గలిపిన వడువు దోచు."
(పద్యబసవపురాణము, ౧-౯)

౬. అద్యతనకాలమునగూడ నీ పలుకుబడి ప్రయుక్తమైనది:

"కాని ఆ రాగముల పేళ్లు ఎన్నోచోట్ల రాగమును భావమును పరస్పరమిశ్రితములుగా నుండ వీలులేక 'పెరుగును వడ్లును గలిపిన ట్లుండుట' తటస్థించినది."

(శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి-నాటకోపన్యాసములు, ౨)

కాని యీ పలుకుబడి పాల్కురికి సోమనాథునికన్న ప్రాచీనమైనది. క్రీ. శ. ౮౧౪ నుండి ౮౭౭ వఱకు పరిపాలించిన నృపతుంగుడు కవిరాజమార్గములో పై పలుకుబడి నిట్లు వాడియున్నాడు:

క. ఇల్లిగిదు తప్పక దిల్లిగ
పోల్లది దెందరికు సమకిబల్లం తెల్లం
కెలుం ఖెసగుం గుడిదం
తల్లద తల్లణిసదలసదిసుమ్మదుపదముం.
(౧-౨౭)

*   *   *   *

## 3. గజస్నానము

ఏనుగు నీటిలో నెంత మునిగినను పైకి రాగానే దుమ్ము చల్లుకొనును. కాబట్టి అది యెంతసేపు స్నానము చేసినను దానివలన స్నానముచేసిన ఫలము లభింపదు. వ్యర్థము, నిష్ఫలము అను నర్థముల నిది ప్రయుక్తము.

౧. పండితారాధ్యచరిత్ర—

ద్వి .. .. పలుతీర్థములను
మునుగు జలస్థానములు వేనవేలు
గొనయు భూతిస్నానమున కెనగామి
పూని భూతిస్నానహీనుండు సేయు
స్నానంబు ఇవి గజస్నానంబు లగుట.
(దీక్షాప్రకరణము-౬౪ పుట)

౨. నీతిసారముక్తావళిలో బద్దెన—

క. తాను దయ తెద్ద మనిచిన
మానిసిపతి తిగిచియొకల మన్నింపమి య
జ్ఞానము తిన మనవు గజ
స్నానం బగు మీవ గీర్తినారాయణుడా.
(౮ పద్యము)

3. భాస్కరరామాయణము - యుద్ధకాండ-విభీషణశరణాగతి—

క. ఉదకము నళినీపత్రము
గదిసిన కైవడియునట్లు కలయువు నీ మా
హృదయమున గజస్నానము
తుది మఱి నీతోడి పొందు దష్టచరిత్రా!

౪. నారాయణశతకము—

స్నానంబుల్ నదులందు జేయుట గజ
స్నానంబు చందంబగున్.

---

* తెల్లణవదస్త్రి యెఱపఱు పెరుగు.

౫. తెలుగుననే కాక సంస్కృతమునను నిది ప్రయుక్తము.
ఆమ్నాయాభ్యసనా న్యరణ్యరుదితం,
వేదవ్రతాన్యన్వహం
మేదశ్ఛేదఫలాని, పూర్త
విధయః సర్వే హుతం భస్మని,
తీర్థానా మవగాహనానిచ
గజస్నానం వినా యత్పద
ద్వంద్వాంభోరుహసంస్మృతీః;
ర్విజయతే దేవ స్స నారాయణః.
(కులశేఖరాళ్వారు ముకుందమాల)

౬. కువలయానందమున—

రవితప్తో గజః పద్మాం
స్తప్యత్యాత్ బాధితుం ఉణాత్
పరో విశతి న స్నాతం
గజస్నానంతు నిష్ఫలమ్.

*   *   *   *

## ౪. కరాసి = చేతికత్తి

బాహాసిని అనే కరాసిశబ్దము శివకవులు ప్రయోగించిరి. నన్నెచోడ కవిరాజు కుమారసంభవములో—

౧. క. కరము ఉద్రేకించిన బంటుల
కరాసి గఱచుకొని క్రొవ్విగతి నని మేపో
త్కరము దెగ బాణిచె నొక్కడు
సురవాహిని వరియుంపనెమ్మచో యయుబోలెన్.
(౧వ భాగము, ౭౬ పద్యము)

అను దీనిని ప్రయోగించినాడు. కాని నన్నెచోడునికి ముందు కన్నడమున నాగవర్మఛందోంబుధిలో నిది ప్రయుక్తమైనది. నాగవర్మ క్రీ. శ. ౯౯౦ ప్రాంతమువాడు.

౨. చ. జటగళ బంబలాప్లవలకావళి .....
శక్తి రాజితశక్తిశూలమా
ల్పికవ కరాసి గౌరి నిజబల్లభయా గిరమిత్ర్ఫు.
(పీఠిక, ౨ వ పద్యము)

3. నాచనసోముడు హరివంశములో 'కరాసిధారలన్' అని ౪-౧౧౬లోను, ౪-౨౩౫లోను రెండు తడవలు దీనిని వ్రాసినాడు.

౪. ఎఱ్ఱన విక్రమార్కచరిత్రలో—

ఘోరకరాసిపత్త్రమునకుఁ బలిసేయుదు-

(౨-౨౩౬)

అని ప్రయోగించినాడు. ఇది సమాసగతమగుటచే తత్సమపదమే కదా.

౫. నవరము చిననారాయణకవి కువలయాశ్వచరిత్రలో—

క. అలుగువగ జూపు పెళ్ళం
దలతలమను నింత సోకిన న్మృగవానిన్
కళ్ళదాక బెనసు నాక మొ
క్కలపు దొర కరాసి నీటుకత్తియవోలెన్.

(౨-౧౩౯)

అని శ్లేషలో, నీటుకత్తియ = విలాసముగల స్త్రీ, నీటుకత్తియ = నీటగు ఖడ్గము అని మనోహరముగ నీశబ్ద ప్రయోగము గావించినాడు. ఇంకను కొన్ని గలవు. విస్తరభీతి నీయలేదు.

* * *

## ౬. కెడ్బెరసు

ఇది కెడు + బెరసు అను రెండు పదముల కూడిక. కెడు = చెడిపోయి, బెరసు = కలయిక కలిగినట్టిది- స్వరూపనాశనము నొందకున్నను వేఱుపరచుటకు వీలులేనంతగా కలిసిపోయినది అని యర్థము. సంకీర్ణమైనది అను నర్థమున నిది వాడుకకెక్కినది.

నన్నెచోడకవిరాజు యుద్ధవర్ణనలో రెండు తడవలీ శబ్దప్రయోగము కావించినాడు.

క. సురబలమున సురబలముం
బోరిబోరి వడి దళిమి పెనగి పొడువ రయమునన్
జొరసి యొడలొట్టుకొని కె
డ్బెరసై పీనుగులు పడువు పేకయు బడిమోన్.

(౧౧-౭౯౪)

క. దురమున మెడ లోడ తల మొల
బిబి శిర ముర ముక్కు ప్రక్క బవలుపడం గె
డ్బెరసై యేర్పడ కలిభీ
కర మయ్యెన్ జముడు కడిచి క్రక్కిన భంగిన్.

(౧౧-౩౬౦)

పై పద్యములలో రెండవదానియందు శబ్దార్థము వివరింపబడినది. ఆహారము తినగానే క్రక్కినయెడల, తిన్న పదార్థములు ఖండఖండములై వేఱుగ కానవచ్చినను విడదీయుటకు వీలులేకుండ నుండును గదా. అట్టి విధముగ చెడి కలిసిపోయిన దని యిందు కలదు.

ఆవెనుక తిక్కన ఈ పదమును ప్రయోగించినను, నది పాఠభేదములో బడుటచే, మన దృష్టికెక్కలేదు. తిక్కన దీనిని సంకీర్ణమగు, కలిసియుండు, పెనగొనియుండు అను నర్థములలో ప్రయోగించినాడు.

*ద్రోణపర్వములో—(౪-౨౯౪)

...చతురంగబలంబుల యవయవంబులు జామరచ్ఛత్రకేతుశకలంబులు గోదండగదాదండాది హేతిఖండంబులున్ బెఱసిపాఱు నెత్తురుటేఱులు గెట్టువలె గట్టె. *

అని అచ్చులో గలదు. దీని క్రిందిపాఠములలో స్పష్టముగా గెడసి- గెడ్బరచి- గెడ్బెసి అనునవి కాన వచ్చుచున్నవి. కాని యీ పదము నిఘంటువులో లేక పోవుటచే, సరియగు పాఠ మడుగున బడినది. నన్నెచోడుని ప్రయోగము ననుసరించి క్రిందిపాఠమే సాధువు గదా.

ద్రోణపర్వములోనే వేఱొకచోట (౫-౧౯౩) నీ పద మిట్లే గ్రంథములో చూపబడక పుటయడుగున సూచింపబడినది.

మ. తెఱుం జేతులు......ఘోటశ్రేణులున్ వారణా
వలులుం జేర్పడ కైపయిం దళిమి-

అను పద్యముక్రింద ఆనందముద్రణములో గెడ్బెరసై - గెడ్బెరసై - గెప్పుచెన్ - గెవ్వరసై వడం దళిమి అను పాఠము తీయబడినవి. వావిళ్ల ముద్రణములో 'గెడ్బెరసై వడందళిమి' అను సరియగు పాఠము గలదు. ఇచటను మూలమున 'గెడ్బెరసై వడం దళిమి'యనియే యుండదగును. పైన చూపిన తిక్కన

* ఇదియానందముద్రణపాఠము. వావిళ్ల ముద్రణమున నన్నిచోట్ల 'గెడ్బెరసి' అని సరియగు పాఠము లున్నవి.

ప్రయోగము లనుసరించి యిచ్చట 'చేష్పష వైపయిగా' అను పాఠము నుంచరాదు గదా!

శల్యపర్వములో నిట్లే (౧-౧౦౪) 'కడ్బరసి' ప్రయుక్తమైనది. తిక్కనపదము నూతన గాని నైషధమున శ్రీనాథుడు—

"రాజనంముల యందియల మొరపంబులోడ గడ్బరసి దేవదుందుభిధ్వానంబు రోదసీకుహరంబు దీటుకట్టెగ" (౬-౨౯)

సర్వంకషవ్యాఖ్యలో మూలమున 'గడబెరసి' (కటాక్షపుట) అని ముద్రితమైనను 'గడ్బరసి' అను పాఠమును పాఠభేదములలో చూపబడినది. (చూ. పాఠభేదములు, అనుబంధము ౨౨ పుట) ఈపదము శబ్దరత్నాకరములో లేనందున దీనికి గడబెరసి = జతికూడి అని యర్థము వ్రాయబడియున్నది.

కాశీఖండములో—

వ. నిష్ఠురారావనిష్ప్రాణోష్మ వంబునుం గూడి మృగంబుల రొలుంగులతోడ గడ్బరసి" (౧-౯౩)

అనచోట నీపదము ప్రయుక్తమైనది. ముద్రిత కాశీఖండములో 'గీష్పఱచి' అని పాఠము కలదు. సరియగు పాఠము 'గడ్బరసి' యే కదా!

గడ్బరసు అను పదము 'గీష్పరించి' అను రూపముతో నన్నయభారతమున నిట్లున్నది:

క. శరనిధినినాదనిభమగు
పురఘోషము గీష్పరించి పొలుపగు గరము
వ్పూరి బ్రహ్మపురి మహీసుర
వరవేదాధ్యయనరవ మవారిత మగుచున్.

ఇచ్చట 'పురఘోషము గడ్బరసయి పొలుపగు గరము' అనియే యుండదగును.

మన భావకు పరమప్రామాణికములైన భారతము మొదలగు ప్రాచీనకావ్యముల పాఠము లెట్లున్నదియు పైదానినిబట్టి తెలియగలదు. ఒక్క నన్నిచోడడే గాక నన్నయ, తిక్కన, శ్రీనాథుడు ప్రయోగించిన ఈ పదమునకు నిఘంటువుల నన్నిచోడని ప్రయోగముతే కలవు. కారణము పై గ్రంథము లన్నియు సరియగు పాఠములతో, సరిగా నావిష్కృతములు కాకపోవుటయే యని ప్రాజ్ఞులు గ్రహింపగల్గుదురు.



# అద్వైతసిద్ధి

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

౧

ఏ తొలిజన్మమం దిచట నెవ్వఁడు నాఁటెనో, నేఁటి కిట్టు ల
ద్వైతరసాల మొంతయును నేపయి, యేపగు కొమ్మకొమ్మకుం
బూఁత పునాసపూఁతలుగఁ బూచెను; కోయిలగుంపు చేరి లే
లేఁతచివుళ్లు మేసి కదలింప నకుంఠకషాయకంఠముల్.

౨

నాలో నుంటివి నీవు, నీ యెడఁదలో నా డెందముండెన్; జగ
జ్జాలం బెల్లను నీవు నేన; యిది మెచ్చంబోక ద్వైతస్థితిం
గాలక్షేప మొనర్చు నూహలకు ధిక్కారమ్ము, పూర్ణత్వసు
శ్రీలాభంబు దలంచువారలకు సుశ్రేయమ్ము నిండరుతన్!

౩

నీవే నే నను భావనాగరిమ యెన్నో నామము లెత్తించి, యె
న్నో వేదాంతరహస్యముల్ వినిచి, యెన్నో శాస్త్రముల్ చూపి కా
నీ, విశ్వాసముకల్మిఁ జేరికకు రానే రాదు; తత్త్వానుభో
ధావిర్భూతికి మేలిమచ్చు లగుఁగాదా, వేదిని న్నెచ్చెలుల్.

౪

శ్రవణ మున్నదిగాని సరిలేదు మననమ్ము, అసలు నిదిధ్యాస మసలఁగ లేదు;
అపవాదరీతి, యధ్యారోపభాతియుఁ గొంచెపాటియును భావించ లేదు;
జగమెల్లయును మిథ్య, సత్యమ్ము బ్రహ్మము నను పరాకాష్ఠ కానంత లేదు;
నీ వన నెవ్వాఁడు, నే నన నెవ్వాఁడు ననెడి తత్త్వవిచార మసలు లేదు;
పాఁల నెఱుఁగవయట్టి సంపూర్ణమైత్రి - కలవెగాఁబోలు నాచార్యక మ్మొకర్చి;
కాసిచో, స్వాములకుఁగూడఁ గలుగఁబోని - యద్వయత కల్గునేమొన్నఁడైన నిలులు?

౫

పొరయుం బొచ్చెము లేని నెచ్చెలులు నేర్పుల్ విందువెట్టంగఁ జే
రి రటం చెంతయు సంతసమ్ము మెయిఁ బరివ్రాజ్యసామ్రాజ్యముం
బరిపాలించెడి సార్వభౌమ భగవత్పాదుల్ మదాచార్య శం
కరు లీ యద్వయమైన కూడికకు నోంకారమ్ము జోడింపరే?

---

## మన ప్రాచీనసంఘతత్త్వ శాస్త్రంలో ఒక అధ్యాయము

# అగ్న్యాధానము-అగ్నిహోత్రము

శ్రీ నిర్వికల్పానందస్వామి

(గత సంచిక తరువాయి)

ప్రతిమంత్రాన్నీ ఎవరో ఒక ఋషి ప్రచారం చేశాడు. ప్రచారంచేశాడనే ఎందుకంటున్నానంటే, మంత్రాలు రచింపబడ్డాయి అనే మాటని వైదికార్యులు ఒప్పుకోరు. ఏఋషి ఏమంత్రాల్ని ప్రచారం చేశాడో ఆయనే వాటికి ఆవిష్కర్త—ఋషి. ప్రతి మంత్రానికీ ఉద్దిష్టమైన దేవత ఒకటి ఉంటుంది. యజ్ఞకర్మల్లో ఉపయోగపడని మంత్రం అంటూ లేదు [10]. వ్యర్థ మంత్రాలికి ఆస్కారమే లేదు; ఇల్లాంటి మంత్రాల సంహితే వేదమైతే సామాజికులకు దాంతో ఏం ప్రయోజనం ఉంటుందికనుక.

### బ్రాహ్మణాలు

సామాజికులకు మంత్రాల సార్థకతను చూపాలి. కనుకనే, బ్రాహ్మణగ్రంథాల అవతరణ. ఏ మంత్రాన్ని ఏ రీతిగా ఏ యజ్ఞంలో ప్రయోగించాల్సిందీ ఈ బ్రాహ్మణాలు నిర్దేశిస్తున్నాయి. అంతే కాకుండా ఆ మంత్రాన్నే ఉపయోగించటంలో ఉన్న సార్థకత ఏమిటి, ఇంకో మంత్రాన్నే ఎందుకు ఉపయోగింపకూడదు అనే విషయాల విస్తృతవ్యాఖ్య కూడా ఉంటుంది ఈ బ్రాహ్మణాల్లో. ఈ గ్రంథాల్ని ప్రచారం చేసినవాళ్ళుకూడా ఋషులే. అంతరంగ ప్రేరణవల్లే వాళ్ళకీ మంత్రాల వినియోగతాత్పర్యాలు తెలిశాయి; వాట్ని సమాజకల్యాణార్థం ప్రచారం చేశారు. ఈ ప్రేరణ రమ్మంటే మరి అందరికీ వస్తుందా? అందువల్ల మంత్రాలు వేదాలైనట్లే, వాటికి వ్యాఖ్యలైన బ్రాహ్మణాలుకూడా వేదాలే. కనుక, వేదం మంత్రబ్రాహ్మణాత్మకం.

### ధర్మసూత్రాలు

వైదికసమాజంయొక్క మూలం ఈ బ్రాహ్మణగ్రంథాల్లోనే ప్రతిష్ఠితమై ఉంది. వైదికులందరూ బ్రాహ్మణాల్నికూడా వేదాలుగానే పరిగ్రహించి, సామాజిక వ్యవస్థను ఏర్పరుచుకున్నారు. బ్రాహ్మణగ్రంథాల్లో ఉన్న విధినిషేధాల్ని అనుసరించే ధర్మశాస్త్రాలు రచింపబడ్డాయి; ధర్మశాస్త్రాల బీజం ఇక్కడే. ఈ వేదవాక్యాలు స్వతఃప్రామాణ్యాలు. వీట్ని అంగీకరించితీరాల్సిందే. వేదవాక్యవిరుద్ధమైన ధర్మశాస్త్రం నెగ్గదు [11]; వేదవాక్యప్రామాణ్యమే బలవత్తరం.

### పూర్వమీమాంస: న్యాయశాస్త్రాలు

అయితే, బ్రాహ్మణగ్రంథాల్లోనే పరస్పరవిరుద్ధమైన వాక్యాలు ఉన్నాయి. అభిప్రాయభేదాలు లేవని చెప్పటానికి వీల్లేదు. ఒక కర్మనుగురించి తాత్పర్యం చెప్పటంలోనూ, విధినిషేధాల్ని నిర్దేశించటంలోనూ విభిన్నత ఉంది. ఈ వేదవాక్యాల్ని సమంజసపరచటానికిగ్గాను పండితులకి చాలా పరిశ్రమించాల్సి వచ్చింది. పరస్పరవిరుద్ధాలైన వేదవాక్యాలికి ఏక

10. ఆమ్నాయస్య క్రియార్థత్వాత్ ఆనర్థక్యం అతదర్థానామ్. —జైమిని. ౧-౨-౧.

11. విరోధే తు అనపేక్షమ్. —జైమిని ౧-౩-౩.

వాక్యత కల్పించి చూపకపోతే, సామాజిక దే మార్గాన్ని అనుసరిస్తాడు? ఈ సమంజసకార్యనిర్వహణంకోసమే 'కర్మమీమాంసాదర్శనం' అనే పెద్ద శాఖ ఒకటి వెలువడింది. ఈ దర్శనం నిర్ణయించిన నియమాల్ని వైదికసమాజం అంగీకరించింది. ఇప్పుడు మనకున్న న్యాయశాస్త్రానికి (Jurisprudence) ఆరంభం ఇక్కడే లభిస్తుంది. అనుష్ఠానవిషయంలో సంశయం కలిగితే ఈ పూర్వమీమాంసాసూత్రాల్ని ప్రయోగించి కర్తవ్యాన్ని నిర్ణయించాలి.

సర్వదేశాల్లోనూ సమాజం అసహజాలైన కొన్ని conventionలమీద ఆధారపడే ఉంది. సామాజిక అనుష్ఠానాల వైజ్ఞానికతాత్పర్యం ఏమైనా కానీ, వీటి చారిత్రకమూలం కొన్ని కన్వెన్షన్ల మీదే ఆధారపడి ఉంది. సమాజంలోని పదిమందీ అంగీకరించిందే సమాజవ్యవస్థకు భిత్తి. అది విజ్ఞానసమ్మతమే కావాలని లేదు. వ్యవహారశాస్త్రవేత్తలైన లాయర్లకు ఈ కాల్పనికమూలంయొక్క సంగతి బాగా తెలుసు.

## యజ్ఞశబ్దార్థం

యజ్ఞశబ్దానికి సంకుచితార్థమూ ఉంది; వ్యాపకమైన అర్థమూ ఉంది12. దేవతను ఉద్దేశించి చెయ్యబడే ద్రవ్యత్యాగమే యజ్ఞం. ఇక్కడ దేవత, ద్రవ్యము, త్యాగము అనే మూడు శబ్దాలు మనకు లక్షిస్తున్నాయి. వీటికూడా ద్వివిధార్థాలు ఉన్నాయి. ప్రస్తుతం సంకుచితార్థాన్ని గురించే విచారిద్దాం. వేదంలో ఇంద్రాగ్నిసోమవిష్ణురుద్రాదిపదాలు మనకి కనిపిస్తాయి. వీళ్లే దేవతలు. వీరి నుద్దేశించి ఏదో ఒక ద్రవ్యాన్ని అర్పించటమే త్యాగం. ఆహుతి అంటే ఈ త్యాగమే. ఆహుతమైన ద్రవ్యం హవ్యం. నానావిధ ద్రవ్యాలు హవ్యంక్రిందకు వస్తాయి. ఆజ్యము—యజ్ఞార్థం సంస్కరింపబడ్డ ఘృతమూ, చరువు—పాయసాన్నమూ, పురోడాశము—రొట్టె, పాలు, పెరుగు, సోమరసము, పశుమాంసమూ మొదలైనవి. ఈ ద్రవ్యాల్ని ఆహుతిచెయ్యటమే యాగం. ఏ గృహస్థు శుభంకోసం యాగం అనుష్ఠింపబడుతుందో ఆయన యజమానుడు. యజమానినిమిత్తం యాగకర్మను నిష్పన్నంచేసేఆయన యాజకుడు, లేక ఋత్విక్కు. యాగకర్మాంతర్గతమైన ప్రతిఅనుష్ఠానమూ, మంత్రోచ్చారణపూర్వకంగా జరుగుతుంది. ప్రతికర్మకూ నిర్దిష్టమైన మంత్రాలున్నాయి. కర్మప్రయుక్తాలటమే మంత్రాల సార్థకత. కర్మవినియోజ్యత లేని మంత్రం నిరర్థకం. మంత్రత్రైవిధ్యాన్ని పైన వివరించాం. ఈ మూడురకాల మంత్రాలూ ప్రయోగింపబడే యజ్ఞాలు కొన్ని ఉన్నాయి. ఈ యజ్ఞాల్లో యాజకుడు ఒకడుంటే సరిపోదు.

## ఋత్విక్కులు

ఎంతమంది కావాలో చూద్దాం. వీళ్లనే ఋత్విక్కులు అనికూడా అనొచ్చు. ఒక ఋత్విక్కు ఋఙ్మంత్రాల్ని స్పష్టంగా ఉచ్చైఃస్వరంతో పఠించాలి. ఇంకొకాయన నిమ్నస్వరంతో యజుర్మంత్రాల్ని పఠించాలి. మరొకరు సామమంత్రాల్ని గానం చెయ్యాలి. కనుక, ఈ ముగ్గురు ఋత్విక్కులతో, లేక యాజకులతో పనిపడుతుంది. ఋగ్వేదమంత్రాల్ని పఠించి, దేవతల్ని ఆహ్వానించేఆయన పేరు హోత. ఈయన ఆహుతుల్ని ఇవ్వనక్కరలేదు. ఆహ్వానార్థకమైన హ్వే ధాతువునుంచి వచ్చింది ఈ శబ్దం. యజ్ఞభూమికి దేవతల్ని ఆహ్వానించి తీసికొనివచ్చేవాడని దీనికి అర్థం. అగ్నిలో ఆహుతుల్ని వేసేవాడు అధ్వర్యుడు. ఈయన యజ్ఞోపయోగాలైన హవ్యద్రవ్యాల్ని సమకూర్చుకోవాలి. అంతేకాకుండా, యజుర్మంత్రాల్ని పఠించాలి. కనుక, అధ్వర్యుడు యజుర్వేదియైన ఋత్విక్కు. పెద్దపెద్ద యజ్ఞాల్లో ఆహ్వానకర్త అయిన హోతకున్నూ, ఆహుతిదాత అయిన అధ్వర్యుడికిన్నీ ఇతరసహాయ్యకులు కూడా ఉంటారు. సామగాయకుడైన ప్రధానఋత్విక్కు ఉద్గాత. ఈ ముగ్గురి పనుల్ని పర్యవేక్షించటానికిన్నీ, వాళ్లు చేసే తప్పుల్ని దిద్దటానికిన్నీ ఇంకో ఆయన ఉంటాడు. ఆయనపేరే బ్రహ్మ. ఈయన త్రివేద

---

12. యజ్ఞో వై శ్రేష్ఠతమం కర్మ.

— శుక్లయజుస్సు.

జ్ఞుడు; కనుక అందర్లోనూ శ్రేష్ఠుడు. బ్రహ్మ అనే ఈ పేరే శ్రేష్ఠార్థద్యోతకం. వేదవాక్యాలు బ్రహ్మ; వాటి వ్యాఖ్యానాలు బ్రాహ్మణాలు; వ్యాఖ్యాన ప్రచారకర్తలు బ్రహ్మవాదులు. ద్విజసమాజంలో ఎవరిపై ఈ బ్రహ్మవాక్యాల్ని రక్షించే భారం పడ్డదో, వారు బ్రాహ్మణులు. (ఇంకా పైకి వెడితే ఉపనిషత్తులు ప్రతిపాదించే చరమసత్యం బ్రహ్మం; పౌరాణికుల సృష్టికర్త బ్రహ్మ.) కనుక, త్రివేదజ్ఞుడున్నూ, ఋత్విగ్గ్రగణ్యుడున్నూ అయిన ఆయన బ్రహ్మ అనబడటం యుక్తమే.

## యజ్ఞ ఫలం

యజ్ఞం కర్మ. ప్రతికర్మకూ ఏదో ఒక ఫలం ఉండనేఉంది. ఆ ఫలం ఇహలోకంలోనూ దొరకవచ్చు, పరలోకంలోనూ దొరకవచ్చు. ఏ కర్మకు ఏ ఫలం లభించేదీ యుక్తివిచారాలద్వారా తెలిసికోలేం. కాని, బ్రహ్మవాదులైన ఋషులు విశిష్టమైన శక్తివల్లా, తమ అంతర్ముఖీనత్వంవల్లా గ్రహించేవాళ్లు.13

యజమానిహితంకోసమే యజ్ఞం; అతడు సపత్నీకంగా కర్మను అనుష్ఠించాలి. కనుకనే ఆవిడ ధర్మపత్ని. ఫలం ఉభయులకూ తుల్యం. ఆవిడ యజ్ఞస్థలంలో ఉండాలి; కాని వేదమంత్రాల్ని ఉచ్చరింపనక్కర్లేదు.

## స్త్రీలకు అనధికారం

వేదమంత్రాల్ని యథారీతిగా ఉచ్చరించాలి అంటే ఆచార్యగృహంలో చాలాకాలం ఉండాలి, సేవాశుశ్రూషలు చేస్తూ. ఇల్లా ఉండటం ఆడవాళ్లకు పడదు. కనుక, క్రమేపీ స్త్రీలకు వేదమంత్రోచ్చారణాధికారము పోయింది. అత్యంతప్రాచీనకాలంలో వనితలుకూడా వేదమంత్రాల్ని ప్రచారంచెయ్యటం, వాళ్ళలోకూడా ఋషులూ, బ్రహ్మవాదినులూ ఉండటం గోచరిస్తుంది. ఉపనీతలై వీళ్ళుకూడా గురుగృహంలో కర్మజ్ఞానకాండల్ని అధ్యయనంచేస్తున్నట్టు కనిపిస్తుంది. అపాల, మైత్రేయి మొదలైన దృష్టాంతాలెన్నో ఉన్నాయి. ఇప్పుడు 'రైసెన్షియల్ రెసిడెన్స్'లో నివసించకపోతే విశ్వవిద్యాలయాలు ప్రసాదించే ఉన్నతవిద్య లభించనట్టు, ఆ కాలంలో గురుగృహవాసం చెయ్యకపోతే వేదాభ్యాసానికి వీల్లేదు. అందువల్లే స్త్రీలు క్రమంగా విద్యాధికారాన్ని కోల్పోయారు.

ఇంక, ఈ వేదమంత్రోచ్చారణమాట చూస్తే, అంత తేలిక పని కాదు. ఈ ఉచ్చారణను బోధించటానికి 'శిక్ష' అనే వేదాంగమే ఉంది. వేదంలోని భాష వ్యవహారంలోంచి తొలగిపోయినప్పుడు ఆచార్యోపదేశంవినా ఉచ్చారణ కుదరదు. యథోచితమైన ఉచ్చారణ లేకపోతే, ఫలం లభించదు సరికదా, హానికూడా కలగవచ్చు. 'ఇంద్రశత్రు' అనే శబ్దాన్ని గురించిన విషయం ఇందుకు ఉదాహరణ. వెనకటికి ఒకాయన ఇంద్రుడితో శత్రుత్వం వహించి, ఆయన్ని హతమార్చే కృత్యనొకదాన్ని సృష్టించే ఉద్దేశ్యం మనస్సులో పెట్టుకొని, హోమం చేశాట్ట. కాని, ఉచ్చారణవైకల్యంవల్ల ఆ శక్తి ఇంద్రుడికి శత్రువైనవాణ్ణే పరిమార్చేదిగా తయారైంది. కాలవశవ్వి మొసల్ని తీసికోరావటంకాక మరేమిటి ఇది!

యజమానిపత్ని మంత్రోచ్చారణ చెయ్యకపోయినా, వైదికక్రియాకర్మల్లో ఆవిడకు పరిపూర్ణాధికారం ఉంది. ధర్మపత్ని లేకపోతే యజ్ఞమే జరగదు. ఈవిడకికూడా కొన్ని అనుష్ఠానాల్లో చెయ్యికలుగజేసుకోవాలి. సగం ఫలం ఈవిడగారి వంతు.

## నిత్యకామ్యాలు

యజ్ఞాల్లో కొన్ని నిత్యకర్మలు; కొన్ని కామ్యాలు. కామ్యకర్మలు స్వేచ్ఛాధీనాలు—ఇష్టం వస్తే చెయ్యవచ్చు, లేకపోతే ఊరుకోవచ్చు. ఆయా విశేషఫలాల్ని కాంక్షించేవాడు తదనుసారమైన కర్మల్ని చెయ్యవచ్చు. కాని, నిత్యకర్మలు అవశ్య

18. ప్రత్యక్షేణ అనుమిత్యా వా
 య స్తూపాయో న బుధ్యతే,
ఏతం విదంతి వేదేన
 తస్మాద్వేదస్య వేదతా.

కర్తవ్యాలు. చెయ్యకపోతే ప్రత్యవాయం—పాపం. కాని, ఈ నిత్యకర్మల్ని చెయ్యటానికి రాజదండ వ్యవస్థగాని, లెజిస్లేషన్‌గాని లేదు. సమాజనింద తగుల్తుంది. పాతిత్యాన్ని పొందుతాడు14. ఈ దేశంలో ఆనుపూర్వికమైన సమాజవిధి ఎవర్నీ బలవంతపెట్టి ఏ పనీ చేయించ దనే విషయాన్ని జ్ఞాపకంపెట్టుకోవాలి. నిత్యకర్మ చెయ్యకపోతే పాపంకదా, ఆ పాపం తగలకుండా పోతుందా, అనుభవించాల్సిందే. ఇంకో శిక్ష దానితో నిమిత్తం లేదు. ఎవ రెల్లా పోతే ఏం?

## వివాహానికి పూర్వం

ఉపనయనానంతరం బ్రహ్మచారి ఆచార్యగృహవాసి అవుతాడని పైనే చెప్పాం. ఈ ఆచార్యుడి ఇంట్లో అగ్ని ఉంటుంది. ఇది ఆచార్యుడి స్వంత అగ్ని. బ్రహ్మచారి ప్రత్యహమూ సంధ్యాసమయాన ఆ అగ్నిలో ఒక కాష్ఠాన్ని వెయ్యాలి. ఇది బ్రహ్మచారి సమిత్-హోమం. సమిత్తు అంటే యజ్ఞకాష్ఠం. వేదాధ్యయనం ముగిశాక, సమావర్తనానికి పూర్వమో, లేక తర్వాతో అగ్నిస్థాపన చెయ్యాలి. పత్నీగ్రహణ సమయంలో ఈ అగ్నిలోనే లాజహోమాదులు చెయ్యాలి. గృహ్యాగ్ని, ఆవసథాగ్ని, స్మార్తాగ్ని అనేవి ఈ అగ్నికి నామాంతరాలు. గృహస్థాశ్రమానికి సంబంధించిన సమస్తస్మార్తకర్మలూ, అంటే పాకయజ్ఞాములు ఈ అగ్నితోనే చెయ్యబడతాయి.

## గృహ్యసూత్రాలు : శ్రౌతసూత్రాలు

ఇప్పటికీ గృహస్థు ఇంకా కొన్నికొన్ని యాగయజ్ఞాల్ని చేస్తున్నాడు. అసలే త్యజించలేదు. ఉపనయన వివాహాదిసంస్కారాల్లో యజ్ఞం, అంటే వైదికహోమం అవసరం. వృక్షప్రతిష్ఠ, జలాశయప్రతిష్ఠ, వృషోత్సర్గమూ మొదలైన పూర్తకర్మల్లో కూడా చెయ్యాలి. ఇవన్నీ గృహ్యకర్మ లనబడే స్మార్తానుష్ఠానాలు. గృహ్యసూత్రాల్ని అనుసరించి ఈ కర్మల్ని అనుష్ఠించాలి.

ఇవిగాక ఇంకో శ్రేణికి చెందిన వైదికకర్మలు ఉన్నాయి. అవి అగ్నిహోత్రము, అగ్నిష్టోమము, అశ్వమేధము, రాజసూయము అనబడే శ్రౌతకర్మలు. శ్రౌతసూత్రాల్ని అనుసరించి ఈ క్రియల్ని నిర్వర్తించాలి.

## బౌద్ధ - విప్లవం

మన సమాజంలో ఇంకా స్మార్తకర్మలు ఎల్లాగో నిలిచి ఉన్నాయికాని శ్రౌతకర్మలు నామమాత్రావశిష్ట మయ్యాయి. దీని కారణం బౌద్ధధర్మ ప్రచారం. బౌద్ధవిప్లవసమయంలో గొప్పవాళ్ళయిన క్షత్రియవైశ్యులందరూ ప్రాయికంగా ఈ కర్మల్ని విడిచిపెట్టటమో, లేక వాటిమీద ఇంతవరకూ వారికి గల శ్రద్ధావిశ్వాసాలికి తిలాంజల్ని అర్పించటమో జరిగింది. చాలామంది ఉపనయనానంతరం గురుగృహానికి వెళ్లడం మానేశారు.

ఈ విప్లవంతో యాజకవ్యాపారి అయిన బ్రాహ్మడి ఉద్యోగం కాస్తా చటుక్కున ఊడి ఊరుకుంది. చాలామంది బ్రాహ్మలు ధనికుల ఇళ్లల్లో యాజకత్వం-పౌరోహిత్యం చేసి అన్నవస్త్రాల్ని సంపాదించుకొనేవాళ్ళు. బుద్ధుడి ధర్మమా అంటూ ఆ రెండూ వాళ్లకు దక్కకుండా పోయాయి. బోడిగుండు సన్యాసులు గద్దల్లాగా వాటిని తన్నుకోపోయారు. ఇంక బ్రామ్మ డేం చేస్తాడు? దీర్ఘకాలం గురుగృహవాసం చేసి కర్మకాండను అభ్యసించాల్సిన అవసరం లేకపోయింది. బహుకాలం బ్రహ్మచర్యాన్ని అవలంబించాల్సిన ఆచారం తుడుచుకోపోయింది. ఉపనయన సమావర్తనాలు నామమాత్రావశిష్టాలయ్యాయి. ఇది బుద్ధుడు చేసిపెట్టిన పని. ఇంక, అభిజ్ఞులైన యాజకు లేకపోవటంవల్లనూ ఈ శ్రౌతకర్మలన్నీ విలోపించాయి, అదృశ్యమైపోయాయి.

కాని యుగాలబట్టీ తన్ను ఆశ్రయించుకొనిఉన్న వాదాన్ని, పాపం, వైదిక బ్రాహ్మణుడు సంపూర్ణంగా

---

14. విహితస్య అననుష్ఠానాత్
నిందితస్య చ సేవనాత్,
అనిగ్రహాచ్చ ఇంద్రియాణాం
నరః పతన మృచ్ఛతి.
—యాజ్ఞవల్క్య స్మృ. 3-౨౧౮.

వదిలిపెట్టలేకపోయాడు. శ్రౌతయజ్ఞాల్ని నిలపలేకపోయినా, మళందకాదిస్మార్త (గృహ్య) యాగాల్ని ఇంకా ఆచరిస్తున్నాడు. గృహ్యాగ్నితోనే వీటిని నిర్వర్తించాలి. గృహ్యసూత్రాల్లో చెప్పబడిన కర్మలే ఇవి.

## అగ్న్యాధానం

యజ్ఞానుష్ఠానంయొక్క తాత్పర్యం తెలిసికోవాలంటే శ్రౌతాగ్నిలో వేల్వబడే శ్రౌతయజ్ఞాల్ని గురించి మననం చెయ్యాలి. శ్రౌతాగ్నికి ప్రాచీన వైదికసమాజగార్హస్థ్యజీవనంలో అత్యంత ప్రాముఖ్యం ఉంది. ఈ అగ్ని లేకపోతే గృహస్థే కాడు. వివాహితుడే ఈ అగ్నిని స్థాపించాలి. పెళ్ళికి తర్వాతనేస్తు, గృహపతి అవుతాడు. ఇంట్లో వీలైనచోట అగ్నిశాల ఉండేది. ఇందులో సపత్నీకంగా గృహపతి యథావిధిగా శ్రౌతాగ్నిని స్థాపించుకొంటాడు. ఈ అగ్నిప్రతిష్ఠాకర్మే అగ్న్యాధానం, లేక అగ్న్యాధేయం. దీన్ని అమావాస్యనాడు చెయ్యాలని కాత్యాయనుడు.

## అగ్నికుండాలు : జ్యామెట్రీ

గార్హపత్యం, ఆహవనీయం, దక్షిణాగ్ని అనేవి మూడున్నూ శ్రౌతాగ్నులు. అగ్నిశాలలో చతుష్కోణయుక్తమైన వేదిక నొకదాన్ని తయారుచేసి, దానికి మూడువైపులా ఈ మూడు అగ్నుల్నీ నిలపాలి. ఈ మూడింటికీ క్రమంగా స్థానం పశ్చిమపూర్వదక్షిణాలు. మట్టితో ఎత్తుగా చేసి అగ్నిస్థానం నిర్మితమవుతుంది. గార్హపత్యం ఉండేచోటు చతుష్కోణాకారం. ఆహవనీయస్థానం వృత్తాకారం. దక్షిణాగ్నిని నిల్పేది అర్ధవృత్తాకారమైన చోట్లో. మూడింటి వైశాల్యమూ సమానంగా ఉండాలి. ఒక మూర పొడుగూ, ఒక మూర వెడల్పూ కలిగి, క్షేత్రఫలం సమానంగా ఉండాలి. ఈ వేదినిర్మాణకౌశల్యంకోసమే గణితశాస్త్రశాఖ యైన జ్యామెట్రీని ఆవిష్కరించుకొన్నారు ప్రాచీనార్యులు.

## మూడగ్నులు

గార్హపత్యాగ్ని గృహపతికి ప్రతినిధి. ఆహవనీయం దేవతల అగ్ని. ఇందులో దేవతలకు ఉద్దేశింపబడ్డ ఆహుతులు వేల్చబడుతాయి. ఆహుతులు పెయ్యబడతాయి కాబట్టే ఆహవనీయం. దేవతల నివాసం పూర్వదిక్కు. ఈ దిక్కుకు అధిపతి దేవరాజైన ఇంద్రుడు. ఇప్పటికీ మనం పూజను తూర్పుదిక్కుగా కూర్చునే చేస్తాం. ఏం చెయ్యలేకపోతే 'తూర్పు దిక్కుగా తిరిగి దణ్ణంపెట్టు'మనే సామెత మనకు ఉండనే ఉంది. కనుకనే ఆహవనీయస్థానం పూర్వదిక్కు అయింది. దక్షిణదిక్కు పితృదేవతలకు. పితృలకు అధిపతి అయిన యముడు దక్షిణానికి రాజు. దక్షిణాగ్నిలో పితృదేవతల నుద్దేశించి ద్రవ్యం విసర్జింపబడుతుంది. గార్హపత్యాగ్నితో స్మార్తకర్మల నిర్వహణ అని పైనే చెప్పాంకదా!

## స్థాపించే విధానము

శేషు అగ్న్యాధానకర్మ అనగా ఇవ్వాళ గృహస్థు శరీరశుద్ధినిమిత్తం ప్రాయశ్చిత్తాన్నీ, వృద్ధిశ్రాద్ధాదిమాంగళికకార్యాన్నీ నిర్వర్తించి, యజమాన కర్మకోసం సిద్ధంగా ఉండాలి. అధ్వర్యుడు నిర్దిష్టస్థానంనుండి అగ్నిని తీసికొనివచ్చి, గార్హపత్యాగ్నిస్థానంలో ఉంచుతాడు. సంధ్యాసమయంలో గృహస్థు పత్నీసహితంగా అగ్న్యాగారంలో ప్రవేశించి రాత్రంతా అక్కడే గడుపుతాడు.

## అరణులు

ఒక కాలంలో రెండు కాష్ఠాల్ని మథించి నిప్పు రాజేసేవారు. యజ్ఞకర్మలో ఈ ప్రాచీనప్రథ ననుసరించాలి. దీన్నే సంస్కృతిశేషం (Survival in Culture) అంటారు పురాతత్త్వవిదులు. సామాజిక అనుష్ఠానాల్లోనూ, ముఖ్యంగా మతకర్మల్ని ఆచరించేటప్పుడున్నూ, ప్రపంచంలో ఏ దేశస్థులైనా సరే, ప్రాచీనాచారాల్ని త్యజించలేకపోయారు. 'పురాణమే అనవద్యం.' శమీవృక్షాన్ని ఆశ్రయించుకొని ఉన్న అశ్వత్థవృక్షంయొక్క కాష్ఠాల్ని రాపాడితే సహజంగానే నిప్పు పుట్టుతుంది. ఈ కాష్ఠంతోనే రెండు అరణులు తయారుచెయ్యబడుతాయి. ఆ రాత్రికి వాటిని అగ్నిశాలలోనే ఉంచుతారు.

ఇప్పటి కింకా మనలో శమీపూజ, అశ్వత్థప్రద క్షిణాలు అనే ఆచారాలు నిల్చి ఉన్నాయి. వీటికి మూలం ఇదేమో ? అనే సంగతిని పండితులు ఆలోచించి చూడాలి.

## మంథానకర్మ

భద్రపరచబడిన అగ్నిలో సమిత్తుండాల్ని వేస్తూ, అది కాస్తా కొండెక్కిపోకుండా ఉండేటట్టు చూడాలి. ఈ చూడటం యజమానుడి పని. ప్రాతఃకాలం కాగానే అధ్వర్యుడు దాన్ని ఆర్పేస్తాడు. సూర్యోదయానికి పూర్వమే అరణుల్ని రాపాడి అగ్నిని పుట్టించాలి. ఈ కర్మపేరు అగ్నిమంథనం. ఈ కర్మకు ఆరంభంలోనే ఒక గుఱ్ఱాన్ని తెచ్చి ఉంచుకోవాలి. యజమాని చేత్తో ఒక అరణిని పట్టుకొని కూర్చుంటాడు. రెండో అరణివల్ల మొదట అతని పత్నీ, తర్వాత అధ్వర్యుడున్నూ అగ్నిని పుట్టిస్తారు. మట్టి మూకుడ్లో పిడకల్ని పెట్టి, దాంట్లోకి ఈ ఉత్పన్నాగ్నిని పరిగ్రహించాలి. యజమానుడు ఊది, దాన్ని ప్రజ్వలింపజేస్తాడు. అధ్వర్యుడు ఈ నిప్పుతో యజ్ఞ కాష్ఠాల్ని అంటించి, వాటిని గార్హపత్యాగ్ని స్థానంలో ఉంచుతాడు. బ్రహ్మ ఈ సమయంలో సామగానం చేస్తాడు. గార్హపత్యాగ్నిని తీసికొని, అధ్వర్యుడు ఆహవనీయాగ్ని స్థానంవైపుకు నడుస్తాడు. గుఱ్ఱం ముందుగా నడుస్తూఉంటుంది. యజమానుడు దాన్ని అనుసరిస్తాడు. బ్రహ్మ సామగానం చేస్తూనే ఉంటాడు. గుఱ్ఱం ఆహవనీయస్థానంలో ఒక కాలు పెట్టి పశ్చిమ ముఖంగా నిలుస్తుంది. గుఱ్ఱంపాదానికి ఆ అగ్నిని ముట్టించి, దాన్ని ఆహవనీయస్థానంలో ఉంచుతాడు అధ్వర్యుడు. బ్రహ్మ అప్పుడు మళ్ళీ సామగానం చేస్తాడు. దీంతో గార్హపత్య - ఆహవనీయాగ్ని స్థాపన అయిపోయింది. అప్పుడు అధ్వర్యుడు గార్హపత్యస్థానం నుండి అగ్నిని తీసికొని, దక్షిణాగ్ని స్థానంలో ఉంచుతాడు. ఇల్లా మూడు అగ్నులూ స్థాపింపబడ్డతర్వాత, బ్రహ్మ మూడుసార్లుగా మూడు సామాల్ని గానం చేస్తాడు. తర్వాత అందరూ అగ్నికి ప్రదక్షిణంచేసి, గుఱ్ఱాన్ని వదిలిపెడ్తారు. తర్వాత పూర్ణాహుతిహోమం. కొంచెంగా ఘృతాన్ని గార్హపత్యాగ్నితో వేడి చేస్తారు. అధ్వర్యుడు జుహూ వనబడే కఱ్ఱగరిటెతో ఆ నేతిని గ్రహించి, ఆహవనీయాగ్నికి పక్కగా కూర్చొని యజుర్మంత్రాల్ని పఠిస్తూ, ఆ అగ్నిలోనే ఆహుతులు వేస్తాడు. యజమాని అతన్ని ముట్టుకొని కూర్చుంటాడు. ఇదే పూర్ణాహుతి. దీంతో అగ్న్యాధానకర్మ ముగిసింది.

ఈ అగ్న్యాధానకర్మానంతరం యజమానుడు కొన్నిరోజులు బ్రహ్మచర్యనియమాల్ని పాలించాలి. గార్హపత్యాగ్ని రాత్రింబగళ్లూ వెలుగుతూనేఉంటుంది. అది ఆరిపోకూడదు; ఆరిపోతే ప్రత్యవాయం. ఆహవనీయ దక్షిణాగ్నులకు ఈ నియమం వర్తిల్లదు. అవసరాన్నిబట్టి గార్హపత్యాగ్నినుండి నిప్పును తీసికొని, వీట్ని ఏర్పరిచి దేవతలకుగాని, పితృదేవతలకుగాని ఆహుతుల్ని అర్పించవచ్చు.

## ఆహితాగ్ని

ఈ అగ్న్యాధానం యజమానిజీవితంలో ప్రధాన కర్మ. ఈ కర్మానంతరం అతడు ఆహితాగ్ని అనబడతాడు. ఆహితాగ్నిగృహస్థు పరిపూర్ణగృహస్థు. ఇతడే శ్రౌతకర్మల్ని అన్నిట్నీ ఆచరించటానికి అర్హుడు. దేవతలూ, పితృదేవతలూ అంతర్హితులుగా ఉండి మర్త్యజీవనాన్ని నియమిస్తూ, శుభాశుభఫలాల్ని అనుగ్రహిస్తున్నారు. దేవతలు హవ్యభోజనాన్నీ, పితృగణము స్వధాభోజనాన్నీ ఆకాంక్షిస్తూఉంటారు. ఈ ఇద్దరికీ మానవుడు ఋణి. ఈ ఋణవిముక్తి కాకపోతే, మానవజీవితం అసమగ్రంగానే ఉండిపోతుంది. జీవన సంపూర్ణతకోసం వీళ్ళిద్దర్నీ తృప్తిని చెయ్యాలి. కనుక, గృహస్థు ఆహితాగ్ని అయితీరాలి. అగ్ని ద్వారానే దేవతలకూ, పితృదేవతలకూఆహుతులు అందించబడతాయి. అగ్ని స్వయంగా తానే ఒకదేవత అవటమే కాకుండా, దేవతలకు పురోహితుడుకూడాను. హోత దేవతల్ని యజ్ఞభూమికి పిల్చుకొనవస్తాడు15. ఈయన దేవతలపు ముఖంకూడాను. ఈయనద్వారా

---

15. అగ్నిమీళే పురోహితం, యజ్ఞస్య దేవం ఋత్విజం, హోతారం రత్నధాతమమ్.
—మొదటి ఋక్కు.

హవ్యాల్ని వేస్తే, దేవతలకు అర్పించినట్టే. అందుకనే ఈయన హవ్యవాహనుడుకూడాను. గార్హపత్యాగ్ని దేవతేకూ, గృహపతికీ మధ్యవర్తి, గృహస్థాలికి కర్త, శుభాశుభఫలప్రదాత. కనుక, గార్హపత్యాగ్నిని యత్నపూర్వకంగా రక్షించుకోవాలి.

## అగ్నిమాహాత్మ్యం : పురాతత్త్వవేత్తలు

పురాతత్త్వవేత్తలు ఈ అగ్నిమాహాత్మ్యప్రఖ్యాపన కేవలం వైదికార్యులే కాదు, అన్నిదేశాల్లోనూ, అన్ని సమాజాల్లోనూ ఒకప్పుడు ఉండేది అనవచ్చు. కాని, అగ్నిద్వారానే దేవతలు ఖాద్యాన్ని గ్రహిస్తారని అనుమానించటానికి తగిన కారణాలు ఉన్నాయి. దేవతలు సూక్ష్మశరీరధారులు కాబట్టి స్థూలాన్నాన్ని గ్రహించలేరు. అగ్నిజ్యోతిలో వేసిన ఏ పదార్థమైనా ధూమబాష్పవాయురూపాల్ని పొందుతుంది. ఈ ఆకారంలో సూక్ష్మశరీరధారులైన దేవతలకు అది పనికివస్తుంది. దేవతలు ఊర్ధ్వలోకవాసులు, అగ్నికో, మరి ఊర్ధ్వజ్వలనస్వభావం ఉందాయె. కనుక, అది ఈ రూపంలో దేవతలకు వారి ఖాద్యాన్ని అందజేస్తుంది అంటం భావ్యమే !

## ఇతరత్ర అగ్నిపూజ

ఆర్యులు ఎంతిగానో అగ్నిమాహాత్మ్యాన్ని విశ్వసించేవారు. పురాతత్త్వవేత్తలు మళ్ళీ "అల్లా కాక మరేమవుతుంది, ఆర్యులు శీతప్రధానమైన దేశంలో ఉండేవాళ్ళుకదా" అని అంటారు. మరికొందరు ఈ అగ్నిమహిమాప్రఖ్యాపన ఆర్యులు ఆదిలో సుమేరు ప్రదేశవాసు లనే విషయాన్నే సమర్థిస్తోంది అంటారు. ఆరు నెలలు రాత్రి అయినప్పుడు ఇరవయినాల్గుగంటలూ అగ్నిజ్వలనం చేసే విధి, అగ్నికి సమాదరం ఉంటటం ఆశ్చర్యమేమి ?

## కాస్పియన్ తీరం

కాస్పియన్ సముద్రతీరాన్న కిరసనాయిలు ఊటలు ఉన్నాయి. భూగర్భంలోంచి సర్వదా కిరసన్ ఆవిరీ, మంటలూ వస్తూంటాయి. అక్కడ వాళ్ళకి అగ్నిపూజ సహజమే, ఇప్పటికీ అక్కడ అగ్ని దేవాలయాలు కనపడ్తాయి. ఆర్యులు ఒకప్పుడు మధ్యఆసియాలో ఉండేవాళ్ళు అనే పక్షంవారికి ఈ అనుమితి సంతోషకరం.

## గ్రీకులు : రోమనులు

గ్రీకులూ, రోమన్లూ మనకు జ్ఞాతివరుస. అగ్నిపూజ వాళ్ళలోనూ ఉండేది. ప్రాచీనగ్రీకుల అగ్నిదేవతపేరు హెస్టియా (Hestia). ప్రతిగ్రీకు గృహస్థు ఇంట్లోనూ అగ్నిశాల ఉండేది. అక్కడ అగ్ని రక్షితమై, పూజింపబడేది. వీళ్ళు స్వదేశాన్ని విడిచి పరదేశంలో ఉనికిమనుకులు ఏర్పరుచుకొన్నప్పుడు, గృహస్థితమైన ఈ అగ్నినికూడా తీసికొనివెళ్ళేవారు. ఈ రీతిగా మాతృదేశంతో సంబంధం నిల్చేది. రోమన్ల అగ్నిదేవతపేరు వెస్టా (Vesta). ఈ దేవత రోమ్ నగరానికీ, రాష్ట్రానికీ రక్ష. అందరికీ అందుబాటులో ఉండే స్థలంలో పూజ జరిగేది. ఈ అగ్నిని రక్షించటానికి కొందరు కన్యలు నియమింపబడేవారు. వీళ్ళు బ్రహ్మచారిణులు. కొన్ని ప్రత్యేకాధికారాలు వీళ్లకు హక్కుభుక్తం. అందరూ విశేషమైన మన్నన చూపేవాళ్ళు.

## పారసీకులు

పారసీకదేశస్థులైన ఇరానీవాళ్లకుకూడా అగ్నిపూజ ఉంది. ప్రాచీనఇరానీసమాజానికీ, వైదికసమాజానికీ అట్టే భేదం లేదు. వాళ్లకీ మనకుమల్లేనే యజ్ఞానుష్ఠానం ఉంది. జపానువాళ్లుకూడా అగ్నిపూజాపరులే.

## అశ్వము : సూర్యుడు

అగ్న్యాధానకర్మకు గుఱ్ఱం ఒకటి కావాలి అని పైన చెప్పాం. ఈ గుఱ్ఱం ఎందుకో చెప్పటం కష్టం. పురాతత్త్వవేత్తలు ఏమంటారో నాకు తెలీదు. ప్రాచీనఆర్యులకీ, గుఱ్ఱానికీ సన్నికటమైన సంబంధముందని పండితు లంటారు. ఆర్యులే మొదట అడవిలోని గుఱ్ఱాల్ని పట్టుకొని గృహోపయోగకరాలుగా చేశారు. మధ్యఏషియాలోని కాస్పియన్ సముద్రతీరాన్న, ఆరాల్సముద్రతీరాన్న ఉన్న (Steppes)

ఇప్పటికింకా మనలో శమీపూజ, అశ్వత్థప్రదక్షిణాలు అనే ఆచారాలు నిల్చి ఉన్నాయి. వీటికి మూలం ఇదేమో ? అనే సంగతిని పండితులు ఆలోచించి చూడాలి.

## మం థా న క ర్మ

భద్రపరచబడిన అగ్నిలో సమిత్ఖండాల్ని వేస్తూ, అది కాస్తా కొండెక్కిపోకుండా ఉండేటట్టు చూడాలి. ఈ చూడటం యజమానుడి పని. ప్రాతఃకాలం కాగానే అధ్వర్యుడు దాన్ని ఆర్పేస్తాడు. సూర్యోదయానికి పూర్వమే అరణుల్ని రాపాడి అగ్నిని పుట్టించాలి. ఈ కర్మపేరు అగ్నిమంథనం. ఈ కర్మకు ఆరంభంలోనే ఒక గుఱ్ఱాన్ని తెచ్చి ఉంచుకోవాలి. యజమాని చేత్తో ఒక అరణిని పట్టుకొని కూర్చుంటాడు. రెండో అరణివల్ల మొదట అతని పత్నీ, తర్వాత అధ్వర్యుడున్నూ అగ్నిని పుట్టిస్తారు. మట్టిమూకుడ్లో పిడకల్ని పెట్టి, దాంట్లోకి ఈ ఉత్పన్నాగ్నిని పరిగ్రహించాలి. యజమానుడు ఊది, దాన్ని ప్రజ్వలింపజేస్తాడు. అధ్వర్యుడు ఈ నిప్పుతో యజ్ఞకాష్ఠాల్ని అంటించి, వాట్ని గార్హపత్యాగ్నిస్థానంలో ఉంచుతాడు. బ్రహ్మ ఈ సమయంలో సామగానం చేస్తాడు. గార్హపత్యాగ్నిని తీసికొని, అధ్వర్యుడు ఆహవనీయాగ్నిస్థానంవైపుకు నడుస్తాడు. గుఱ్ఱం ముందుగా నడుస్తూ ఉంటుంది. యజమానుడు దాన్ని అనుసరిస్తాడు. బ్రహ్మ సామగానం చేస్తూనే ఉంటాడు. గుఱ్ఱం ఆహవనీయస్థానంలో ఒక కాలు పెట్టి పశ్చిమముఖంగా నిలుస్తుంది. గుఱ్ఱంపాదానికి ఆ అగ్నిని ముట్టించి, దాన్ని ఆహవనీయస్థానంలో ఉంచుతాడు అధ్వర్యుడు. బ్రహ్మ అప్పుడు మళ్ళీ సామగానం చేస్తాడు. దీంతో గార్హపత్య - ఆహవనీయాగ్నిస్థాపన అయిపోయింది. అప్పుడు అధ్వర్యుడు గార్హపత్యస్థానం నుండి అగ్నిని తీసికొని, దక్షిణాగ్నిస్థానంలో ఉంచుతాడు. ఇల్లా మూడు అగ్నులూ స్థాపింపబడ్డతర్వాత, బ్రహ్మ మూడుసార్లుగా మూడు సామాల్ని గానం చేస్తాడు. తర్వాత అందరూ అగ్నికి ప్రదక్షిణంచేసి, గుఱ్ఱాన్ని వదిలిపెడ్తారు. తర్వాత పూర్ణాహుతిహోమం. కొంచెంగా ఘృతాన్ని గార్హపత్యాగ్నితో వేడి చేస్తారు. అధ్వర్యుడు జుహు అనబడే కఱ్ఱగరిటెలో ఆ నేతిని గ్రహించి, ఆహవనీయాగ్నికి పక్కగా కూర్చొని యజుర్మంత్రాల్ని పఠిస్తూ, ఆ అగ్నిలోనే ఆహుతులు వేస్తాడు. యజమాని అతన్ని ముట్టుకొని కూర్చుంటాడు. ఇదే పూర్ణాహుతి. దీంతో అగ్న్యాధానకర్మ ముగిసింది.

ఈ అగ్న్యాధానకర్మానంతరం యజమానుడు కొన్నిరోజులు బ్రహ్మచర్యనియమాల్ని పాలించాలి. గార్హపత్యాగ్ని రాత్రింబగళ్లూ వెలుగుతూనే ఉంటుంది. అది ఆరిపోకూడదు; ఆరిపోతే ప్రత్యవాయం. ఆహవనీయ దక్షిణాగ్నులకు ఈ నియమం వర్తిల్లదు. అవసరాన్నిబట్టి గార్హపత్యాగ్నినుండి నిప్పును తీసికొని, వీట్ని ఏర్పరిచి దేవతలకుగాని, పితృదేవతలకుగాని ఆహుతుల్ని అర్పించవచ్చు.

## ఆ హి తా గ్ని

ఈ అగ్న్యాధానం యజమానిజీవితంలో ప్రధాన కర్మ. ఈ కర్మానంతరం అతడు ఆహితాగ్ని అనబడతాడు. ఆహితాగ్నిగృహస్థు పరిపూర్ణగృహస్థు. ఇతడే శ్రౌతకర్మల్ని అన్నిట్నీ ఆచరించటానికి అర్హుడు. దేవతలూ, పితృదేవతలూ అంతర్హితులుగా ఉండి మర్త్యజీవనాన్ని నియమిస్తూ, శుభాశుభఫలాల్ని అనుగ్రహిస్తున్నారు. దేవతలు హవ్యభోజనాన్నీ, పితృగణము స్వధాభోజనాన్నీ ఆకాంక్షిస్తూఉంటారు. ఈ ఇద్దరికీ మానవుడు ఋణి. ఈ ఋణవిముక్తి కాకపోతే, మానవజీవితం అసమగ్రంగానే ఉండిపోతుంది. జీవనసంపూర్ణతకోసం వీళ్ళిద్దర్నీ తృప్తిని చెయ్యాలి. కనుక, గృహస్థు ఆహితాగ్ని అయితీరాలి. అగ్ని ద్వారానే దేవతలకూ, పితృదేవతలకూ ఆహుతులు అందించబడతాయి. అగ్ని స్వయంగా తానే ఒకదేవత అవటమే కాకుండా, దేవతలకు పురోహితుడుకూడాను. హోత దేవతల్ని యజ్ఞభూమికి పిల్చుకోవస్తాడు[15]. ఈయన దేవతలకు ముఖంకూడాను. ఈయనద్వారా

---

15. అగ్నిం ఈళే పురోహితం, యజ్ఞస్య దేవం ఋత్విజం, హోతారం రత్నధాతమమ్.
—మొదటి ఋక్కు.

హవ్యాల్ని వేస్తే, దేవతలకు అర్పించినట్టే. అందుకనే ఈయన హవ్యవాహనుడుకూడాను. గార్హపత్యాగ్ని దేవతలకూ, గృహపతికీ మధ్యవర్తి, గృహస్థాలికి కర్త, శుభాశుభఫలప్రదాత. కనుక, గార్హపత్యాగ్నిని యత్నపూర్వకంగా రక్షించుకోవాలి.

## అగ్నిమాహాత్మ్యం : పురాతత్త్వవేత్తలు

పురాతత్త్వవేత్తలు ఈ అగ్నిమాహాత్మ్యప్రఖ్యాపన కేవలం వైదికార్యులే కాదు, అన్నిదేశాల్లోనూ, అన్ని సమాజాల్లోనూ ఒకప్పుడు ఉండేది అనవచ్చు. కాని, అగ్నిద్వారానే దేవతలు ఖాద్యాన్ని గ్రహిస్తారని అనుమానించటానికి తగిన కారణాలు ఉన్నాయి. దేవతలు సూక్ష్మశరీరధారులు కాబట్టి స్థూలాన్నాన్ని గ్రహించలేరు. అగ్నిజ్యోతిలో వేసిన ఏ పదార్థమైనా ధూమబాష్పవాయురూపాల్ని పొందుతుంది. ఈ ఆకారంలో సూక్ష్మశరీరధారులైన దేవతలకు అది పనికివస్తుంది. దేవతలు ఊర్ధ్వలోకవాసులు, అగ్నికో, మరి ఊర్ధ్వజ్వలనస్వభావం ఉందాయె. కనుక, అది ఈ రూపంలో దేవతలకు వారి ఖాద్యాన్ని అందజేస్తుంది అంటం భావ్యమే !

## ఇతరత్ర అగ్నిపూజ

ఆర్యులు ఎంతగానో అగ్నిమాహాత్మ్యాన్ని విశ్వసించేవారు. పురాతత్త్వవేత్తలు మళ్ళీ "అల్లా కాక మరేమవుతుంది, [illegible] దేశంలో ఉండేవాళ్ళుకదా" అని [illegible] కొందరు ఈ అగ్నిమహిమాప్రఖ్యాపన ఆర్యులు ఆదిలో సుమేరు ప్రదేశవాసు లనే విషయాన్నే సమర్థిస్తోంది అంటారు. ఆరు నెలలు రాత్రి అయినప్పుడు ఇరవయినాల్గుగంటలూ అగ్నిజ్వలనం చేసే విధి, అగ్నికి సమాదరం ఉంటం ఆశ్చర్యమేమి ?

## కాస్పియన్ తీరం

కాస్పియన్ సముద్రతీరాన్న కిరసనాయిలు ఊటలు ఉన్నాయి. భూగర్భంలోంచి సర్వదా కిరసన్ ఆవిరీ, మంటలూ వస్తూంటాయి. అక్కడ వాళ్ళకి అగ్నిపూజ సహజమే. ఇప్పటికీ అక్కడ అగ్ని దేవాలయాలు కనపడ్తాయి. ఆర్యులు ఒకప్పుడు మధ్య ఆసియాలో ఉండేవాళ్ళు అనే పక్షంవారికి ఈ అనుమితి సంతోషకరం.

## గ్రీకులు : రోమనులు

గ్రీకులూ, రోమన్లూ మనకు జ్ఞాతివరుస. అగ్నిపూజ వాళ్ళలోనూ ఉండేది. ప్రాచీనగ్రీకుల అగ్నిదేవతపేరు హెస్టియా (Hestia). ప్రతిగ్రీకు గృహస్థు ఇంట్లోనూ అగ్నిశాల ఉండేది. అక్కడ అగ్ని రక్షితమై, పూజింపబడేది. వీళ్ళు స్వదేశాన్ని విడిచి పరదేశంలో ఉనికిమనుకులు ఏర్పరుచుకొన్నప్పుడు, గృహస్థితమైన ఈ అగ్నినికూడా తీసికొనివెళ్ళేవారు. ఈ రీతిగా మాతృదేశంతో సంబంధం నిల్చేది. రోమన్ల అగ్నిదేవతపేరు వెస్టా (Vesta). ఈ దేవత రోమ్ నగరానికీ, రాష్ట్రానికీ రక్ష. అందరికీ అందుబాటులో ఉండే స్థలంలో పూజ జరిగేది. ఈ అగ్నిని రక్షించటానికి కొందరు కన్యలు నియమింపబడేవారు. వీళ్ళు బ్రహ్మచారిణులు. కొన్ని ప్రత్యేకాధికారాలు వీళ్లకు హక్కుభుక్తం. అందరూ విశేషమైన మన్నన చూపేవాళ్ళు.

## పారసీకులు

పారసీకదేశస్థులైన ఇరానీవాళ్లకుకూడా అగ్నిపూజ ఉంది. ప్రాచీనఇరానీసమాజానికీ, వైదికసమాజానికీ అట్టే భేదం లేదు. వాళ్లకీ మనకుమల్లేనే యజ్ఞానుష్ఠానం ఉంది. జపానువాళ్లుకూడా అగ్నిపూజాపరులే.

## అశ్వము : సూర్యుడు

అగ్న్యాధానకర్మకు గుఱ్ఱం ఒకటి కావాలి అని పైన చెప్పాం. ఈ గుఱ్ఱం ఎందుకో చెప్పటం కష్టం. పురాతత్త్వవేత్తలు ఏమంటారో నాకు తెలీదు. ప్రాచీనఆర్యులకీ, గుఱ్ఱానికీ సన్నికటమైన సంబంధముందని పండితు లంటారు. ఆర్యులే మొదట అడవిలోని గుఱ్ఱాల్ని పట్టుకొని గృహోపయోగకరాలుగా చేశారు. మధ్యఏషియాలోని కాస్పియన్ సముద్రతీరాన్న, ఆరాల్ సముద్రతీరాన్న ఉన్న (Steppes)

భూముల్లోనూ గడ్డి జాస్తిగా మొలుస్తుంది. ఈ భూములు అశ్వపాలనకు తగ్గవి. ఆర్యులు అశ్వారోహులై దిగ్విజయయాత్రకు బయలుదేరారు. యూరప్ మొదలైన దేశాల్లోకి సుత్తాన్ని దిసుమతిచేసింది వాళ్లే. భారతదేశానికికూడా వాళ్లు సుత్తాన్నికేక్ల వచ్చానన్నకోటంలో ప్రమాదం లేదు. అందుకనే గార్హపత్యాధిశ సూచకమైన ప్రథమదినాన్న అశ్వాన్ని తీసికోరావటం అని మనం అనుమానించవచ్చు. ఫలతః, మిస్లేపోలాగా ఇదిన్ని సంస్కృతి శేషం అని మనం ఊహించుకోవచ్చు. పూర్వం ఏదో ఒక అర్థం నిశ్చయంగా ఉండేది. కాని తర్వాతివాళ్ళు మరిచిపోయారు.

ప్రాచీన వైదిక సాహిత్యంలో సూర్యుణ్ణీ, అశ్వాన్నీ సరిపోల్చిన చోట్లు చాలా ఉన్నాయి. మేక్డోనాల్డుదొర 'వేదిక్ - మిథాలజీ' అనే గ్రంథంలో అనేకదృష్టాంతాల్ని చూపాడు. సూర్యుడుకూడా ప్రాచీనవైదికసమాజంలో దేవతగా పరిగ్రహింపబడ్డాడు. ఆయన సప్తాశ్వసంయుక్తమైన రథాన్ని అధిరోహించి, దిగ్విజయానికి వీరపురుషుడులా ఆకాశవీథిలో పరిభ్రమిస్తున్నాడు. అంతేకాకుండా ఆయన్నే అశ్వంతో ఉపమించిన పట్లు ఉన్నాయి. మామగారైన త్వష్టతో సూర్యుడు ఒకసారి వివాదంలో పడ్డాడు. అప్పుడు జరిగిన కథే ఛాయా-సంజ్ఞోపాఖ్యానం. సూర్యుడు అప్పుడు అశ్వమూర్తి అయ్యాడు. యాజ్ఞవల్క్యఋషి తపస్సుకు మెచ్చి, ఆయనకు శుక్లయజుర్వేదాన్ని సూర్యుడు ప్రసాదించింది వాజిరూపంలోనే. అగ్న్యాధానకర్మలో గుఱ్ఱం మొదట తూర్పుగా నడుస్తుంది. తర్వాత ఆహవనీయస్థానానికి వెళ్లి పశ్చిమముఖంగా తిరిగి, అక్కడనుంచి తిరిగిపోతుంది. కనుక, ఇది సూర్యుడికి 'ప్రతీకం' అని మనం ఊహించుకోవచ్చు. అశ్వగమనం సూర్యోదయాస్తమయసూచకం కావచ్చు. దీన్నిగురించి పండితులు వివరంగా ఏమీ చెప్పినట్టు తోచదు.

## అగ్నిహోత్రం

అగ్న్యాధానానంతరం ఆహవనీయాగ్నితో ప్రతిరోజూ అగ్నిహోత్రయాగం చెయ్యాలి. ఈ యాగం నిత్యకర్మ. పొద్దునొకసారి, సాయంకాలం ఒకసారి ఆహుతుల్ని వెయ్యాలి. ప్రాతఃకాలాహుతి సూర్యుడికి, సాయంకాలాహుతి అగ్నికిన్నీ. అగ్నిహోత్రం అంటే ఇదే. సూర్యాగ్ను లిద్దరూ జ్యోతిస్స్వరూపులు. ఒకే దేవతయొక్క మూర్తిభేదాలు. అగ్ని ఉండేది పృథివీలోకంలో; సూర్యుడు ద్యులోకంలో. ఈ ఇద్దరికీ ఆహుతు లిస్తే మిగిలిన దేవతల నందర్నీ సంతృప్తిపరిచినట్టే. ఏమంటే, దేవతలు జ్యోతిఃస్వరూపులు. ఈ రీతిగా సూర్యాగ్నులకూ, తదితరదేవతలకూ సంబంధం కలిసింది.

### ఆహవనీయాహుతి:

### సాయంకాల విధి

ఆహితాగ్ని ప్రతిరోజూ సాయంప్రాతఃకాలాల్లో శ్రౌతాగ్నిలో అగ్నిహోత్రకర్మను చేస్తాడు. ఇది గృహస్థు స్వయంగా చెయ్యాలి. అశక్తుడైతే, ప్రతినిధి ద్వారా చేయించవచ్చు. పుత్ర, సోదర, సోదరీపుత్ర, జామాతాదులుగాని, అధ్వర్యుడుగాని ప్రతినిధి కావచ్చు. కాని, ప్రతినిధిద్వారా ఆహుతికార్యం సంపన్నమైతే స్వయంగా చేసినదానికంటే ఫలం కొంచెం తక్కువ. అగ్నిహోత్రకర్మనిమిత్తం ఆవు నొకదాన్ని పోషించాలి. ఇది అగ్నిహోత్రధేనువు. రెండు వేళలా ఒక మూకుల్లో దాని పాలు పితికి, గార్హపత్యాగ్నిలో కాచాలి. ఆహుతికోసమని ఉపకరించవలసినవి రెండు కావాలి. ఒకటి పెద్దది, రెండోదిచిన్నది. మొదటిది స్రువము. రెండోది అగ్నిహోత్రహవణి. మూకుల్లోంచి స్రువంతో నాల్గయిదుసార్లు తీసి, హవణిలో పొయ్యాలి, ఈ పాలనే అగ్నిలో ఆహుతిగా అర్పించాలి. గృహస్థు పత్నీసహితంగా అగ్నిహోత్రశాల్లో ప్రవేశించి, గార్హపత్యాగ్నికుండంలోంచి మండు నిప్పుల్ని తీసి, ఆహవనీయదక్షిణాగ్నుల్ని ముట్టిస్తాడు. తర్వాత, గార్హపత్యాగ్నితో పాలు కాచి, వాటిని యథావిధిగా స్రువంతో అగ్నిహోత్రహవణిలో పోస్తాడు. అప్పుడు ఆహవనీయాగ్నిలో సమిత్తు నొకదాన్ని వెయ్యాలి. అది మండగానే అగ్నిహోత్రహవణిలో ఉన్న పాలను అగ్నిలో రెండుమార్లు ఆహుతులుగా అర్పిస్తాడు.

ప్రథమాహుతి అగ్నికి. అర్పణమంత్రం—"భూ ర్భువః స్వః ఓం అగ్ని ర్జ్యోతిః జ్యోతి రగ్నిః స్వాహా". ద్వితీయాహుతి ప్రజాపతికి. ప్రజాపతిని ధ్యానించి వినా మంత్రకంగానే ఆహుతిని అర్పించాలి. పాలనన్నిట్నీ వెచ్చింపకూడదు. కొంచెం హవిఃశేషరూపంగా మిగల్చాలి. ఆహుతిదాత దాన్ని పుచ్చుకోవాలి.

## గార్హపత్య దక్షిణాగ్నులు

ఆహవనీయాహుతి కాగానే గార్హపత్యదక్షిణాగ్నుల్లో ఆహుతి. ఇక సూచనితో పని లేదు. స్రువంతో ముంతల్లోంచి పాలు తీసికొని అగ్నికి అర్పించాలి. గార్హపత్య ప్రథమాహుతి దేవత అగ్ని-గృహపతి. ద్వితీయాహుతి దేవత ప్రజాపతి.

దక్షిణాగ్ని ప్రథమాహుతిదేవత అగ్ని - అన్నపతి. ద్వితీయాహుతిదేవత ప్రజాపతి. ప్రతి ఆహుతిన్నీ జ్వాలగా నుండుతున్న సమిధలమీద చెయ్యాలి. ఆహుతిదానానంతరం హవిఃశేషాన్ని భక్షించి, ప్రతి అగ్నిలోనూ మూడేసి సమిధల్ను వేసి, అగ్ని-ఉపస్థానం అయినతర్వాతి గృహస్థు అగ్నిశాల్లోంచి బయటకు రావాలి. ఇది సాయంకాలాగ్నిహోత్రకృతి.

## ప్రాతః కాల విధి

ప్రాతఃకాలవిధికూడా ఇదే. కాని దేవత సూర్యుడు. ఆహుతిమంత్రం: "భూర్భువ స్వః ఓం సూర్యో జ్యోతిః జ్యోతిః సూర్యః స్వాహా." సంధ్యానుష్ఠానం సూర్యాస్తమయానంతరం. ప్రాతరనుష్ఠానాన్ని గురించి మతభేదం ఉంది. కొందరు సూర్యోదయానికి పూర్వమనిన్నీ, కొందరు అనంతరమనిన్నీ అంటారు. ఐతరేయబ్రాహ్మణం చాలా చర్చ అయిన పిమ్మట, సూర్యోదయానంతర మనే నిశ్చయించింది.

## నిత్య కర్మ

అగ్నిహోత్రకర్మ నిత్యకర్మ. నిత్యమూ చెయ్యాలి 16 అని పైనే చెప్పాం. గృహస్థు ఊళ్లో లేకపోతే, అతని ప్రతినిధి దాన్ని చెయ్యాలి. విపత్నీకుడు కూడా ఆచరించాలా అనే ప్రశ్న ఒకటి ఉంది. పత్ని చనిపోతే అగ్నిహోత్రం వినష్టమవుతుంది. ఐతరేయ బ్రాహ్మణం ఇచ్చిన సమాధానం: అతడు మళ్లీ పెళ్లి చేసుకోకపోతే, పుత్రపౌత్రదౌహిత్రుల్లో ఎవరికైనా అగ్నిహోత్రకర్మ చెయ్యటానికి అనుమతి ఇవ్వొచ్చు. విపత్నీకుడు అగ్నిహోత్రాహరణ చెయ్యొచ్చా అనే ప్రశ్నకు ఇంకోచోట ఐతరేయ బ్రాహ్మణం ఇల్లా అంటోంది: చెయ్యాలి. ఋణపరిహారార్థం యాగం చెయ్యా లని శ్రుతి. ఆ శ్రుతి—

"జాయమానో వై బ్రాహ్మణః త్రిభిః ఋణవాన్ జాయతే. బ్రహ్మచర్యేణ ఋషిభ్యో యజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్యః, ఏష వా అనృణో యః పుత్రీ యజ్వా బ్రహ్మచారీ."

—బ్రాహ్మణుడు మూడుఋణాల్తో పుట్టాడు. ఋషుల ఋణాన్ని బ్రహ్మచర్యం, అనగా వేదాధ్యయనంవల్లా, దేవతల ఋణాన్ని యజ్ఞంవల్లా, పితరుల ఋణాన్ని పుత్రోత్పాదనవల్లా తీర్చాలి. ఈ రీతిగా పుత్రుణ్ణి కన్నవాడు, యజ్ఞంచేసేవాడు, బ్రహ్మచారి అయినవాడు ఋణవిముక్తిని పొందుతాడు. కనుక, అగ్నిహోత్రయజ్ఞం దేవతల ఋణం తీర్చటానికి చాలా అవసరం.

## శ్రద్ధా హోమం

నిత్యకర్మ అయిన అగ్నిహోత్రం అందరికీ వీలుగా ఉండి, చాలా తక్కువసేపులోనే అయిపోయేటట్టు ఏర్పాటు చేయబడింది. అధికంగా వస్తువులుగాని, వ్యయంగాని అక్కర్లేదు. కొంచెం పాలు ఉంటేసరి. ఈ పాలు లేకపోతే కొంచెం పెరుగుగాని, బియ్యంగాని, మరేదైనా ద్రవ్యంగాని ఉంటే సరి. ఇవి దొరక్కపోతే, మానటానికి వీల్లేదు. "అహం శ్రద్ధాం జుహోమి" అనే మంత్రంతో "నేను శ్రద్ధాహుతి నిస్తున్నాను" అని సంకల్పించుకొని శ్రద్ధాహోమం చెయ్యాలి. ఇది మానసిక అగ్నిహోత్రం. ఐతరేయబ్రాహ్మణం "శ్రద్ధ యజమానపత్నీస్వరూపం, యజమానస్వరూపం సత్యం. శ్రద్ధాసత్యాలు మిథునభూత మయ్యాయి. మానసిక అగ్నిహోత్రంలో శ్రద్ధాసత్యాలనర్పించి, స్వర్గలోకాన్ని జయించవచ్చు" అంటోంది. ఈ హోమానికి ద్రవ్యంతోగాని, దక్షి

16. యావజ్జీవం అగ్నిహోత్రం జుహుయాత్.

ణాలతో గాని పని లేదు. దీనికి మనుష్యదేవతలతో గూడిన సమస్తజగత్తూ దక్షిణే. సంధ్యాసమయంలో యజమాని మనుష్యుల్ని దేవతలకు దక్షిణగా అర్పిస్తాడు. అప్పుడు మనుష్యులు నిష్క్రియులై దేవతల కధీన మవుతారు. ప్రాతఃకాలంలో యజమాని దేవతల్ని మనుష్యులకు దక్షిణగా అర్పిస్తాడు. అందువల్ల దేవతలు మనుష్యుల కధీనమై వాళ్లకి శుభాన్ని చేకూరుస్తారు. గీతకూడా దేవయజ్ఞం చెయ్యకుండా భుజించేవాణ్ణి దొంగ అంటోంది.

ఇంతుంది అగ్నిమాహాత్మ్యం. అగ్నిహోత్రశాలలోని అగ్ని నష్టంకాకుండా, అశుచి కాకుండా చూడాలి. అపవిత్రమైతే ప్రాయశ్చిత్తం ఉంది. మళ్లీ అగ్న్యాధానం చేసి అగ్నిని నిల్పాలి.

### అగ్నిపూజ : సమాజరక్ష

పురాతత్త్వవేత్తలు ఈ అగ్నిభక్తికి మూలం మనుష్యుడి ఆదిమ-అసభ్య సంస్కారమే. ఆకాలంలో సహజంగా అగ్నిని పుట్టించే ఉపాయాలు లేవు, కనక అగ్నిరక్షణ మతవిధి (Religious Duty) గా ఏర్పరిచారు. నిన్నమొన్నటిదాకా కుగ్రామాల్లో రాత్రంతా దాలిలో నిప్పు రాజేసిఉంచే ఆచారం ఉండేది అంటే ఆనొచ్చు. అగ్నిహోత్ర-అగ్న్యాధానాల మూలం ఇది అవుతే కావచ్చు. మనం లజ్జగాని, దుఃఖం గాని పొందాల్సిన అవసరం లేదు. కోతిలోంచి మనుష్యుడు వచ్చాడంటే మనం సిగ్గుపడటం లేదు; దుఃఖించటం లేదు. కదా! కాని, మనం వైదికసమాజంయొక్క ఏ దశనుగురించి ఆలోచిస్తున్నామో, ఆ దశలో వైదికుల్ని అసభ్యు లంటానికి వీల్లేదు. అప్పుడు, మూలంలో ఈ కర్మకు తాత్పర్యం ఏమైనా, వాళ్లు కల్పించుకొని చెప్పుకొన్న అర్థమే తత్కాలగార్హస్థ్యసామాజికజీవనాల్ని నియంత్రించేది.

ఈ అర్థమేమిటో పైనే చెప్పాం. గృహపతాగ్ని గృహపాలికి ప్రతీకం; యజమానస్వరూపి17. ఈ అగ్నిని ఆశ్రయించుకొనే గృహం. యజమానుడికీ, దేవపితృగణానికీ సంధాత ఈ అగ్ని. యజమానస్వరూపి అయిన గార్హపత్యంనుండే ఆహవనీయ దక్షిణాగ్నులు వెలిగింపబడతాయి. ఆహవనీయాగ్ని దేవతలకున్నూ, దక్షిణాగ్ని పితృదేవతలకున్నూ ముఖం. ఈ ముఖంగానే వాళ్లు గృహస్థునుండి తమ ప్రాప్యాన్ని పొంది, అతనికి శుభాన్ని చేకూరుస్తారు.

వైదికులకు సమాజం అంటే కొన్ని గృహాల సమష్టి. గృహమే సమాజానికి 'యూనిట్.' గృహస్థు ఆ గృహానికి తాత్కాలికరక్షాకర్త (Trustee) మాత్రమే. ఏమంటే, ఐహికజీవనం మూణ్ణాళ్ల ముచ్చట. ఆయన తనున్నన్నినాళ్లూ తన కర్తవ్యాన్ని నిర్వహించి, పుత్రపౌత్రులకు భారాన్ని అప్పగించి వెళ్తాడు. కాని, గృహం స్థిరంగా ఉంటుంది. పితృపితామహుల్నించి దాన్ని ఆయన పొందాడు; పుత్రపౌత్రులకు ఆ అధికారాన్ని అప్పగించివెళ్తాడు. ఆ ధనసంపత్తిని నష్టం చెయ్యటానికి వీల్లేదు. ఏమంటే, అతడు రక్షాకర్త మటుకే. పైతృకసంపత్తిని తాను అనుభవిస్తూఉండటం వల్లే పితృపితామహప్రపితామహులకు ఆయన పిండదానం చేస్తూ తానుకూడా పుత్రపౌత్రప్రపౌత్రుల్నించి పిండాల్ని అభిలషిస్తాడు. దక్షిణాగ్నితో పిండపితృయజ్ఞం అనుష్ఠిత మవుతుంది. ఈరీతిగా ఈ అగ్ని సాహాయ్యంవల్ల గృహంయొక్క ధార అవిచ్ఛిన్నంగా రక్షింపబడుతుంది.

కనుక, ఈ అగ్నిహోత్రానుష్ఠానాన్ని కేవలం వ్యక్తిగతానుష్ఠానంగా పరిగణించటానికి వీల్లేదు. విశదంగా ఆలోచించి చూస్తే దీని పరిచ్ఛిన్నరూపం ప్రజ్వలితమై సమాజాన్నంతటినీ ఆకట్టేదిగా కనిపిస్తుంది. ఈ అగ్నివల్లనే గృహస్థుకు సమాజంతో సంబంధం కలుగుతోంది. అగ్నిరక్షకుడు కాబట్టే ధనసంపదలకు అధికారి. ఇతరసామాజికులతో సంబంధం. సమాజంలోని అన్యులు అతని సాహాయ్యం ఇచ్చి పుచ్చుకుంటారు. ఈ రీతిగా గృహపతికి రాష్ట్రంతో సంబంధం కలుస్తోంది. కనుకనే, అగ్నిహోత్రానుష్ఠానం గార్హస్థ్యజీవనంలో ప్రధానానుష్ఠానం—నిత్యకర్మ.

నిత్యకర్మ - నియమభంగం అవుతుందని భయపడుతున్న ప్రవరాఖ్యుడిచే ఆంధ్రకవితాపితామహుడు మనుచరిత్ర ద్వితీయాశ్వాసాంతంలో చేయించిన అగ్నిప్రార్థన ఇక్కడ అనుసంధేయం.

---

17. అయ మగ్ని ర్గృహపతి ర్గార్హపత్యః.
—శుక్ల యజుస్సు.

# భౌతికశృంఖలలు

[కథానిక]



## శ్రీ నిష్ఠల సోమయాజులు

గోడగడియారం తొమ్మిది కొట్టింది. బల్లమీదనున్న కాగితాలు తొందరగా సర్దడం మొదలుపెట్టేను. ఆరోజు ఆదివారం అన్న మాటకూడా మరచిపోయి కేసుకాగితాలు తిరగవేస్తూ ఉండడంమూలాన కాలం ఎంత గడిచిందీకూడా నాకు తెలియలేదు. గడియారం తొమ్మిది కొట్టేసరికి యింకా లాయర్ ఛేంబర్స్‌లోనే ఉన్న మాట జ్ఞప్తికి వచ్చింది. కేశవచంద్రులు వచ్చే టైము అయింది. ఆయన ఆవేళ నాతో పనిచెయ్యక్కర్లేదనే చెప్పేరు. కాని నేను మాత్రం తొందరగా ముగిద్దామనే కూర్చున్నాను. నేననుకున్నట్లవుతుందా మరి! వెంటనే కాగితాలు సర్దడం ప్రారంభించేను. ఆ మర్నాటి కేసుతాలూకు కాగితాలన్నీ కట్టకట్టి డ్రాయర్‌లో పెట్టి తాళం వేసేను. వంకికి తగిలించిన కోటు తీసి భుజంమీద పడవేసుకుని పెద్దహాల్లోకి వచ్చేను.

కేశవచంద్రవిద్యాసాగరులు ఆ హైకోర్టులో పబ్లిక్ ప్రాసిక్యూటరుగా ఉన్నారు. అఖండమేధావి. ఆయనంటే అందరికీ భయమూ, గౌరవమూ. ఆయనదగ్గర జూనియరుగా నేను పనిచేస్తున్నాను. ఇది ఒక మహాయోగం అనే చెప్పొచ్చు. ఆయన ఎప్పుడూ జూనియర్లను తీసుకొనేవాడు కాడు. అందుచేత ఆయనదగ్గర జూనియరుగా చేరడం ఒక మహాగౌరవం అన్నమాట. నే చేరినప్పటినుండీకూడా ఆయన నన్ను పుత్రవాత్సల్యంతోటే చూస్తూవచ్చేరు. ఇప్పటికి నేను ఆయనదగ్గర ప్రవేశించి పది వత్సరాలు కావచ్చింది.

ఆరోజు ఆదివారంనాడు ఆయన నన్ను సెలవుతీసుకోమని చెప్పి పైకి వెళ్ళిపోయేరు. కాని ఆమర్నాడు ఉండే కేసుతొందరవల్ల ఆదివారంకూడా పనిచెయ్యవలసివచ్చింది.

నేను హాల్లోకి వచ్చేసరికి హాలంతా చీకటిగా ఉంది. కోపం వచ్చి 'రఘూ', 'రఘూ' అని కేకవేస్తే ఎవరూ పలకలేదు. తోటమాలి రఘూ ఎక్కడికో పోయి ఉంటాడని హాల్లో లైటు వేసేను. గార్డెన్‌వైపు ద్వారందగ్గర ఏదో అలికిడైంది. ఏమి చెప్మా అని దగ్గరగా వెళ్లేను. "కేశవచంద్రులు లేరా?" అన్న ప్రశ్న ఒక స్త్రీకంఠంనుండి వచ్చినట్టయింది.

"ఎవరు మీరు?" అన్నాను. ఆమె తిరిగి ఆ ప్రశ్నే వేసింది. నాకు ఆశ్చర్యం వేసింది ఆమెను నే నచ్చట చూచేసరికి. చాలా దీనంగా ఉంది ఆమెముఖం. ఏదో ఆపత్కాలంలో ఉండి దారిద్ర్యంచే కుమిలిపోతున్న జీవిలా కనిపించింది. కాని ఆమెముఖం ప్రశాంతంగానే కనిపించింది. జీర్ణమైన వస్త్రాలు లేమిని తెలియచేస్తున్నా ఆమెముఖంలో ఒకవిధమైన గంభీరత్వం కనిపిస్తూంది. జవాబు ఏమి చెప్పాలో నాకు తెలిసిందికాదు. ఇంతకాలమై నేను కేశవచంద్రులదగ్గర పనిచేస్తూవచ్చేను. ఎప్పుడూకూడా ఆయనదగ్గరకు స్త్రీలు ఎవరూ రాలేదు. ఇదే మొదటిసారి ఒక స్త్రీమూర్తిని అక్కడ చూడడం. "కేశవచంద్రులు పైకి వెళ్లేరు. వచ్చే టైము అయింది. మీరు ఆ సోఫామీద కూర్చోండి" అన్నాను. ఆమె కొంచెం సంకోచించి కూర్చున్నాది.

కాని నేను మళ్లా చెప్పడంవల్లాన సోఫామీద చతికిలపడింది. నేను గార్డెన్ వరండాలో నిలబడ్డాను. నాబుర్రలో అనేకఆలోచనలు పరుగెడుతున్నాయి. "ఈమె ఎవరు? ఎందుకు వచ్చింది? వచ్చినయామె ఉదయం రాక రాత్రి ఎందుకు రావాలి? అసలు యింతకూ మితభాషులైన కేశవచంద్రులు యీామెతో మాట్లాడ రన్న సంగతి యీ అమాయకురాలికి తెలియదేమో!" ప్రశ్న పరంపరలు బుర్రలో గిర్రున తిరుగుతున్నాయి.

ఆలోచనలో ఉన్న నన్ను తిరిగీ వాస్తవికజగత్తులోకి తీసుకువచ్చింది కారుహెడ్ లైట్సుయొక్క కాంతి. వెంటనే పోర్టికోలోకి వెళ్లేను. కారు పోర్టికోలోకి వచ్చి ఆగ్గానే తలుపు తీసి ప్రక్కన నిలుచున్నాను. కేశవచంద్రులు క్రిందకు దిగేరు. "ఇంత రాత్రివరకూ పనిచేస్తున్నావా!" అన్నారు కేశవచంద్రులు. "ఔనండి" అన్నాను భయవినయాలతో. ఇద్దరూ హాల్లోకి ప్రవేశించేము. నేను ఆయనతో యింకా ఆ స్త్రీవ్యక్తివిషయమై చెప్పాలనుకుంటున్నాను. అలా చెప్పకపూర్వమే మే మిద్దరం హాల్లో ప్రవేశించాము.

సోఫాలో కూర్చున్న ఆమె నిలిచింది కేశవచంద్రులు ఆమెను చూచేరు. ఆయనముఖంలోకి నేను చూస్తున్నాను. ఆయనముఖంలో ఏవిధమైన మార్పూ కనిపించలేదు. ఆమె పూర్వపరిచిత అయినట్టయినా ఆయనముఖవర్ణం చెప్పలేదు. నావైపు తిరిగి ఆయన గంభీరకంఠస్వరంతోనే అన్నారు: "బాగా రాత్రి అయింది. నువ్వు ఇంక యింటికి వెళ్లు" అన్నారు. నేను ఆయనకు నమస్కారంచేసి మెల్ల మెల్లగా అడుగులు వేసుకుంటూ భవనంపైకి వచ్చేను. "బాబూ, కార్లో వెళ్తారా?" అన్నాడు రామచంద్—కారుడ్రైవరు. 'వద్దు' అని ముక్తసరిగా చెప్పి యింటివైపు దారి పట్టేను. ఆలోచనలతో తల నిండిపోయింది. 'ఆ స్త్రీ వ్యక్తి ఎవరు?' అన్న ప్రశ్న పదేపదే నన్ను వేధిస్తూ వచ్చింది. దూరాన్న ఉన్న క్లాక్ టవరునుండి పది కొండుగంటలు వినవచ్చేయి. ఇక ఆలోచనలు మాని నా లాడ్జింగుకు చేరుకున్నాను.

మర్నాడు ఉదయం ఆరుగంటలకు యథాప్రకారంగా ఛేంబర్సుకు వెళ్లేను. హాల్లో లైటు వేసి ఉంది. నాకు చాలా ఆశ్చర్యం వేసింది. ఛేంబర్సు తలుపులూ తీసిఉన్నాయి. లోపల లైటు వెలుగుతూంది. ఛేంబర్సులో నేను తప్ప ఇంకెవ్వరూ పని చెయ్యడానికి వీల్లేదు. కేశవచంద్రు లెప్పుడూ మేడ దిగి క్రిందికి రారు. ఏదైనా కావలసివస్తే నేనే మేడమీదకు వెళ్ళి ఆయనతో సంప్రదించి వస్తూఉండేవాణ్ణి. పది సంవత్సరాలనుండీ యిదేవిధంగా జరుగుతూంది. ఇంటి బాధ్యతంతా నామీదే ఉండేదికూడా. ఛేంబర్సుతలుపులు ఎందుకు తీసిఉన్నాయా అని తొందరగా లోపలికి ప్రవేశించేను. ద్వారందగ్గర నేను ఆగిపోవలసివచ్చింది. నాకళ్ళను నేను నమ్మలేకపోయేను. "శిరీష్, లోపలికి రా" అన్నారు కేశవచంద్రులు. నేను నమస్కారం చేసేను. కాని నా కింకా సరిగ్గా నమ్మకం కలగలేదు. ఎప్పుడూ లేని విశేషం యీనాడు హఠాత్తుగా జరిగింవంటే నమ్మడం కష్టం.

"నీకు ఆశ్చర్యంగా ఉందికాదూ నే నిక్కడికి రావడం?" అన్నారు ప్రశ్నపూర్వకంగా కేశవచంద్రులు. 'ఔ' నన్నట్లు తల ఊపేను. నాకు ఇంకా మాట రావటం లేదు. నిన్నటిరాత్రి జరిగిన విషయాలు ఒక్కసారిగా తల్లో ప్రవేశించాయి. కుతూహలం ఎక్కువయింది. వాటినిగురించి ప్రశ్నిద్దా మనిపించింది. "అలా కూర్చో" అన్నారు. జవాబు చెప్పకుండా ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నా. ఆయన నా ముఖంలోకి చూచేరు. నాముఖంనుండి చెమటబిందువులు జలజల రాల్తున్నాయి. ఆయన కుర్చీనుండి లేచి నిలబడి ఇటూ అటూ పచారుచేయడం మొదలుపెట్టేరు. నే నలా మౌనంతోనే కూర్చున్నాను. గోడగడియారం మాత్రం ఆ నిశ్శబ్దాన్ని భంగంచేస్తూంది. ఒక్కసారిగా ఆయన పచారు మానేసి నావైపు చూచేరు. నేనూ ఆయనముఖంలోకి చూస్తూ కూర్చున్నాను. "శిరీష్, ఏ విషయముగురించి ప్రసంగించవలసివచ్చినా, కాలమాన పరిస్థితులు కూడుకురావా లన్నమాట సత్యం. నేడు అటువంటి పరిస్థితులు ఏర్పడ్డాయి. అందుచేత నే నొక విషయం నీకు చెప్పదలచుకున్నాను. ఆ విషయం మరొకరికి తెలియకూడదు. ఇది నా జీవితానికి...

లాంటిది కాదు. అది నా జీవితరహస్యం. నువ్వు జాగ్రత్తగా విని నీ గురుదేవుని లోటుపాట్లను క్షమించు." అన్నారు కేశవచంద్రులు. నాకు ఆయన మాటలన్నీ కూడా అగమ్యగోచరంగా ఉన్నాయి. వాటి అర్థాన్ని నే నేమీ అవగాహనచేసుకునే స్థితిలో లే ననిపించింది. కాని, కుతూహలంతో ఆయన ముఖంలోకి చూచేను.

కేశవచంద్రులు చెప్పడం ప్రారంభించేరు :

"శిరీష్, నేటివరకు కేశవచంద్రుడు ఒక అఖండ మేధావి అనిన్నీ, గంభీరుడనిన్నీ, మితభాషియనిన్నీ, నిశ్చలు డనిన్నీకదూ ప్రతీతి? ఇవన్నీ కేశవచంద్రులకు ఎందుకు అలవడినాయో తెలుసుకుందామని నీకు కుతూహలంగా లేదూ?" అని ఒక్క క్షణం ఆగేరు. "నిజమే. కేశవచంద్రుడు నేడు మితభాషి. ఏకాంతాభిలాషి. దానికి కారణం నాజీవితంలో జరిగిన ఒక విచిత్రసంఘటన ఆ విచిత్రసంఘటనమూలాన్నే నా జీవితం అంతాకూడా తారుమారైంది. మానవజీవితంలో విషమసంఘటనలు ఏర్పడడం సహజం. కాని జీవితాన్నే ఒక్క త్రుటిలో మార్పు చేసేవిమాత్రం చాలా అరుదు. అటువంటిదే సంభవించినప్పుడు ఆ మార్పు మాత్రం చిరస్థాయిగా జీవితంలో జీర్ణించిపోతుంది.

"ఇది ఇరవైయైదుసంవత్సరాలక్రితం జరిగిన సంగతి. నా జనకుడు ఈ యూనివర్సిటీలో లిటరేచరు ప్రొఫెసరుగా పనిచేస్తూఉండేవాడు. నేను మాస్టర్ ఆఫ్ ఆర్ట్స్ డిగ్రీ తీసుకున్నాను అప్పుడు. నాతండ్రి నన్ను బారట్లాకు విదేశం పంపడానికి నిశ్చయించేడు. నాతల్లి నాచిన్నప్పుడే మరణించింది. నాతండ్రి రెండవవివాహం చేసుకోలేదు. విశ్వవిద్యాలయ కళాశాలలో లిటరేచర్ గ్రూపులో చదువుతున్న విద్యార్థులందరూ నా తండ్రిదగ్గరకు ఎప్పుడూ వస్తూ ఉండేవారు. ఆ వచ్చేవారిలో మాతండ్రికి స్నేహప్రభ ఆనే అమ్మాయిమీద ఎంతో గౌరవమూ, అభిమానమున్నూ ఉండేది. అప్పుడప్పుడు ఆమెనుగురించి నాతో చెప్తూఉండేవాడు: ఆమె చాలా తెలివైన పిల్లనీ, లవకంటేకూడా వాఙ్మయంలో ఎక్కువగా చదివిందనీ, కళాశాలకు చాలా పేరుప్రఖ్యాతులు తీసుకువచ్చే విద్యార్థిని యనీని. నా తండ్రి చెప్పిన ఆ మాటలనుబట్టి ఆమెను చూడాలనీ, ఆమెతో ప్రసంగించాలనీ నాకు కుతూహలం ఉండేది. కాని సహజంగా మితభాషినవబట్టి ఆమెతో మాట్లాడ్డం పడేది కాదు. ఆమెమాత్రం మాయింటికి వచ్చినప్పుడుమాత్రం నన్ను చూచి చిరునవ్వు నవ్వకుండా వెళ్ళేదికాదు. కాని నాకుమాత్రం ఆమెతో మాట్లాడ్డానికి సాహసం లేకపోయేది.

"ఒకనాడు మాతండ్రిగురించి ఆమె మాయింటికి వచ్చింది. నా జనకుడు ఆగ్రావిశ్వవిద్యాలయవిద్యార్థులు కోరగా, వారికి వాఙ్మయచరిత్రమీద మాట్లాడానికని ఆగ్రా వెళ్ళాడు. నాతండ్రి లేడని ఆమెతో నేనే చెప్పేను. ఆ అదను చూచుకొని ఆమె నాతో ఎంతో సేపు ప్రసంగించి తనను యింటివరకు దిగబెట్టమంది. తను వచ్చిన కారును, మాతండ్రిలేడని నేను చెప్పిన వెంటనే పంపివేసింది. అందుచే నాతండ్రికారుమీదనే నేను ఆమెభవనందగ్గర ఆమెను దిగవిడచి రావలసివచ్చింది. ఆమె మాప్రసంగసందర్భంలో తాను కాటన్ మిల్సు ప్రొప్రయిటర్ కుమార్తె ననీ, తను ఇక్కడ చదువుతా నన్నందుమూలాన తన తండ్రికూడా ఇక్కడే వచ్చి ఉన్నాడనీ, అసలు వారి స్వస్థానం బొంబాయి అనీ చెప్పింది. కారు వారింటిదగ్గర ఆగ్గానే నన్ను లోపలికి రమ్మని నిర్బంధించింది. నేనుమాత్రం మర్నాడు వస్తా నని వెళ్ళిపోయేను.

"ఈవిధంగా మాఇద్దరికి న్నూ పరిచయం ప్రారంభమయింది. నెలలు గడిచినకొలదీ మా మైత్రి ప్రేమగా మారింది. మాతండ్రికూడా అంగీకరించాడు మా సహవాసాన్ని. ఇలా కొంతకాలం సంతోషంగా గడిచింది. కాని మేముమాత్రం ఒక్క లోపాన్నిమాత్రం చేసేం. ప్రేమికులమధ్య ఏ పనయినా ధర్మాధర్మాల్ని గ్రహించదు. యౌవనసమయంలో మే మేం చేస్తున్నదీ కూడా గ్రహించలేదు. ప్రేమవాహినిలో మాకు న్యాయాన్యాయవిచక్షణ నశించి శరీరసౌఖ్యాలనుకూడా అనుభవించేం.

"నేను విదేశాలకు వెళ్ళవలసిన కాలం సమీపించింది. ఈ మాట నేను స్నేహప్రభకి చెప్పేను. ఆమె నాతో మరీమరీ చెప్పింది—నేను చదువు ముగించిన

వెంటనే రావలసిందిగా. అంతవరకు ఎలాగో కష్టంలో కాలం గడుపుతానంది. నా ప్రయాణం నిశ్చయ మయింది. నన్ను ఓడకేవువరకు దిగబెట్టడానికని స్నేహ ప్రభ బొంబాయి వచ్చింది. చాలా ఆనందంతో నేను ఓడ ఎక్కాను. ఈనాటికికూడా ఆమె గాలిలో ఊపు తున్న జేబురుమాలు నాకంటికి కట్టినట్టుంది. నేను విదేశం చేరుకున్నాను."

కేశవచంద్రులు ఇటూ అటూ పచారుచేయడం మొదలుపెట్టేరు. నేనేమీ ఆ నిశ్శబ్దాన్ని భంగంజేయ కుండా మౌనంగా కూర్చున్నాను. ఉచ్ఛ్వాసనిశ్వా సాలుమాత్రం కొంచెం వడిగా వస్తున్నాయి. క్షణం ఒక యుగంలా ఉంది నా మానసానికి. తిరిగి ఆయన బల్లదగ్గరకు వచ్చి మౌనంగా నిలుచున్నారు. 'తిరు వాత' అని ప్రశ్నిద్దా మనుకున్నాను. కాని నా నోరుతడి ఆరిపోయింది. ఆయనను ప్రశ్నించడానికి నాకు సాహసం లేకపోయింది. ఆయన ఒక నిట్టూర్పు విడిచేరు. తిరిగి ఆయన ప్రారంభించేరు :

"నేను విదేశం చేరుకున్న తరువాత నాకు, స్నేహ ప్రభకు మధ్య ఉత్తరప్రత్యుత్తరాలు జరుగుతూ వచ్చేయి. నామీద ఆమెకు ఉండే ప్రేమకు ఒడ్డు లేదని ఆమె స్వహస్తలిఖితమైన జాబులే చెప్తాయి. కాని మానసిక పరివర్తనాన్ని మనం గమనించలేం. ఏది ఎప్పుడు ఏ విధంగా మారుతుందో కూడా మనం రూఢిగా చెప్పలేం. మానసికతత్వవేత్తలైనా భవిష్యత్తులో మానసికపరి వర్తనం ఎలా ఉంటుందో చెప్పలేరు. వాస్తవిక నడ వడినిబట్టి మానవుని స్వప్నావస్థలో జరిగే మార్పులను మాత్రమే గ్రహించగలరు. స్నేహప్రభదగ్గరనుండి అక స్మికంగా ప్రత్యుత్తరాలు రావడం మానివేసేయి. దానికి గల కారణం నేను గ్రహించలేకపోయేను. అప్పటికి నే చేసిన అపరాధ మేమైనా ఉంటే క్షమించమనికూడా వ్రాసేను. ఆ జాబులకుకూడా ఆమెదగ్గరనుండి ప్రత్యు త్తరములు లేవు."

కేశవచంద్రుల కంఠం కంపితమవుతూ వచ్చింది. "కాని నేడు దానికి కారణం గ్రహించగలిగేను" అన్నారు ఆయన. ఆయన మాటలు ఒక యీటె నా చెవిప్రక్కనించి వెళ్ళినట్లుగా అయింది. ఆయనకంపిత స్వరం క్షమాపణ వేడుకొనేందుకై తన అపరాధాన్ని ఒప్పుకునే అపరాధికంఠంలా వినిపించింది.

"ఈలోపున నాతండ్రిమరణవార్త వచ్చింది" అన్నారు ఆయన తిరిగి ప్రారంభిస్తూ. "నా మానసిక ఆందోళనకు పరిమితి లేదు. ఒకవైపున నే ప్రేమించిన స్త్రీ నన్ను నిరాకరించిందన్న ఉద్రేకం, యింకొక వైపున నాతండ్రి మరణించేరన్న తీరని ఆక్రోశం నా మనస్సును గాఢంగా అలుముకొన్నాయి. నే నేం చేయు టానికీ పాలుపోలేదు. ఈ హృదయవేదనలో నేను దేశం వెళ్లడానికి యిష్టపడలేదు. నా స్నేహితులు నాకు ఊరట కల్గించడానికి ఎంత ప్రయత్నించినా నా మన స్సుకు శాంతి అలవడలేదు. ఇప్పుడు నే నీ విశాల ప్రపంచంలో ఏకాకిని. నా విద్యకూడా ముగిసింది. కాని యీ మానసికాందోళనలో దేశంవెళ్ళడం యిష్టం లేదు. అంచేత దేశద్రిమ్మరి నవుదామన్న తలంపు వచ్చింది. ఎవరికీ చెప్పకుండా రాత్రికిరాత్రి హోటలు విడిచి పయనమయ్యేను. ఎచ్చటికో నాకు తెలీదు." అన్నారు కేశవచంద్రులు.

"యూరపుఖండమంతా పర్యటనచేసేను—నా మనస్సును శాంతిపరచుకొందామని. అప్పటికి దేశం వదిలి ఏడు సంవత్సరాలు కావచ్చింది. నేను బెర్లిన్ లైబ్రరీలో ఉన్నాను. లైబ్రేరియను ఏవో కొన్ని పుస్తకాలు నా ప్రక్కనుంచే తీసుకువెళ్తున్నాడు. అందులో ఒకదాన్ని తీసి మొదటి పుటలోకి చూసేను. 'Agony is the basis of all frustration. It is a state of mind which yields to nothing except thy cherished work'. అప్రయత్నంగా లేచేను. ఏదో ఒక మహత్తరమైన శక్తి నాలో ప్రవే శించినట్టయింది. నాలో ఉన్న శక్తులన్నీ కేంద్రీకరింప బడినాయా అన్నట్లు తోచింది. వెంటనే దేశానికి ప్రయాణమవడానికి నిశ్చయించేను. శరవేగంతో దేశా నికి చేరుకున్నాను.

"దేశానికి వచ్చినతరువాత స్నేహప్రభవిషయమై చాలా ప్రయత్నించాను. ఆమెస్నేహితురాండ్ర నంత రినీ చూచామకాని ప్రయోజనం లేకపోయింది. తరు వాత నే నేవిధంగా న్యాయశాస్త్రంలో పేరు గడిం

చిందీ నీకు తెలుసు." అన్నారు ఆయన. కొంతవరకు మేమిద్దరం మాట్లాడలేదు. గడియారం మాత్రం నిశ్శబ్దాన్ని భంగంచేస్తూంది. "శిరీష్, నీకు నా పూర్వ చరిత్ర అంతా చెప్పేను. ఇంక ఉత్తరచరిత్ర విని నీ గురుదేవుని చర్యమీద నీ అభిప్రాయాన్ని గుప్తంగా ఉంచుకో" అన్నారు తిరిగి ప్రారంభిస్తూ. "నేను విదేశం వెళ్ళినతరువాత మూడుమాసాలవరకు నాకు, స్నేహప్రభకు ఉత్తరప్రత్యుత్తరాలు జరుగుతూవచ్చేయి కాని ఆకస్మికంగా ఆగిపోయేయి అని చెప్పేను. దానికి ఆనాడు కారణం గ్రహించలేకపోయే ననికూడా అన్నాను. కాని దానికి కారణం చెప్తున్నా; నువ్వు జాగ్రత్తగా వినవలసిన విషయం యిదే. నేను విదేశం వెళ్ళిన నాలుగు మాసాలకు స్నేహప్రభ తాను గర్భం దాల్చినట్లు తెలుసుకొంది. ఆ విషయం ఆమె గ్రహించగానే ఆమెకు నామీద ఎచ్చుటలేని ఆగ్రహం కలిగింది. ఆమె ప్రేమ అంతా కూడా ఒక్కసారి నశించి ఆమెహృదయమంతా నామీద విద్వేషపూరిత మయింది. అందుచేతనే మానవ మానసికపరివర్తనాన్ని గ్రహించడం కష్టసాధ్యమని నీతో చెప్పేను. ఆమె నన్ను ఒక వంచకునిగా తలచింది. నా ఉత్తరముల నన్నింటిని అగ్నిహోత్రుడికి ఆహుతిచేసింది. ఆమెరోజులుకూడా బాగుండకపోవుట చేత, ఆమెతండ్రి, దూదిమిల్లులలో నష్టంరావడంవలన దారిద్ర్యంలో మునిగిపోయేడు. అతని ఆర్థికస్థితి ఒక్కసారిగా మారడంవల్ల అతని హృదయం ఒక్కసారిగా చలించి స్వర్గీయుడైనాడు. స్నేహప్రభకు దిక్కెవ్వరూ లేరు. ఆమె ఏకాకి. కాని సహజగంభీరమైన హృదయం కలది గాన ఎట్లో జీవించింది. కాని ఆమె గర్భావస్థ ఆమె నెక్కువగా బాధించింది. ఆమెకు ఏమి చెయ్యడానికీ తోచిందికాదు. నన్ను ద్వేషించుకొంది. ఆ ఆందోళనలో ఆమె తన పూర్వపరిచితుడును, తనకు విశ్వవిద్యాలయంలో సహాధ్యాయుడునైన యువకుని ఆశ్రయించింది. అతడు ఆమెను పూర్వంనుంచి ప్రేమిస్తూ వచ్చేడు. ఆమెను వివాహమాడడానికి నిశ్చయించి ఆమె నడిగాడు. ఆమె అతణ్ణి తిరస్కరించలేకపోయింది. ఆమె అతణ్ణి మోసంచేస్తుందని తెలుసుకొని, తను గర్భవతి; తనకు పుట్టబోయే శిశువుకు అపవాదు తీసుకురాకూడ దనే ఉద్దేశంచేత అతన్ని వివాహమాడింది. శిరీష్, మానవప్రకృతి ఏవిధంగా మారుతుందో యీ విషయం తార్కాణ మవుతుంది." అన్నారు కేశవచంద్రులు. "కాని ఆ వివాహ మాట్టే రోజులు గడువలేదు. ఆమె గర్భవతి అని అతను గ్రహించినక్షణమే ఆమెను యింటినుండి వెడల గొట్టేడు." కేశవచంద్రుల కంఠం గద్గదికమయింది.

"పాపం! ఆమె ఎంత పరితపించిందో! ఎంత దుర్మార్గునిగా తలచిందో నాకు తెలియదు. కాని యిప్పటికీ ఆమె ఒక సాధ్వి. ఒక మహావ్యక్తే. ఆమె ఒక మగశిసువును ప్రసవించింది. ఇరవై సంవత్సరాలు ఆ శిసువును పెంచి పెద్దవాణ్ణిగా చేసింది. కాని శిరీష్, యీ విషయంలోకూడా ఆమెకు శాంతి లేకుండా పోయింది. ఒకనాడు సంభాషణలో ఆమె కుమారునితో తాను ఫలానావాని భార్యగా చెప్పింది. ఆ కుర్రవాని తండ్రి అతడే అన్నట్లుగా చెప్పింది. తల్లికి జరిగిన అవమానానికి అతడు ఉద్రేకపూరితు డయ్యాడు. అతనికి మాత్రం తనతల్లి అతణ్ణి మోసం చేసిందని ఏం తెలుసు! తన ఉద్రేకం ఆపుకోలేక అతడు ఆమెను వివాహమాడిన భర్తను హత్యగావించేడు". కేశవచంద్రులు కన్నీటిని ఆపుకోలేకపోయేరు. ఆయనగంభీరవదనం అంతా ఏమయిందో నా కిప్పటికీ తెలియదు. ఒక పసిపాప లాగ రుద్ధకంఠంతో చెప్పడం మొదలెట్టేరు:

"శిరీష్, రేపు ఆ యువకుణ్ణి నేను హైకోర్టులో అపరాధికాన ప్రాసిక్యూట్ చెయ్యవలసివుంది. నా కుమారుణ్ణి నేను ప్రాసిక్యూట్ చెయ్యాలి. శిరీష్, స్నేహప్రభకు తీరని అవమానం కలిగించేను. ఆమెశీలం హరించేను. ఈ పిల్లవాని మరణంతో ఆమెయొక్క సర్వస్వం హరించినవాడిని అవుతాను. కాని కేశవచంద్రుడు న్యాయపక్షపాతి. అంచేత ఒక అపరాధిని శిక్షనుండి తప్పించడానికి ప్రయత్నం చేస్తాడా? ఎందుకు చెయ్యడు—తనే అపరాధి అయినప్పుడు? శిరీష్! ఆమె కుమారుణ్ణి, ఆమెనూ రక్షించాలి—న్యాయమార్గంతప్పినా సరే. ఎప్పుడూకూడా న్యాయాన్నే అనుసరిస్తా అని న్యాయదేవతకు నామాట యిచ్చేనుకాని, నే తీరని ద్రోహంచేసిన స్త్రీవ్యక్తికి నా అపరాధాన్ని క్షమింప

లేనందుకు నే నేమైనా చెయ్యాలి. ఇది భౌతిక శృంఖలలు" అన్నారు కేశవచంద్రులు ఆవేశంతో.

"శిరీష్, నిన్న నీవు చూచిన స్త్రీవ్యక్తే స్నేహ ప్రభ. ఆమె మరణించలేదు. పుత్రభిక్షకై నాదగ్గరకు వచ్చింది. రేపు నేనే స్వయంగా కేసులో పాల్గొంటాను. నీవు అక్కరలేదు" అని ఆయన మేడమీదకు వెళ్లిపోయేరు. నేను నిశ్చేష్టుడనై అలా కొంతసేపు ఉండిపోయేను.

ఆమర్నాడు సాయంకాలం తల వంచుకొని ఛేంబర్సులోకి వెళ్లేను. కేశవచంద్రులు కూర్చీమీదకూర్చుని రెండు కవర్లు చేత్తో పట్టుకున్నారు. "శిరీష్, ఏమిటలా ఉన్నావు! వెర్రివాడా! నేను చెప్పలేదా నిన్న. నావిధి నెరవేర్చేను. ఇప్పుడందరూ ఏమనుకుంటున్నారు? అఖండమేధావి అని పేరుబడ్డ కేశవచంద్రుడు ఇంత తెలివి లేమిగా కేసులో పనిచేసేడనేనా? అమాయకులకు కారణం తెలియదు. శిరీష్, నువ్వు విచారించవలసిన విషయం లేదు. నా తప్పిదాన్ని సవరణ చేసుకున్నాను. కాని అంతకన్న తీవ్రమైన కళంకం ఆపాదించుకున్నాను. ధర్మదేవతకు తీరని అపరాధం చేసేను. ఇదుగో రాజీనామాపత్రం. నేను ఇంక న్యాయవాదిగా ఉండడానికి అనర్హుణ్ణి. ఇది కోర్టులో అందజెయ్యి. ఇక కేశవచంద్రుడు కోరిందేదీ లేదు. నా న్యాయవాదిప్రకరణం ముగిసింది. ఇదిగో, యీ రెండవ కవరు ఆమె ఇక్కడకు వచ్చినవెంటనే యియ్యి. నేను వెళ్తున్నాను" అని మేడమీదకు వెళ్లేరు. ఎప్పటి గంభీరుడే ఆయన.

గడియారంవైపు చూస్తున్నాను. ఏదో అలికిడయింది. "కేశవచంద్రులు లేరా?" అంది ఆమె. నేను మౌనంగా ఆ కవరు ఆమెకు ఇచ్చేను. ఆమె నెమ్మదిగా కవరు విప్పింది. లోపలినుంచి 'చెక్కు' ఒకటి తీసింది. నాముఖంలోకి చూచి అంది: "ఆయనకు నా కృతజ్ఞతావందనములు అర్పించండి" అని చెక్కు రెండు ముక్కలుగా చింపి బల్లమీద ఉంచి వెళ్లిపోయింది. నేను ఆమె వెళ్తున్నమార్గంవైపు శూన్య దృక్కులతో చూస్తూ నిలుచున్నాను. ఒకసారి మేడ మెట్లవైపు చూచేను. తిరిగీ ఆమె వెళ్లిన శూన్యమార్గం వైపు చూచేను. అప్రయత్నంగా అన్నాను: "ఇద్దరూ గంభీరులే! భౌతికశృంఖలలు విడ్డాయి."

అవు నన్నట్లుగా గోడగడియారం తొమ్మిది కొట్టింది.



# కాంక్ష



శ్రీ వావిలాల రామమూర్తి

౧

ఒక వర్షాభ్రము తాఁ సిల్లి త్రుటిలో వ్యోమమ్ము తానై, యనం
తకుఛ్ఛత్రం బనగా నకాలజనితధ్వాంతమ్ము రూపింప, బా
లకులుఁ గేకినలఁ ఘటించుచు మహాహ్లాదంబుతో బిల్లగా
ద్ధ్వను సుస్వాగత మీయ నా ప్రకృతిదృష్టుల్ గాంచి కైమోడ్చెదఁ.

౨

స్తనయిత్నుప్రభు డన్నియేని తడవల్ క్ష్మాదేవి సుస్నాతగా
బొనరింపఁ విగతప్రతాపు డయి నవ్వుల్ వచ్చి రాకుండ, ద్యో
మణిసద్యఃసుమనోజ్ఞమై యమలమా మాధుర్యదీవ్యన్మహ
స్సును సర్వత్ర వహించు నా ప్రకృతిదృష్టుల్ గాంచి కైమోడ్చెదఁ

౩

జీవనముల్ గడించి జనజీవనముల్ ఘటియించి ధాత్రి సం
జీవినులై నదీహ్రదవిశేషము లొప్పఁగ తెమ్మెరల్ దివా
దేవు కుశాగ్రబుద్ధికి గతిన్ బ్రతిబింబము నూర్మిడోలికా
సేవల దేల్చియూప నతసీప్రకృతిన్ గని కేలు మోడ్చెదన్.

౪

జొన్నపొలంబు మేతకయి చొచ్చిన రైతు నదల్చి, పాంథులన్
పన్నలతో ద్వరన్ గొలిచి, సాగు పతంగములన్ మరల్చి, బ
ధ్నన్నవమేఘవస్త్రమున దోచుచు, దాగుడుమూత లాడుచున్
పన్నని జల్లులన్ దనుపుసట్టి కనత్ప్రకృతిన్ దలంచెదన్.



# శివాజీ శీలము

●

శ్రీ నాళము కృష్ణరావు

లగ్గవట్టి శివాజి కల్యాణికోట
ముట్టడించి పరాక్రమమున జయించి,
సఖులు మంత్రులు పరివారజనులు తన్ను
గొలిచి సేవింప నొకనాడు కొలువు దీర్చె.

అరుణకిరణము చరమాద్రి నొరగుచుండ,
చిమ్మచీకటిచీర కుచ్చెళ్లు దిద్ది
పైట సవరించుకొనుచుండె ప్రకృతికాంత
మెల్లగా నవ్వుచుండె జాబిల్లికొదమ.

సద్దు మణిగెను సభ యెల్ల, గద్దెనుండి
యింక దిగలేదు భూవరు, డెల్లజనులు
దృష్టి సారించి యెద్దియో దృశ్యముదెన
చూచుచుండిరి తద్దయు చోద్య మొప్ప.

ఱేడు తోడనె యావైపు దృష్టి బఱపె,
మబ్బుమాటున చంద్రబింబమ్ము వోలె
మేలిముసుగున నెమ్మోము మెఱుగు లీన
తరుణి యొక్కతె నిలుచుండె శిరము వంచి.

"జయము జయము మహారాజ! జయము
జయము!
దేవరకు పట్టమహిషియు, దేవి మాకు
కాదగిన జగన్మోహనాకార నీమె
బందెగొని తెచ్చినారము ప్రభునికడకు."

అనుచు సేనాని వచియించి యధికభక్తి
గదుర చేతులు జోడించి యొదిగి నిలిచె;
ప్రభువు తల మెత్తి యా యింతివైపు చూచె,
జనుల కలకలారావముల్ సందడించె.

క్షణములో నొక్కపెట్టున జనుల చూపు
నొక్కసారి సతివైపున, నొక్కసారి
యింతివైపున త్రుళ్లింత లిడుచునుండె;
ఉస్సు రని రాజు క్షణ మట్టె యూరకుండె.

"చారుసుకుమారసుందరాకార మైన
ఈమెకడుపున నే నుదయించియున్న,
అహహ! ఎంతటి ధన్యుండ నగుదునో కద"
అనుచు గద్గదరవమున ననియె ఱేడు.

అధిపు డడిన యా మాట లాలకించి
తెల్లవోయిరి సభలోని యెల్లవారు;
మేడచుట్టును నిలుచున్న మెలత లెల్ల
మేలు మే లని తల లూచి మెచ్చికొనిరి.

అదిగో, ఎవ్వరో శుభలక్షణాంగి యొకతె
రాజ్ఞి కాబోలు—సౌధాంతరముననుండి
ప్రణయదృష్టులతో బాటు ప్రభుని మీద
కుసుమవర్షము కురిపించె గూర్మి మీఱ.

"విలువ నగలును, సన్నదువ్వలువ లొసగి
వెంటనే యామె దోడ్కొని యింటి కేగి,
బల్మిమై నామె బందిగా బట్టికొనిన
నేరమునకు క్షమాపణ కోరి రమ్ము."

అనుచు నీరీతి సేనాని కానతిచ్చి
డిగ్గు రని గద్దెపైనుండి డిగ్గె ఱేడు;
సభ్యు లెల్లరు లేచిరి సంభ్రమమున,
సిగ్గుచే నంత దళవాయి శిరము వాల్చె.

* * * *

కొండయెలు కంచు, దొంగలగండ డంచు
ఛత్రపతి గూర్చి ఆంగ్లేయచరిత కారు
లెన్ని కల్లలు రచియించియున్న నేమి?
వాని సత్కీర్తి యొక్కింత వన్నె తఱుగునె?

# జక్కనకవి కాలము

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

తెలుగునాటి సుప్రసిద్ధకవులలో జక్కన యొకడు. ఈతడు రచియించిన విక్రమార్కచరిత్రము మేలైన తెలుగు కావ్యములలో నొకటి. ఈ కావ్యము నితడు వెన్నెలకంటి జన్నయసిద్ధమంత్రి కంకితమిచ్చెను. ఈ సిద్ధనమంత్రి యన్నాడట ఈ కవిని బిలువనంపించి యతనితో—

"చక్కన నీ సైదుమ్మము
చక్కన నీ కావ్యరచనాచాతుర్యంబుల్
చక్కన నీ వాగ్వైఖరి
చక్కన నీ వంశమహిమ జక్కనసుకవీ"

అని. ఇంతేకాదు—

"స్వాభావికనవకవితా
ప్రాభవముల నుభయభాష ప్రౌఢిమ జెప్పన్
భూభువనంబున సరి లే
రా భారతి నీవు దక్క నన్నయ జక్కా!"

అని అతని కవిత్వము నంత ఎక్కువగా మెచ్చుకొన్నాడు. ఈ జక్కన ఎప్పటివాడో, అతని నాదరించిన జన్నయసిద్ధన ఎవరో ఇంచుక విచారింతము. జన్నయసిద్ధన యనగా జన్నయకుమారుడు సిద్ధన. ఇట్లే నన్నయ జక్కన యనగా నన్నయకొడుకు జక్కన యని తెలియునది. జక్కనది ప్రసిద్ధమయిన కవివంశము. జక్కనతాత పెద్దయామాత్యుడు అన్ని విద్యల జాడలును ఎరిగిన సాహిత్య కలానిధి. ఈ మహాకవి నెల్లూరు పాలించిన తిరుకాళరాజుఆస్థానమున కలంకారము. పెద్దయామాత్యు డెంతటి గొప్పవాడో క్రింది సీసమాలికవలన దెలియగలదు:

"సంస్కృత ప్రాకృత శౌరసేన్యాదుల
ఘటికలో నొక శతకంబు జెప్ప
బ్రహసన ప్రకరణ భాణాది బహువిధ
రూపకంబులయందు రూఢి మెఱయ
జక్ర చతుర్భద్ర చతురుత్తరాధిక
క్షుద్రకావ్యములు పెక్కులు రచింప
నాంధ్రకవిత్వంబునందు బ్రబంధంబు
మేలుగా తజ్ఞులు మెచ్చ జెప్ప
నిమ్ముల నే రీతి నే ధాతువుల నేమి
రసమునైన వర్ణనము సేయ
సరి యేకసంధా ద్విసంధా త్రిసంధల
దొడరన బోరిబోరి గడవజదువ
నవ్య జే యవధాన మెఱుగు నయ్యవధాన
మున వాని కించుక ముల్లునూప
వృత్తకందము గంధవృత్తంబునం జతు
ష్కందంబు మొదలుగా గలుగు గర్భ
కావ్యవర్గము జెప్పగా బ్రబంధంబులు
గ్రొత్తలు పుట్టించుకొని లిఖింప
గా, నక్షరచ్యుతకంబు మాత్రాచ్యుత
కంబు బిందుచ్యుతకంబు నామ
గోప్యంబులుం గ్రియాగోప్యంబులును భావ
గోప్యంబులును జెప్ప గోష్ఠియందు
బద్యంబు గీతికార్ఘటి నొగి జదువంగ
నెల్లవిద్యల సంచు తెలుగజేర్తు
ననుచు నెల్లూరతిరుకాళమనుజవిభుని
సమ్ముఖమ్మున సాహిత్యసరణి మెఱసి
మహిమ గాంచిన పెద్దయామాత్యసుకవి."

ఈ సీసమాలికలో పైనిచెప్పిన విద్య లన్నిటిలోను పెద్దయామాత్యుడు చాల గట్టి వాడట. నెల్లూరి తిరుకాళరాజుకాలములో పైని పేర్కొనిన వన్నియు రాజాస్థానముల విద్యామండపములలో విద్యాగోష్ఠిలో కవులు చేయుచువచ్చిన వినోదవిద్యలు. ఇన్నిటను ప్రఖ్యాతు డయినవాడు పెద్దయ. ఇతని మనుమడు జక్కయ. అటువంటి కవివంశములో ప్రభవించిన జక్కయకవికూడ ఎంతటి గొప్పవాడై యుండవలెను!

తిరుకాళరా జన్నది కాళహస్తిదేవుని పేర పెట్టిన పేరు. తిరు అనగా శ్రీ. శ్రీకాళహస్తియే తిరుకాళత్తి, తిరుకాళ అయినది. వ్యవహారములో తిరుకాళపద మింకను మార్పుచెంది తిక్కగా పరిణమించినది. మనుమసిద్ధి యాస్థానములోని తిక్కనసోమయాజి కా పేరు శ్రీకాళహస్తీశ్వరస్వామిని బట్టి వచ్చినదే; దేవుని పేరది. మనుమసిద్ధి తెలుగు చోడు లను సూర్యవంశక్షత్రియు లయిన రాజులలో ఒకడు. మనుమసిద్ధితండ్రి చోడతిక్కరాజు. అనగా చోడు డయిన తిక్కరా జన్నమాట. ఈ తెలుగు చోడరాజ వంశములో అనేకశాఖలు ఉన్నవి. అందులో ఒక శాఖవారు సింహవిక్రమపురము అను నామాంతరము గల నెల్లూరు రాజధానిగా పాలించిరి. చోడతిక్కరాజును, అతని తనయుడు మనుమసిద్ధియును నెల్లూరుపాలకులే. మనుమసిద్ధితండ్రి చోడతిక్కరాజు సాహసవిక్రమార్కుడే. చిన్నతనముననే ఇతని శౌర్యసాహసగుణములు దశదిశలను వార్తకెక్కినవి. "శైశవలీలనాడె పటుశౌర్యధురంధరబాహుడైన పృథ్వీశనరేంద్రు మస్తకము నేత్తురు గందుకకేళి సల్పె"నట చోడతిక్కరాజు; "శంభురాజాదిప్రశస్తారిమండలికము నేర్చి" కాంచీపురము నేలినాడట. పైనిచెప్పిన పృథ్వీశనరేంద్రుడు వెలనాటి దుర్జయవంశ్యుడు, క్రీ. శ. ౧౧౮౬ మొదలుకొని క్రీ.శ. ౧౨౦౭ వరకు పరిపాలించెను. ఇతడు క్రీ. శ. ౧౧౬౩ మొదలుకొని క్రీ. శ. ౧౧౮౧ వరకు పాలించిన వెలనాటి రెండవ రాజేంద్రచోడ రాజు మనుమడు. చోడతిక్కరాజుకొడుకు మనుమసిద్ధికి ముగ్గురు కుమారులు. వారిలో తిక్కరాజు (తిరుకాళరాజు) ఒకడు. మనుమసిద్ధి తన కొడుకుకు తనతండ్రిపేర తిక్కరాజని పేరు పెట్టెను. ఈ తిక్కరాజుకు ఇమ్మడి తిక్కరాజని, రెండవ తిక్కరాజని పేరు. ఇమ్మడి తిక్కరాజుశాసనములు క్రీ.శ. ౧౨౬౫, క్రీ. శ. ౧౨౭౯ నాటివి కానవచ్చుచున్నవి. జక్కన పితామహుడయిన పెద్దయామాత్యుడు నెల్లూరు పాలించిన మొదటి తిరుకాళవిభుని కాలములో నుండెనా, రెండవ తిరుకాళవిభుని కాలములో నుండెనా యన్నది ప్రశ్న.

ఇది యటుంచి కృతిభర్త సిద్ధయమంత్రి వంశమునుగురించి యించుక ఆలోచింతము. సిద్ధనమంత్రి తండ్రి జన్నయ, తాత సిద్ధయ. ఈ సిద్ధయ పితామహుడు వెన్నెలకంటి సూరనసోమయాజి. ఈ విషయమే ఈ క్రింది పద్యములో ఇట్లు చెప్పబడినది :

"అమ్మహితాత్ముని (సూరనసోమయాజి) మనుమడు
సమ్మానదయానిధానసౌజన్యగవా
సమ్మోదితబాంధవుడై
యిమ్మహిలో సిద్ధమంత్రి యొన్నిక కెక్కెన్."

(మొదటి) సిద్ధయమంత్రితండ్రి పేరు మనకు తెలియదు — సూరనసోమయాజికి పిదప అతని మనుమనిపే పేర్కొనుటచేత,

కాని, విక్రమార్కచరిత్ర కొన్నిప్రతులలో పై పద్యము మొదటి చరణము "అమ్మహిశా త్ముని తనయుడు" అని సిద్ధయ సూరన సోమయాజిమనుమడు గాక కొడు కనియే చెప్పబడినది. ఇం దేది నిజమో మనకు దెలియదు. మిగిలిన విషయముల ననుసరించి యిది తేల్చవలసియున్నది.

"ఎద్దనపూడి రాజేంద్రచోడనృపా
గ్రమునిచే నగ్రహారముఁ బడసి
కనకదండాందోళికాచ్ఛత్ర చామర
ప్రముఖసామ్రాజ్యచిహ్నముల నొప్పి"

అని సూరనసోమయాజి వర్ణితుడగుట వలన అతడు రాజేంద్రచోడరాజుకు సమ కాలికు డన్నది స్పష్టము. ఈ రాజేంద్ర చోడరాజు వెలనాటి దుర్జయవంశజుడును, క్రీ. శ. ౧౧౬3 మొదలుకొని క్రీ. శ. ౧౧౮౧ వరకు పాలించిన రాజేంద్రచోడరాజు అనుటకు సందియము లేదు. ఈవిధముగా జూచినచో పెద్దయామాత్యుడును, అతని పోషకుడు తిక్కరాజు (రెండవ తిరుకాళ రాజును), సూరనసోమయాజియు ఇంచు మించు సమకాలికు లని విదిత మగుచున్నది.

మొదటి సిద్ధయమంత్రి విక్రమార్క చరిత్రమున ఈ క్రిందివిధమున వర్ణితు డయినాడు:

"వనరుహనాభు శుద్ధవుడు
వజ్రికి జీవుడు వత్సధారణీ
శునకు యుగంధరుండు దితి
సూతికి దైత్యగురుండు విక్రమా
ర్కునకును భట్టిరీతి నధి
కుండగు నన్నయగంధవారణం
బునకు బ్రధానుడై నుతుల
బొందెను సిద్ధనమంత్రి యుదరన్."

నన్నయగంధవారణునికి ప్రధాని యట సిద్ధన. ఈ నన్నయగంధవారణ మెవరు? నన్నయగంధవారణ మనగా నన్నయశత్రు వులను సంహరించు మదగజము. ఇది బిరుద విశేషము. అసలుపేరు కాదు. ఇది ఎవరికి బిరుదమో వారి పేరు తెలుపబడలేదు. ఇది బిరుదవిశేష మన్నది క్రీడాభిరామమువలన స్పష్టముగా తెలియగలదు. క్రీడాభిరామకర్త వల్లభమంత్రి తండ్రి తిప్పన "గంధవతీప్రతీర పురఘస్మరపాదబిసప్రసూనపుష్పంధయచక్ర వర్తి" అనియు, "ప్రుతపర్వతదుర్గమహా ప్రధానరాడ్గంధగజంబు" అనియు వర్ణితు డయ్యెను. గంధగజం బన్నను, గంధవారణ మన్నను ఒకటే. ఒక నన్నయగంధ వారణుడు మనకు దశకుమారచరిత్రవలన దెలియవచ్చుచున్నాడు—చూడుడు:

"ఉరవడి నుగ్రసేవనప
యోనిధి బాచబసహ్నిచాద్భునన్
దరికొని కుంభజన్ముక్రియ
ద్రాగి రఘుక్షితినాథుమాడ్కి న
చ్చెరువుగ నింకజేసె నని
చెప్పు జనప్రకరంబు విక్రమా
కరుని సిద్ధనార్యసుతు
బాచని నన్ననగంధవారణున్."

నన్నసగంధవారణు డన్నను, నన్నయ గంధవారణు డన్నను ఒకటే. ఈ నన్నన గంధవారణుడు బాచడు; అనగా భాస్క రుడు. ఇతడు సిద్ధనకుమారుడు. ఈ సిద్ధన మన మొదటి సిద్ధన కాదు; మంత్రిభాస్కరుని కొడుకు సిద్ధన; ఆంధ్రమహాభారతమును రచియించిన మహాకవియు, మనుమసిద్ధిరాజు ఆస్థానకవియు, మంత్రియు అయిన తిక్కన సోమయాజిపెదతండ్రి; కాగా భాస్కరుడు (బాచడు) తిక్కనసోమయాజిపెదతండ్రి

కాదు కన్నమాట. ఈ బాచడు తిక్కన సోమయాజి కించుక పూర్వుడే కావలెను. ఈ బాచడు నన్నగంధవారణు డట. ఎవరీ నన్నయ? మనుమసిద్ధిరాజుతండ్రియయిన చోడతిక్కరాజుమంత్రులలో మాద్గల్యమణి భూషణము నన్నయ ఒకడు. ఇతని యనంతరము ఇతని తనయుడు త్రిపురాంతకుడు కూడ చోడతిక్కరాజునకు మంత్రిగా నుండెను. ఈ త్రిపురాంతకుడు కంచి వరదరాజస్వామికి క్రీ. శ. ౧౨౩౪లో నొక దానము చేసెను[1]. ఇందువలన నన్నయమంత్రి క్రీ. శ. ౧౨౩౪కు ఇంచుక పూర్వు డనవలెను. తిక్కనసోమయాజిపెదతండ్రి కొడుకు సిద్ధయబాచడు ప్రాయికముగా ఈ నన్నయకు గంధవారణుడు కాదగును. ఈ నన్నయగంధవారణునికి మొదటి సిద్ధన ప్రధాని యనుటకు వీలులేదు; ఏలన, ఈ నన్నయ సిద్ధనకు చాల పూర్వుడుగనుక. ఇక మనము మరొక నన్నయను వెదుకవలసియున్నది.

మహామండలేశ్వరనానదేవమహారాజు అను పేరు గల యొక రాజు నెల్లూరునుండి రాజ్యము చేయుచున్నట్లు నెల్లూరుజిల్లా ఆత్మకూరు తాలుకా కామిరెడ్డిపాడులోని క్రీ. శ. ౧౨౭౯నాటి ఒక శాసనము[2] తెలుపుచున్నది. నానదేవ, నన్నదేవ, నన్నయదేవపదములు ఒకటే; ఒకదాని కొకటి రూపాంతరములు. మన మొదటి సిద్ధన ఈ నన్నయదేవునికి గంధవారణు డయినవానికి ప్రధాని కావచ్చును; అనగా నన్నయదేవుని మంత్రికి మంత్రి యన్నమాట.

వెన్నెలకంటి సూరనసోమయాజి వెలనాటి రాజేంద్రచోడునికి సమకాలికుడు. రాజేంద్రచోడుని చివరికాలములో, అనగా క్రీ. శ. ౧౧౮౦ ప్రాంతమున నున్నవాడు. మొదటి సిద్ధన సూరనసోమయాజికి కొడుకు కాక మనుమడే యని నిర్ధారణ చేసినచో అతనికి మూడవ తరమువాడయిన సిద్ధన క్రీ. శ. ౧౨౭౦ ప్రాంతమునకు వచ్చును. ఇతని కొడుకు భాస్కరుడు ప్రోలయవేమారెడ్డికాలమువా డగును. జన్నయ అనవోతారెడ్డికాలములో నుండె ననుకొన్నను ఇతని కొడుకు సిద్ధన ఉదయగిరిదుర్గాధిపతియైన మొదటి దేవరాయలకాలమువా డగును; అనగా జక్కనకూడ క్రీ. శ. పదునాలుగవ శతాబ్ది కడపటి పాదమున నుండినట్లు చెప్పవచ్చును. జక్కనతాత పెద్దయామాత్యుడు క్రీ. శ. ౧౨౮౦ నాటి రెండవ తిక్కరాజు కాలమువాడు. అతని మనుమడు జక్కన. ఈ విధమున జూచినను జక్కన పదునాలుగవ శతాబ్దిచివరికి వచ్చును.

అయితే నానదేవ యన్నదానిలో నాన యన్నది సందేహాస్పదముగా నున్నట్లు శాసనప్రకాశకులు సూచించినారు. ఇందుల కనుగుణముగా నెల్లూరునాగదేవరాజు అను భూపతిశాసనములు[3] క్రీ. శ. ౧౨౭౧, ౧౨౭౩, ౧౨౭౪ సంవత్సరముల నాటివి ఈడూరు, పెద్దకొండూరు, పెరమన గ్రామములలో నెల్లూరు, కోవూరు, ఆత్మకూరుతాలూకాలలో గానవచ్చుచున్నవి. ఈ కారణమున నానదేవ యన్నది నాగదేవ

---

1. S. I. I. IV. 847.
2. N. D. I., A. 29, p. 239.
3. N. D. I., N. 21, p. 782.
   „ Kv. 48, p. 750.
   „ A. 51, p. 267.

యనుటకు అవపాతమా యని సంశయము కలుగుచున్నది. అందువలన ఇట్టి సందిగ్ధ విషయమును పురస్కరించుకొని కాలనిర్ణయము చేయుట పాడి కాదు.

మొదటి సిద్ధయమంత్రికి భాస్కరమంత్రి, జన్నయమంత్రి యని ఇరువురు కుమారులు. జన్నయమంత్రి "పరమహృద్యంబైన పద్యశతంబున దేవకీతనయు విధేయు జేసె"నట; "రసికత్వమున దేవరాయమహారాయకరుణాకటాక్షవీక్షణ గాము గాంచె"నట; "కర్ణాటకటకముల్ గలయంత యును మెచ్చ గణితవిద్యాప్రౌఢి ఘనత కెక్కె"నట. ఈ జన్నయమంత్రికొడుకు సిద్ధనమంత్రియే జక్కనవలన విక్రమార్కచరిత్రమును కృతి నందినవాడు. జక్కన తన కృతిభర్తయైన జన్నయసిద్ధనమంత్రి నిట్లభివర్ణించినాడు:

"చిత్రగుప్తునికైన జింతింప నరుదైన
గణితవిద్యాప్రౌఢి ఘనత కెక్కె
నవరసంబులయందు నవ్యకావ్యంబులు
కవిజనంబులు మెచ్చగా నొనర్చె
నాణిముత్తెముల సోయగము మించిన వ్రాలు
వరుసతో నిరుగేల వ్రాయనేర్చె
నాత్మీయలిపియట్టు లన్యదేశంబుల
లిపులను జదువంగ నిపుణు డయ్యె
దేవరాయ మహారాయ ధీవిధేయ
మంత్రివల్లభ చామనామాత్యదత్త
చామరచ్ఛత్రశిబికాదిసకలభాగ్య
చిహ్నముల నొప్పె జన్నయసిద్ధమంత్రి."

జన్నయసిద్ధన లిరువురును కవులేనట. జన్నయ పద్యశతము వ్రాసి దేవకీతనయుని విధేయుని జేసికొనెనట. ఆ పద్యశతము పరమహృద్యంబైనదట. 'కృష్ణా దేవకీనందనా' యను మకుటముతో దేవకీనందన శతకము నూరుపద్యముల దొకటి కలదు. అందలి పద్యము లత్యంతహృద్యములే. సాధారణముగా పల్లెటూళ్లలో ఇప్పటికిని పెద్దలు చదువుచుండు ఈ క్రిందిపద్యములు ఈశతకములోనివే.

"అరయన్ శంతనుపుత్రుపై విదురుపై
నక్రూరుపై గుబ్జపై
నరుపై ద్రౌపదిపై గుచేలునిపై
నందవ్రజస్త్రీలపై
బరగంగల్గు భవత్కృపారసము నా
పై గొంత రానిమ్ము నీ
చరణాబ్జంబుల నమ్మినాడ హరి కృ
ష్ణా దేవకీనందనా.

కరి నేలింది హుళక్కి, ద్రౌపదికి తో
కల్ మెచ్చి యిచ్చింది ద
బ్బర, కాకాసురునిం గటాక్షమున చే
పట్టిం దబద్ధం బహో,
శిరసున్నన్ బగవాని తమ్మునికి రా
జ్యం బిచ్చుట ల్లకల్ల, యి
త్తరి నన్నేలిన నిక్క మీ కథలు కృ
ష్ణా దేవకీనందనా !"

ఈ దేవకీనందనశతకమున తత్కర్తకు సంబంధించిన విశేషము లేవియు గానరావు. ఈ శతకము ప్రాచీనమైన దనిమాత్రము నానుడి యున్నది. ఒకవేళ ఈ శతకమే జన్నయ రచియించినదేమో. జన్నయసిద్ధన చేసిన కావ్యములేవో మనకు దెలియదు. ఈ సిద్ధనపెదతండ్రి భాస్కరుడుకూడ గొప్ప కవియట. అతడు విక్రమార్కచరిత్రమున నిట్లు ప్రస్తుతు డయ్యెను:

"నన్నెలకంటి సూర్యుడు వి
వేకగుణాఢ్యుడు వేదశాస్త్రసం
పన్నుడు రెడ్డివేమనర
పాలుచేత మహాగ్రహారముల్

గొన్న కవీంద్రకుంజరు డ
    ఘంటిత తేజుడు పెద్దతంత్రిగా
పన్నగ గన్న సిద్ధనకు
    పంతితదానకళావినోదకా."

ఈ వెన్నెలకంటి సూర్యుడు భాస్కరుడే. ఇతనికి మహాగ్రహారము లిచ్చి గౌరవించిన రెడ్డివేమనరపాలకుడు కొండవీటి ప్రభువు. కొండవీటి రెడ్డిరాజులలో వేమనామధేయము వహించినవారు పలువురు. మొదటివాడు వేము డను ప్రోలయవేమభూపతి. ఇతనికి అనవేము డనియు నామాంతరము. క్రీ. శ. ౧౩౨౫ మొదలుకొని క్రీ. శ. ౧౩౫౩ వరకు పరిపాలించెను. రెండవవాడు ప్రోలయవేముని రెండవకుమారుడు అనవేమారెడ్డి. ఇతడు క్రీ. శ. ౧౩౬౪ మొదలు ౧౩౮౬వరకు రాజ్యముచేసెను. మూడవవాడు ప్రోలయ వేముని అన్నయైన మాచారెడ్డి మనుమడు, పెదకోమటిరెడ్డికుమారుడు. ఇతనిని పెద కోమటివేము డని వ్యవహరింతురు. ఇతడు క్రీ. శ. ౧౪౦౨ మొదలు ౧౪౨౦ వరకు రాజ్య మేలెను. ఇతని కొడుకు రాచవేముడు క్రీ. శ. ౧౪౨౦ మొదలు ౧౪౨౪ వరకు పాలించెను. భాస్కరుని ఆదరించిన రెడ్డి వేముడు ప్రోలయవేముడో, అతనికొడుకు అనవేముడో యై యుండవలెను. ఈ వెన్నెలకంటివారు మొదట కొండవీటి రెడ్డిరాజుల ఆస్థానమున నుండి వారికి కావ్యము లంకిత మిచ్చి తత్ప్రసాదార్జితవైభవమున వర్ధిల్లిన వారు. ఈ వంశములోనివారే మరియొకరు—పేరు తెలియదు—అనపోతభూవరునికి గూడ సత్ప్రబంధ మంకిత మిచ్చినారట. ఈ విషయము వెన్నెలకంటి సూరన్న రచించిన విష్ణుపురాణములోని ఈ క్రింది పద్యమువలన విదిత మగుచున్నది:

"ఈ నిఖిలంబు మెచ్చ నమ
    రేశ్వరదేవుడు చూడ కృష్ణవే
ణీనది సాక్షిగా ననికి
    నిల్చిన రావుతుకేసనాదిభూ
మానవులు దోలి వన్నెవడి
    కాచిన వేమయ యన్నపోతగూ
మానికి సత్ప్రబంధము లొ
    సంగిన వెన్నెలకంటివారిలోన్."

వేమయ యన్నపోతభూజాని ప్రోలయ వేమారెడ్డికొడుకు అనపోతారెడ్డి. ఇతడు క్రీ. శ. ౧౩౫౩ మొదలు క్రీ. శ. ౧౩౬౪ వరకు పాలించెను. తండ్రి కొడుకులు ప్రోలయవేమ, అనపోతారెడ్లకు—లేదా, సోదరులు అనపోత అనవేమారెడ్లకు కావ్యములు కృతి యిచ్చిన కవి ఒకడే—మన జన్నయయన్నగారు భాస్కరుడే యేమో. ఈ వెన్నెలకంటివారు నెల్లూరి వారు; కొండవీటిసీమకు వెళ్లియుందురు. బెల్లము కొండ సిద్ధననివాసమేమో. జక్కన జన్నయ సిద్ధమంత్రిని—

"శ్రీమద్బెల్లముకొండశైలకృపా
    శ్రీనిత్యసామ్రాజ్యల
క్ష్మీమాధుర్యస్ఫూర్తిహోంతరాంతరసదా
    కేళీనటన్నందన
స్తోమాశేషవిశేషరత్నకళికా
    శుంభద్విభూషాసాక్షీ
సామగ్రీకృతలోచనోత్సవలస
    త్సౌభాగ్యభాగ్యోదయా."

అని వర్ణించినాడు. బెల్లముకొండ ప్రాంతము విజయనగరాధీశుల వశమయిన పిదప ఈ వెన్నెలకంటివారు విజయనగరాధి

పతుల కొలువులో చేరి వారి కాశ్రితులై యుందురు.

జన్నయయు, అతని కుమారుడు సిద్ధనయుగూడ దేవరాయమహారాయల కాలములో నున్నవారే. జన్నయ రసికత్వమున దేవరాయల దయ సంపాదించినాడట. ఆ మహారాజు మెచ్చుకొనునట్లు పద్యము లేమయిన జెప్పెనేమో. జన్నయకొడుకు సిద్ధన దేవరాయమహారాయల మంత్రి వల్లభచామనామాత్యునివల్ల చామర, ఛత్ర, శిబికాదిసకలభాగ్యచిహ్నములను బడసెనట. సిద్ధన "శ్రీకర్నాట మహామహీశ్వరసదాసేవాప్రదానోత్తము" డని ప్రస్తుతు డగుటవలన దేవరాయలు విజయనగరాధీశ్వరు డన్నది నిక్కము. మనము తెలిసికొనవలసిన విజయనగరాధీశ్వరులైన దేవరాయనామాంకితు లిరువు రున్నారు. మొదటి దేవరాయమహీపతి క్రీ. శ. ౧౪౦౬ మొదలు ౧౪౨౨ వరకు పాలించెను. రెండవ దేవరాయలు క్రీ. శ. ౧౪౨౨ మొదలు ౧౪౪౬ వరకు రాజ్యమేలెను. సిద్ధయమంత్రి తండ్రి జన్నయ దేవరాయల కాలములో నుండుటచేతను, జన్నయఅన్న వెన్నెలకంటి సూర్యుడు రెడ్డి వేమనరపాలునికి కావ్య మంకిత మిచ్చుటచేతను వెన్నెలకంటి భాస్కరజన్నయ సోదరులు కోమారెడ్డిదేవరాయలకాలములో నుండినట్లు సువిదిత మగుచున్నది. భాస్కర, జన్నయలు సోదరులుగనుక వారి కాశ్రయ మిచ్చిన వేమ, దేవరాయనృపతులును సన్నిహితకాలమువారే కావలెను. కొండవీడు పాలించిన కడపటి ఇరువురు రాజులును పెదకోమటి వేమ, రాచవేము లనియే కాని వట్టి వేము లని వ్యవహారము లేకపోవుటచేత రెడ్డివేముడు ప్రోలయవేమ, అనవేములలో నొక్కడైయుండనలెను. ఏ వేము డయినను వారికి సన్నిహితుడు మొదటి దేవరాయలే; రెండవ దేవరాయలు కాడు. మొదటి దేవరాయలు రెండవ హరిహరరాయల కొడుకు. ఇతడు విజయనగరసింహాసనమును క్రీ. శ. ౧౪౦౬ లో అధిష్ఠించి రాజ్యము పాలించినను అంతకు పూర్వ మూరక యుండలేదు. విజయనగరాధీశ్వరులకు నెల్లూరుజిల్లాలోని ఉదయగిరి 'మొదలిదుర్గము', ప్రధాన మయినది. మొదటి హరిహరరాయల సోదరుడు మొదటి బుక్కరాయమహీపతికాలము నుండియు విజయనగరరాజకుమారులే ఉదయగిరిదుర్గాధిపతులుగ నుండుచువచ్చిరి. విజయనగరసింహాసన మధిష్ఠింపకపూర్వము హరిహరరాయతనూభవుడు మొదటి దేవరాయలు ఉదయగిరిదుర్గమున కధిపతియై తన తండ్రికాలమున తత్ప్రాంతభూమిని పరిపాలించెను. ఉదయగిరిరాజ్యమున మొదటి దేవరాయల శాసనములు క్రీ. శ. ౧౩౭౨నుండి కానవచ్చుచున్నవి. ఉదయగిరిరాజ్యాధిపతిగా నున్నకాలములో దేవరాయలు ఎందరో కవులకు, పండితులకు ఆశ్రయ మిచ్చి, వేదశాస్త్రపారంగతుల కొందరికో అనేకాగ్రహారములు దానము చేసెను. క్రీ. శ. ౧౪౦౪లో తండ్రి రెండవ హరిహరరాయలు చనిపోవువరకు మొదటి దేవరాయ లీ యుదయగిరివర్గమునకే అధిపతిగా నుండెను. ఈతడు క్రీ. శ. ౧౩౯౧లో దానముచేసిన ప్రెగళ్లపాడు అగ్ర

హారదాన శాసనమును[4] వ్రాసినది పదవాక్య ప్రమాణజ్ఞుడయిన భట్టబాణకవీశ్వరు డట. ఈ భట్టబాణుడు తరువాత పెదకోమటి వేమారెడ్డి యాస్థానము నలంకరించిన వామనభట్టబాణు డయియుండునా యని సందియము పొడముచున్నది. ఈ విషయ మెట్లున్నను మొదటి దేవరాయలు విజయనగరరాజ్యపదారూఢుడు కాకపూర్వము ఉదయగిరిదుర్గాధిపతియై సముద్రతీరస్థ దేశము నేలుచుండె నన్నది నిర్వివాదము. క్రీ. శ. ౧౩౭౭ నాటి ఈతని శాసన మొకటి[5] పాటూరులో నున్నది. ఈ పై విషయముల ననుసరించి చూచినచో జన్నయను, అతని కొడుకు సిద్ధయను ఆదరించినది మొదటి దేవరాయ లనుటకు సందియము లేదు. దేవరాయలు ఉదయగిరిదుర్గాధిపతిగ నున్న కాలములోనే సిద్ధన అతని కొలువులో నుండెను. అందువలన సిద్ధనకు కృతియిచ్చిన జక్కనకవికూడ క్రీ. శ. పదునాల్గవశతాబ్ది చివర నుండినట్లు చెప్పవచ్చును.

దేవరాయమహీపతిమంత్రి చామనవల్లయ, అనగా వల్లభయకుమారుడు. జన్నయసిద్ధన ఇతనివలననే ఎన్నో భాగ్యచిహ్నములు బడసినాడు. నెల్లూరుజిల్లా కనిగిరి తాలూకా ఉప్పలపాడులోని దేవరాయలశాసనమున[6] సిద్ధడు పేర్కొన బడినాడు. ఈ శాసనకాలమును దెలుపు సంవత్సరము పోయినది. దేవరాయల మంత్రి చామనామాత్యుడుకూడ ఈ ప్రాంతముననే పారుపత్యము నెరపుచున్నట్లు ఈ శాసనము వలన విదిత మగుచున్నది.

4. Mack. Mss., No. 15-4-17.
5. Mack. Mss , No. 15-3-8.
6. N. D. I., Kg. No. 40, p 693.



# కీ. శే. శ్రీ దుగ్గిరాల వెంకటసూర్యప్రకాశరావు

●

## శ్రీ పెండ్యాల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి

వీరి తండ్రిగారు శివపరదేశిరాజుగారు. వీరి స్వగ్రామము రామచంద్రపురము. వీరు కాకినాడలో (రక్తాక్షి సం. మార్గశిర్ష బ. ౨) జన్మించిరి. అచటనే స్వర్గస్థు (సర్వధారి వైశాఖ బ. ౧౧) లైరి. ఆరంభ విద్యాభ్యాసము స్వగ్రామముననే పొంది చిన్నతనమున



కీ. శే. శ్రీదుగ్గిరాల వెంకటసూర్యప్రకాశరావు

జననము 14-12-1864] [మరణము 2-6-'48

నస్వస్థు లగుటచే పదునాలుగవయేటగాని రాజమహేంద్రవరము చేరి, యాంగ్లవిద్య నభ్యసింపలేకపోయిరి. అట క్రమముగా, ఆర్ట్సు కాలేజియందు ప్రసిద్ధికెక్కిన ప్రిన్సిపాల్ మెట్కాఫ్‌దొరగారికిని, రావుబహద్దూర్ వీరేశలింగంపంతులుగారికిని ప్రియశిష్యులై బి. ఏ. పరీక్షయం దుత్తీర్ణులైరి. పిమ్మట ౧౮౯౫ ప్రాంతమున కాకినాడకలెక్టరుకచేరియం దుద్యోగము స్వీకరించి ట్రెజరీడిప్యూటీకలెక్టరుకచేరియందు హెడ్ అక్కౌంటెంటుపనితోనే సేవకవృత్తిని ముగించిరి. కాని దేశసేవచేయుటయందలి యత్యభిలాషచే నున్నతోద్యోగములకు తగిన ప్రయత్నములు చేయక నియమితకాలమునకు పూర్వముననే ఉద్యోగమునుండి విరమించి, ౩౬ సం. లు నిరంతరదేశసేవాపరాయణులైరి.

### విద్యాపాటవము

ప్రకాశరావుగారు మెట్కాఫ్ దొరగారికడ నాంగ్లవిద్యను, వీరేశలింగంపంతులుగారికడ నాంధ్రభాషను నేర్చినవారగుటచే, పై రెండుభాషలలోను అనర్గళముగా, గంటలకొలది యుపన్యసించుటకును, సునిశితముగా పెక్కు విషయములనుగురించి భావగంభీరముగా వ్రాయుటకును తగిన శక్తిసంపత్తి కలవారైరి. చదువుకొను కాలముననే 'హిందూ జనసంస్కారిణి' యను మాసపత్రికకు చిన్నచిన్న సంఘసంస్కారవ్యాసములను వ్రాయుచుండెడివారు. ఉద్యోగకాలమునందు కలెక్టరుకచేరియం దుండిన పెద్ద లైబ్రరీలో గల పుస్తకముల నన్నింటిని వీరు చదివియున్నారు. ఇందులకు నా యనుభవమున గల్గెరెండు నిదర్శనములు :

౧. వేశ్యల వారసత్వపు హక్కువిషయమై యొకప్పుడు గవర్నమెంటువారు ప్రతి డి. కలెక్టరును అడుగుచు సర్క్యులర్ వ్రాయగా, గో. డి. కలెక్టరు ఈ యంశములు సర్ ఆర్. వేంకటరత్నం నాయుడుగారికి తెలియునని వారి నడిగెను. అందులకు వారు తమ కీయంశము తెలియ దనియు, ట్రెజరీడిప్యూటీ కలెక్టరు ఆఫీసు హెడ్ అక్కౌంటెంటు డి. వి. ఎస్.

ప్రకాశరావుగారి వద్దగల తెలివి గలదనియు చెప్పిరట. అప్పుడు కలెక్టరు ప్రకాశరావుగారిని రప్పించి యడుగగా వారు పూసగ్రుచ్చినట్లు ఆయంశములు చెప్పి, ఆ కచేరీయందే గల పుస్తకములు తీసి చూపిరట. ఇట్లే మఱియొకటిరెండంశములలో కలెక్టరునకు సందేహము వచ్చినపుడు తాబేదారులయిన డిప్యూటీ కలెక్టరుల నడిగియు, సర్ ఆర్. వేంకటరత్నంనాయుడుగారి నడిగియు సమాధానములను పొందలేక తుదకు ప్రకాశరావుగారినే యడుగగా, వారు గ్రంథ నిదర్శనములతో సమాధానముల నిచ్చుచుండగా చిన్న యుద్యోగులపై నిర్లక్ష్యభావము గల కమింగ్ అను కలెక్టరొకప్పుడు ప్రకాశరావుగారిని పిలిచి "నీ కింత తెలివి యేలాగు వచ్చిన?"దని యడిగిరట. అందులకు ప్రకాశరావుగారు "నాకు తీరుబడి యైనపుడెల్ల మన లైబ్రరీలోని పుస్తకములను చదువుటయే పనిగా నుందును. కాన నాకీ యంశములు తెలిసినవి" అని చెప్పగా నత డాశ్చర్యపడెనట.

౨. ఒకప్పుడు నాకు పాలమూరు (రామచంద్రపురం తాలూకా) గ్రామమున నొకరు భూమిని త్రవ్వుచుండగా దొరకిన రాగిశాసనములు లభించినవి. ఆ శాసనములు చదువుట యెట్లా యని నేను పెక్కండ్ర నడిగితిగాని, వారెవరును సమాధానము చెప్పరైరి. ఈ యంశమునుగూర్చి ప్రకాశరావుగారి నడుగగా వారు కలెక్టరు కచేరీయం దుండిన 'బర్నెల్సు సౌత్ ఇండియన్ పేలియాగ్రఫీ' అను పుస్తకమును తెప్పించి నాకు ప్రాచీనలిపిజ్ఞానము కలిగించిరి. అంతట నేను వారితో కలిసి పెక్కు శాసనములను శోధించి ప్రకటింపగలిగితిని. ఇంతమాత్రమే కాదు. ప్రకాశరావుగారు పెక్కువందల ప్రాచీనపు నాణెములను సంపాదించి ఆంధ్రాయూనివర్సిటీ మ్యూజియమున కిచ్చిరి.

## వ్రాత విశేషములు

ప్రకాశరావుగారు హిందూపత్రికకును, ఆంధ్ర, రవి, కృష్ణాపత్రికలకును పెక్కు సంవత్సరములు విశేషరులుగా నుండిరి. ఒకప్పుడు డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు నేనుండగనే ప్రకాశరావుగారి యింటికి వచ్చి, "మీరు ఇర్రిగేషనువిషయమై హిందూపత్రికకు వ్రాసినదానిని ఆంధ్రీకరించి ఆంధ్రపత్రికలో వ్రాయుచున్నారా? లేక ఆంధ్రపత్రికలోదానిని ఆంగ్లీకరించి హిందూలో వ్రాయుచున్నారా? నాకు భేదము కనుపించలేదే!" అనిరి. వారు ఒకప్పుడు బిపిన్ చంద్రపాల్ గారి 'న్యూ ఇండియా' పత్రికకు ఆంధ్రకవుల స్వాతంత్ర్యమునుగురించి వ్రాసిన వ్యాసములనుచూచి, ప్రకాశరావుగారలహోబాగు వెళ్లినపుడు, సి. వై. చింతామణిగారింట వారుండగా సర్ తేజబహదూర్ సప్రూగారు చింతామణిగారింటికి వచ్చి సంభాషించుటలో ప్రకాశరావుగారి నెఱిగి "మీరు న్యూఇండియాకు వ్రాయుచుండినవ్యాసములను చదువుచుంటిని. అవి చాల బాగున్నవి. వానిని మా హిందూస్థాన్ రివ్యూ పత్రికకు దయచేసి వ్రాయండి" అని కోరిరట. పిమ్మట ప్రకాశరావుగారు కొన్ని వ్యాసములను హిందూస్థాన్ రివ్యూపత్రికకుకూడ వ్రాసియుండిరి. అమృతబజార్, మాడరన్ రివ్యూ, బెంగాలీ, మెస్సెంజర్ అను కలకత్తాపత్రికలకును, స్పెక్టేటర్, సోషల్ రిఫార్మర్ మొదలగు బొంబాయిపత్రికలకును పెక్కుసారులు పెక్కువిషయములనుగూర్చి వారు వ్యాసములు వ్రాసిరి. ఆంధ్రదేశమునందలి ప్రసిద్ధికెక్కిన మాస వారపత్రికలలో (పదేండ్లకు పూర్వము) వారి వ్యాసము లేని పత్రికయే యుండ దని నా నమ్మకము. ఒకప్పుడు వారియింట గల గుండ్రబల్లపై వివిధములగు పందొమ్మిది పత్రికలను నేను చూడగల్గితిని.

## గ్రంథపరిశీలనము

ఆంగ్లభాషయందు గల నాల్గువేదములను, ఉపనిషత్తులను, గృహ్యశ్రౌతధర్మసూత్రములను వారు బాగుగా చదివి యవగాహనముచేసికొనియుండిరి. నేనొకప్పుడు వ్యవసాయచరిత్రమును వ్రాయబోవుచు, వేదములందు వ్యవసాయాంశము లెచట నున్నవో నాకు తెలియ వని ప్రకాశరావుగారి నడుగగా, వెంటనే వారు తమదగ్గర నున్న అథర్వణవేదము (గ్రిఫిత్ ఆంగ్లీకరణము) తెచ్చి ౧౩-౧౮ కాండలను తీసి యా యంశములను వినిపించిరి. ఇట్లే మఱొకప్పుడు గృహ్యసూత్రములకు సంబంధించిన యంశములందు నేను కొట్టుమిట్టాడుచుండగా, వారు మాక్సుముల్లర్, ఎల్లియట్

మొదలగువారి యాంగ్లీకరణభాగములను చదివి విని పింపగా, నేను సంస్కృతమున భాష్యములలో పైయంశములను చదివియు, వారి ఉపదేశమువలన నితర వేదభాగములను—ఆంగ్లీకృతములను చదివించి సంస్కృతమున భాష్యములను చదివియు, వ్యవసాయ చరిత్ర, రైతుచరిత్ర అను రెండు గ్రంథములను రచి యింపగలిగితిని. నా రైతుచరిత్ర ఆంగ్లీకృతమై డాక్టర్ సిల్లటోర్ (అహమ్మదాబాద్) గారి దృష్టి నాకర్షిం చుటకుగూడ ప్రకాశరావుగారే హేతు వని నమ్ముచుందును. ప్రకాశరావుగారు పద్యరచనము చేయ గలిగియుండియు, తమకంటె మిన్నగ పద్యరచనము చేయగల రని శ్రీ శృంగారకవి సర్వారాయుడు, ఆది పూడి సోమనాథరావుగార్లచే కఠ, కేన, ఈశావాస్య ఉపనిషత్తులను పద్యకావ్యముగా చేయించి, ఆ యుపని షత్తులపై యూరపు అమెరికాదేశములలో గల పండి తులకు గల యభిప్రాయములను క్రోడీకరించి, విపుల మగు పీఠికలను వ్రాసి ప్రకటించిరి. మరియు 'ధుని, వార్జిముల్లర్' అను సాంఘికవిషయములగు చిన్న చిన్న గ్రంథములనుకూడ వ్రాసియున్నారు. ఇంత మాత్రమే కాక, గోదావరిడిస్ట్రిక్టు ఎసోసియేషను తర పున గొప్ప లైబ్రరీ నేర్పాటుచేసి బహువిధగ్రంథము లను సమకూర్చుటయే కాక కీ. శే. పోలవరం రాజా గారి రూ. ౨౦,౦౦౦ చేయు లైబ్రరీనిగూడ దీనికి చేర్పింపగలిగిరి. తమ సొంతలైబ్రరీనంతయు నా పుస్తక భాండాగారమునకు చేర్చిరి. పెక్కేండ్లు డిస్ట్రిక్టు ఎడ్యుకేషనల్ కౌన్సిలున కుపాధ్యక్షులై పెక్కువిధము లుగ ప్రారంభవిద్యాశాలలకు సహాయము కల్పించిరి.

## ఆంధ్రోద్యమము

౧౯౧౩ సం.న బాపట్లయందు జరిగిన ప్రథమ ఆంధ్రమహాసభ అనంతరము ఆంధ్రరాష్ట్ర మేర్పడుటకు తగిన కారణములను నిరూపించుచు, ఆంధ్రదేశపట ముతో కూడ ఆ మహాసభవారు ప్రచురించిన పుస్తక మునందు శ్రీ ప్రకాశరావుగారు తెలుగుజిల్లాలయొక్క ఆర్థికవిషయమై శోధించి పంపిన యంశములనే పైమహా సభస్థాయిసంఘమువారు ప్రకాశరావుగారి పేరు తోడనే ఆ కరపత్రమునందు ప్రకటించియున్నారు. ఈ అంశములు ఆంధ్రపత్రికయొక్క ఒక ఉగాదిసంచిక యందును ప్రకటించియున్నారు. గోదావరిజిల్లా యందు ఒక్క సహకారసంఘమైనను లేని కారణ మున ప్రకాశరావుగారు ఈ సంఘప్రచారమునందు పాటుపడుచుండిన ఆకెళ్ల సుబ్బారాయుడు అనువారిని తీసికొనివచ్చి ప్రతిగ్రామమునందును, వారితోగూడ ప్రజలకు సహకార ప్రాముఖ్యమునుగురించి ఉపన్యాస ముల నిచ్చి బోధించి సహకారసంఘములను స్థాపింప జేయుటయేకాక గోదావరిడిస్ట్రిక్టుబ్యాంకింగు యూని యన్ ౧౩౦ షేర్లతో రూ. ౧౩,౦౦౦ మూలధన ముతో స్థాపింపజేసిరి. అది యిప్పుడు బహువిధముల వృద్ధియై తూర్పుగోదావరిమండలమున నాలుగు ప్రధాన శాఖలు కలదై యున్నది.

## రాజకీయములు

తాము గవర్నమెంటుఉద్యోగిగా ఉండినప్పుడు గోదావరిజిల్లా రీసెటిల్మెంటువిషయమై గంజాం వెంకటరత్నం, కృత్తివెంటి పేర్రాజు, న్యాపతి సుబ్బా రావు, మోచర్ల రామచంద్రరావుపంతులుగార్లకు, లాండురెవిన్యూవిషయకములగు రహస్యాంశములను పెక్కింటిని చెప్పి, ప్రశ్నోపయోగకరములగు విషయములను శాసనసభలయందు పైవారడుగునట్లు చేయుచుండిరి. మద్యపాననిషేధమువిషయమై ప్రకాశ రావుగారు పెక్కువిధములుగా గోదావరిజిల్లా యందలి మునిసిపాలిటీలలోను, పెద్దపెద్ద యుత్సవ ములలోను కొన్నికొన్ని నిబంధనలు కలుగజేయ గలిగిరి. ఒకప్పుడు పోలవరం రాజాగారు శాసన నిర్మాణసభయందు సభ్యులై ప్రకాశరావుగారిని "ఏ యంశమునుగురించి యీ శాసనసభయం దుపపాదింప వలయు"నని యడుగగా శ్రీప్రకాశరావుగారు "మీరు మద్యపాననిషేధమునుగూర్చిన యంశముపై కొన్ని ప్రశ్నలు వేయవలయు"నని హాలెండుదేశపు (క్రొంప రెన్సు) మితపానాంశమును చదివి వారికి చెప్పి శాసన సభయందు వా రా యంశము నుపపాదించునట్లు ప్రోత్స హించిరి. ఆకాలమున 'మధుకులు' అను ప్రసిద్ధికెక్కిన పై రాజాగారు ఈ ప్రశ్నలను శాసనసభయందు వేయగా సభ్యులందరును విరవిగ నవ్వి.రని పత్రికలలో కలదు.

కాని యందువలన రాజాగారు తమయొక్క దోష మును చాలవరకు తగ్గించుకొని రని వాడుక కలదు. ప్రకాశరావుగారు నల్లమందునిషేధమునుగూర్చి బ్రేకర్ కమిటీలో మెంబరై ప్రసిద్ధిచెందిన రివరెండు ఆండ్రూస్ గారితో మాటలాడి బహువిధములగు ఉపయోగాంశ ములను సమకూర్చిరి.

గోదావరిజిల్లాకు సంచారముగా వచ్చిన మొత్తము నకు ఆరుగురు గవర్నర్లయెదుట రైతుల కష్టసుఖము లను నివేదించుటకు జిల్లాసంఘముపక్షమున తాము స్వయముగా నివేదించియు, ఇతరులచే నివేదింప జేసియు విశేషలాభము రైతులకు కలుగునట్లు చేసిరి. ఇర్రిగేషనుఅడ్వయిజరీబోర్డును తూర్పుగోదావరి జిల్లాలో స్థాపించుటకు గవర్నమెంటువారిని వత్తిడి చేసి, అది నామినేటెడ్ బోర్డుగా నున్న దానిని క్రమ ముగా ఎలెక్షనుబోర్డుగా మార్పించి, దానికి వారే పెక్కేండ్లు అధ్యక్షులుగా నెన్నుకొనబడి రైతులకు బహువిధముల ఉపకారములు కలుగజేయించిరి. కుండతూరలు, లంకపడుగై భూములు, మైనర్, మేజర్ ఇర్రిగేషన్ విషయములనుగురించియు, పోలండు, పోలవరం ఇర్రిగేషనుస్కీమునుగురించియు బహు విధములుగ పాటుపడి రైతులకు మహోపకారము లొనర్చిరి. ఇందులకు మోచర్ల రామచంద్రరావుపంతులు గారు వీరికి చాల సహాయపడిరి. వా రుభయులును ముప్పదేండ్లనాడే ప్రతిపాదించిన కోరంగిప్రాజెక్టు ఇంకను రాకపోవుట విచారకరము. కాని దాని కిపుడు ఆర్డరుఅయినట్లు వినుచున్నాము. రైతులకు ప్రకాశరావుగా రొనర్చిన మహోపకారమునకు కొన్నియేండ్లనాడు పై రైతులు ప్రకాశరావుగారి ఛాయాపటమును కాకినాడటౌన్‌హాలునందు ఆంధ్ర భీష్మ న్యాపతిసుబ్బారావుపంతులుగారి యధ్యక్షతను గొప్ప సభ చేసి నెలకొల్పిరి. ఆ సమయమున సుబ్బా రావుపంతులుగారు శ్రీ ప్రకాశరావుగారి ప్రతిభను ప్రశంసించుచు, "ఏ యంశములనుగురించి యడిగినను ప్రకాశరావుగారు చెప్పినట్లు గ్రంథనిదర్శనముగా నెవరును చెప్పజాలరు. కాన వీరు జంగమ పుస్తక భాండాగారము (Moving Library)" అని పొగడి యున్నారు. ఆసమయముననే దివాన్ బహద్దూర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణ మూర్తి నాయుడుగారు కాకినాడ మునిసిపాలిటీకి ప్రకాశరావుగా రొనర్చిన యుపకారమును, వారికి తమకు గల మైత్రీవిశేష ములను పెక్కువిధములుగ చెప్పియుండిరి. అట్లే సర్ ఆర్. వేంకటరత్నంనాయుడుగారును ప్రకాశ రావుగారి ప్రతిభావిశేషములనుగూర్చి పొగ డిరి. ఉభయగోదావరీమండలములకును ఆనకట్టల ద్వారా నీరు నిప్పించి, అపరవరుణదేవు డని పొగడ్త గన్న సర్ ఆర్థర్ కాటన్ దొరగారికిని, వారికి కుడిభుజముగా పనిచేసిన రావుబహద్దూర్ వేణువీరన్న గారికిని స్మారకచిహ్నములుగా ధవళేశ్వరము, బొబ్బ ర్లంక, శెట్టిపేటలయందు శిలావిగ్రహాదులను నెలకొల్ప జేసిరి. మరియు, పైవారి పేరుతో వసూలుచేసిన ఫండుతో ఆంధ్రాయూనివర్సిటీలో కొన్ని స్కాలర్ షిప్పులు ఇచ్చునట్లు ఏర్పాటుచేయించిరి. ప్రకాశ రావుగారియందొక దోషమును పెక్కండ్రధికారులు ఎన్నుచుండుట కలదు. అదేదనగా "ఏ డిపార్టుమెంటు నందయినను వారు జోక్యము కలుగజేసికొనినప్పుడు అందలి వ్యక్తులయొక్క ప్రజావ్యతిరేకమయిన లోప ములను బైటపెట్టుదురు" అని. ఇందులకు నా అను భవమునందలి చిన్న నిదర్శనము—

నే నొక ఎలిమెంటరీస్కూలునం దుపాధ్యాయు డనై యున్నకాలమున (మేడపాడు) ప్రకాశరావు గారు నన్ను జూడవచ్చి నా స్కూలునుకూడ చూచిరి. ఆ స్కూలునందు పిల్లలు బల్లలు లేక చెమ్మనేలయందే కూర్చుండుటయు, దానికి చుట్టును మురికిగుంట లుండు టయు చూచి "మీ పైయధికారులు స్కూలున కెప్పుడును రాలేదా?" యని ప్రశ్నింప "వత్తురు గాని, యీ యంశములను వారు గమనింపలే"దని యుపాధ్యా యుల మంటిమి. అది కని వారు తాలూకాబోర్డుప్రెసి డెంటుగారికి, డి. యి. ఓ. గారికి స్కూలుయొక్క దౌర్భాగ్యస్థితిని వ్రాయగా వారు దానికి తగిన యుప కార మప్పుడు చేయరైరి గాని ప్రకాశరావుగారు నా యింటికి వచ్చినందుకును, నేను స్కూలును వారికి చూపించినందులకును వారు నాపై కోపోద్రేకు లైరి.

అది ప్రకాశరావుగారికి చెప్పగా, సర్ ఆర్. వేంకటరత్నం నాయుడుగారికి సిఫార్సుచేసి, పి. ఆర్ కాలేజీలో పండితునిగా నన్ను నియమింపజేసిరి. మరియు ఇట్లని ఉద్యోగులయొక్క నేరముల నెన్నుటయే కాదు, అన్యాయముగా ఉద్యోగులకు ప్రజలవలనను, పైయధికారులవలనను బాధలు కలిగినయెడల తగిన నివారణోపాయములనుగూడ చేయుచుండిరి. దీనికి నిదర్శనము: ఒకప్పుడు కాకినాడ కలెక్టరుకచేరీయం దుండిన డఫేదారు ఏదియో కారణముచే విస్తారము కాలము సెలవుపెట్టగా దానిని సాకుగా గొని పైయధికారులు వాని ఉద్యోగము తీసివేసిరి. దానికై ఆ డఫేదారు మద్రాసు గవర్నమెంటుకు వ్రాసికొనియు తగిన ఫలమును పొందలేకపోయెను. ఆకాలమునందు ఉద్యోగమునందుండిన ప్రకాశరావుగారు డఫేదారుకు కలిగిన అన్యాయస్థితిని చూచి, ఆ డఫేదారు సెంట్రల్ గవర్నమెంటుకు సంబంధించిన కొన్ని అంశములు కలవాడుగా ఉండుటచే వానికి అప్పటి గవర్నరు జనరలుఅయిన లార్డు కర్జన్ గారికి అర్జీయిచ్చుకొనునట్లు ఉపాయము చెప్పిరి. పరిపాలనాదక్షు డని ప్రసిద్ధికెక్కిన లార్డు కర్జన్ ఆ స్వల్పసేవకునకు జరిగిన అన్యాయమును బాగుగా పరిశీలించి, మదరాసు గవర్నమెంటుద్వారా వాని ఉద్యోగమును స్థిరపరిపించియు, వెనుకటినుండి రావలసిన గతఫలము ఇప్పించియు వానికి మేలొనర్చెను. ఇది ప్రకాశరావుగారి ఆలోచనాసహాయమే. ఇట్టివి పెక్కులు రాజకీయాంశములు కలవు.

## దే శ సం చా ర ము

ప్రకాశరావుగా రుద్యోగిగా నుండినప్పుడు ప్రతి కాంగ్రెసునకును సంఘసంస్కరణసభాపతుమున సభ్యులై ఆ మిషతో విజిటరుగా కాంగ్రెసుసభలో ప్రవేశించి అందలి యంశములను తెలిసికొనుచుండిరి. ఉద్యోగమును విరమించిన పిమ్మట సభ్యుడుగా ౧౯౨౧ సంవత్సరం నాన్ కోఆపరేషనువరకు వెళ్లుచుండిరి. అందువలన లాహోరు మొదలు భరతఖండమునందలి ప్రతిముఖ్యపట్టణమును, వీరు చూచి, యందలి ప్రముఖుల పరిచయము సంపాదించిరి. ౧౮౯౯ సం॥లో లక్నో కాంగ్రెసునందు ప్రెసిడెంటు అయిన ఆర్. సి. దత్తు వీరి పరిచయముచేతనే కాకినాడకు వచ్చి గంజాం వెంకటరత్నంగారి యతిథులుగా నుండియు, ప్రకాశరావుగారివలన గోదావరి జిల్లా రైతులయొక్క వివిధవిషయములను తెలిసికొనగలిగిరి. ఆ కాలమున గవర్నమెంటు ఉద్యోగి కాంగ్రెసు ప్రెసిడెంటున కాతిథ్య మిచ్చిన కష్టమును పొందువాడగును. అందువలన ఆర్. సి. దత్తుగారు నేకమాత్రమే ప్రకాశరావుగారి యింటికి వచ్చిరి. ౧౯౧౨ బాంకిపూర్ కాంగ్రెసునకు ముధోల్కర్ ప్రెసిడెంటుగా నుండగా ఆంధ్రులు సైన్యమునందు చేరుట యను విషయముపై రావుబహద్దర్ చింతలపాటి నరసింహరాజుగారు, ప్రకాశరావుగారు ఇచ్చిన యుపన్యాసములను విని గోఖ్లేగారు ఆజానుబాహువులు, తేజస్వులు నగు వీరిద్దరిని భీష్మద్రోణులవంటివా రని చెప్పిరట. పైవిధముగా కాంగ్రెసునకు, సంఘసంస్కరణసభలకు మెంబరుగా దేశసంచారము నొనర్చుటచే రనడే, రామకృష్ణభండార్కర్, తిలకు, గోఖ్లే, బరోడామహారాజా, మాలవ్యా, మోతీలాల్ ఘోష్, సురేంద్రనాథ్ బెనర్జీ, సర్ సుబ్రహ్మణ్య అయ్యర్, ఆనరబుల్ శ్రీనివాసశాస్త్రి, సర్ విజయరాఘవాచారి, సర్ సప్రూ, చింతామణి మొదలగు ప్రముఖుల స్నేహము, ఉత్తర ప్రత్యుత్తరములు కలుగుచుండెడివి.

## స్వాతంత్ర్యాభిలాషము

ప్రకాశరావుగారు మనస్సును చంపుకొని యెప్పుడును ప్రవర్తింపలేదు. వారు తమ స్వాతంత్ర్యమును కాపాడుకొనునట్లే ఇతరుల స్వాతంత్ర్యమును కాపాడుట కడ్డుపడువారు కారు. ప్రకాశరావుగారు ప్రఖ్యాతలేఖకు లని అందరకును తెలియును. ఒకప్పుడు కాకినాడడిస్ట్రిక్టుకలెక్టరుచర్యపై 'హిందూ' పత్రికలో గాఢమగు విమర్శనము వెలువడగా దానిని చూచి, ప్రకాశరావుగారి ప్రతికక్షులు, ఈ వ్యాసమును ప్రకాశరావుగారే వ్రాసిరని కలెక్టరున కనేకనేరములతో చెప్పగా, కలెక్టరు కోపోద్రిక్తుడై ప్రెజరీ

డిప్యూటీకలెక్టరు ఆఫీసునకు వచ్చి, ప్రకాశరావు గారిని పిలిచి, "నీ వీ వ్యాసమును వ్రాయలేదా?" అని భీకరముగా పలుకగా, ప్రకాశరావుగారు నిర్భీతితో "నేనీ వ్యాసమును వ్రాయలేదు. ఒక పావులావు కాగితము నిచ్చిన, నా ఉద్యోగమునకు రాజీనామా నిచ్చి మీవలెనే భీకరముగా సంభాషింపగల" నననటం. డిప్యూటీకలెక్టరుగారును వారి స్వాతంత్ర్యమున కాశ్చర్యపడిరట. పిమ్మట కొన్ని దినములకు ఆ కలెక్టరే ప్రకాశరావుగారిని పిలిచి, "మీరు వ్రాసి రనుకొన్న వ్యాసము మరియొకరు వ్రాసినట్లు రుజువైనది. మి మ్మానాడు గద్దించి మాటాడినందుకు చాల విచారించు చున్నా"న ననటం.

ప్రకాశరావుగారు తమ స్వాతంత్ర్యమెంతటిదే ఇతరుల స్వాతంత్ర్యము అని తలచుచుండువారు. ఇందులకు పెద్ద నిదర్శనము ఆంధ్రదేశమున ప్రసిద్ధ సనాతనధర్మప్రచారకులలో కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రిగారు ముఖ్యులు. వారు ప్రకాశరావుగారి ఆఫీసులో నెల ౧౫ రు ౮ం ల క్లర్కు. ప్రకాశరావు గారివలెనే వారును స్వాతంత్ర్యాభిమానులు. ఆఫీసునం దిరువురును పొరపొచ్చెములు లేక పనులను నెరవేర్చు కొనుచుండెడివారు. కాని సభలలో, పత్రికలలో ఉభయులకు ఖండనమండనము లగుచుండెడివి. 'సత్యవాదిని' అను వీరేశలింగంపంతులుగారి పత్రిక ప్రకాశ రావుగారి వ్రాతలకును, 'ఆర్యమతబోధిని' అను పత్రిక శాస్త్రిగారి వ్రాతలకును నిలయములై యుండెడివి. బ్రహ్మయ్యశాస్త్రిగారి వ్రాతలలో వీరేశలింగంపంతులు గారిని, వారి శిష్యప్రశిష్యులను దూషింపని యంశమే యుండెడిది కాదు. దానిని చూచి ప్రకాశరావుగారి మిత్రులు (రిఫార్మరులు) ప్రకాశరావుగారితో "మీ అసిస్టెంటుక్లర్కు మిమ్ములను, మీపక్షమున నున్నవారిని నిట్లు దూషించుట మీ రెట్లు సహించుచున్నారు? ఏదయినను మిషచే వారిని అణచలేరా?" అనగా ప్రకాశ రావుగారు నవ్వుచు, "నాపనిని న్యాయముగా నెరవేర్చు చుండు వ్యక్తిని యితరవిషయములలో మతమున భేద మొందినంతమాత్రమున కపటముగ లాంగదీయుట యనుచితముకాదా?" అనిరట. బ్రహ్మయ్యశాస్త్రిగారును గుణగ్రాహులు కాకపోలేదు. ఒకప్పుడు, కాకినాడకు గవర్నరు వచ్చినప్పుడు ఇతరకలెక్టరాఫీసులలోని యుద్యోగు లెవరికిని ప్రవేశము లేకుండినను, ప్రకాశ రావుగారు డిస్ట్రిక్టుకలెక్టరుతో మాటలాడి తన ఆఫీసులోని క్లర్కులకు గవర్నరున కొనర్చు వినతిపత్రాదులను వినుటకును, చూచుటకును అవకాశము కలుగ జేయగా, నపుడు బ్రహ్మయ్యశాస్త్రిగారు ప్రకాశ రావుగారిని మిక్కిలి స్తుతించిరి.

మరియు బ్రహ్మయ్యశాస్త్రిగారు తాము రచించిన పెద్దాపుర సంస్థానచరిత్రలోని కొన్ని యంశములను గూర్చి ప్రకాశరావుగారి సలహా నడుగుచుండుట నాకు తెలియును. ఉదారహృదయుల లక్షణము లిట్టివే కదా! నేను వ్రాసిన భారతచరిత్రకు సనాతనధర్మ విరుద్ధమని యనుకొనుచుండువారు నిరసనమును చూపుచుండుగగాని, పై బ్రహ్మయ్యశాస్త్రిగారు, ప్రకాశరావు గారుకూడ అనేకవిధములగు గ్రంథాంశములకు నాకు తోడ్పడిరి. మరియు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు నాపై తెచ్చిన మానవష్టపు ఫిర్యాదులో పై యుభయులు నాపక్షమున సాక్షులుగా వచ్చుటకూడ కొందరికి ఆశ్చర్యము గొల్పుచుండెడిది. వారు విశాలహృదయులగుటచేతనే యిట్లు నాపక్షమునకు వచ్చిరని నేను తలచుచుందును.

## సాంఘికము

కాకినాడయందు నిమ్నజాతులకు కళాశాలా ప్రవేశము కలుగని కాలమున వారికి మూడు పాఠశాలలను 'వివేకానందపాఠశాలలు' అను పేరుతో ప్రారంభించి, ౧౯౧౧ వ సంవత్సరమున పి. ఆర్. కాలేజియందు సర్ ఆర్. వేంకటరత్నం నాయుడు గారి ప్రోత్సాహముచే హరిజనులకు ప్రవేశము కలుగ జేసిరి. క్రైస్తవులకు, మహమ్మదీయులకు, శెట్టిబలిజలకు వారు అభివృద్ధిపొందునట్లు ప్రోత్సాహకరాంశములను పెక్కు కలిగించిరి. వీరేశలింగంపంతులుగారి శిష్యులగుటచే వితంతూద్వాహవిషయమై పెక్కువిధములగు ప్రోత్సాహములను కలిగించియు, వితంతువులను, విధురులను తమయింటనే పెక్కుదినములు నివసింపు

జేసియు పెక్కండ్రు వితంతూద్వాహములకు ధన సహాయము చేసి ప్రోత్సాహము కలిగించిరి. వీరేశలింగంపంతులుగారి హితకారిణీసమాజమునకు తమ లైఫ్ ఇన్‌షూర్యెన్సువల్ల వచ్చు ధనము (రూ. 3000 లు) నొసగిరి. రామచంద్రపురం హైస్కూలునకు బాలయు విద్యార్థుల వసతిగృహము (Hostel) నిర్మించుటకు విశాలమయిన స్థలము నుచితముగా నిచ్చిరి. పెక్కండ్రు బీదలగు క్రైస్తవబాలురకు విద్యావిషయమున ధనసహాయము చేయుట నాకు తెలియును. కాకినాడలో బ్రహ్మసమాజస్థాపనకై వీరు కారకులై యొనర్చిన యంశము గ్రంథవిస్తరభీతిచే విడిచితిని.

## ఇతర విషయములు

శ్రీ ప్రకాశరావుగారికి దీనులయెడ గల ప్రేమ కొక నిదర్శనము: వారింట ఆకలినపుడు మే మిరువురము జొన్న భుజింప సిద్ధముగ నుంటిమి. అప్పుడొక మాధుకరమెత్తుకొను వృద్ధుడగు దీనుడు గుమ్మముకడ కేకవేయగా, "మన మిరువురము ఈ జొన్న తినుటకంటె ఈజన్మలో దీని రుచి నెరుగని వాని కిడుట యుక్తము కాదా!" యన నే "నవు"నంటిని. అప్పుడా దీనుని లోనికి రప్పించి వానికి మే ముభయులము తినబోవు జొన్నను పెట్టగా, వా డెంతయో యానంద పరవశుడై తినుచు "నిట్టిదానిని నా జన్మలో తిన నెరుగను. ఇది యే"మని ప్రశ్నించియున్నాడు. ఇట్టి వెన్నియో వారి జీవితమున విచిత్రాంశములై యున్నవి. వాటినన్నింటిని వ్రాయుటకు నాకు శక్తి చాలదు. అయినను మిత్రఋణవిముక్తికై నేను వారికి 'ఉత్తరభారతము' అను వచనగ్రంథమును కృతిగా నిచ్చితి నని వారికి చెప్పితినేగాని గ్రంథప్రకటనము కాకుండగనే వారు స్వర్గస్థులగుటకు విచారించుచుందును. వారికి నా గ్రంథము తర్పణప్రాయమగుగాక!

---

# ప్రాచీన ఖగోళము

## ౮. గ్రహములు

(అనువ్యాతము)

శ్రీ వేలూరి శివరామశాస్త్రి

నక్షత్రమండలము క్రిందక్రింద క్రమక్రమముగా వానిక్రింద భూమియు ఉన్నవని ఆర్యభట 1 బ్రహ్మ
శని గురు కుజ రవి శుక్ర బుధ చంద్ర కక్షలును, గుప్తాగులు 2.

| | కక్ష్యా యోజనములు. | భగణభోగవత్సరములు. | ఆధునికమతమున |
|---|---|---|---|
| చంద్ర | ౩౨౪౦౦౦ | ౦.౦౭ | ౦.౦౭ |
| బుధ | ౧౦౪౩౨౦౯ | ౦.౨౪ | ౦.౨౪ |
| శుక్ర | ౨౬౬౪౬౩౭ | ౦.౬౨ | ౦.౬౧ |
| రవి | ౪౩౩౧౫౦౦ | ౧.౦౦ | ౧.౦౦ |
| కుజ | ౮౧౪౬౯౦౯ | ౧.౮౮ | ౧.౮౮ |
| గురు | ౫౧౩౭౫౭౬౪ | ౧౧.౮౬ | ౧౧.౮౬ |
| శని | ౧౨౭౬౬౮౨౫౫ | ౨౯.౪౭ | ౨౯.౪౭ |

(సూర్యసిద్ధాంతః)

1. భానా మధ శ్శనైశ్చరసురగురుభౌమార్కశుక్రబుధచంద్రాః తేషా మధశ్చ భూమి ర్మేఢీభూతా ఖమధ్యస్థా.

2. భగణాన్మ్యూర్ధ్వ శ్శనిగురు భూమిజరవిశుక్రసౌమ్యశశాంకాః, కక్షాక్రమేణ శీఘ్రాః, శ్శనైశ్చరాద్యాః క్రమాచ్ఛైఘ్ర్యాః.

ఈ వరుసలో రవిని తీసి భూమిని పెట్టి రవిని బుధుని క్రిందికి బదలాయించుచో ఆధునికఖగోళవిజ్ఞానముతో సమ్మసరిపోవును.




గ్రహములు గోళాకారములు. వీనికి స్వప్రకాశము లేదు. సూర్యాభిముఖములగు నీ గోళముల సాబాలు సూర్యునిచే వెలుగు పొందును. వీని మిగులు సాబాలు చీకటిపాలు.

కొన్ని గ్రహములు కొంతకాలము దక్షిణముగ నడచును. కొంతకాలము ఉత్తరముగ నడచును. చాల కాలము పడమటగను, తూర్పుగను నడచును. కొన్ని సమయములందు వీని వేగము హెచ్చుచుండును. మరి కొన్ని సమయములందు తగ్గుచుండును. కొన్ని సమయములందు నిలిచిపోయినటు లుండును. ఈ రీతిగా గ్రహగతులు వేరువేరు. ఒక గ్రహము సుమారు మున్నూరు నరువది ఐదునాళ్ళ కొక ప్రదక్షిణము చేయగా మరియొక గ్రహము సుమారు ఆరునూరు పెను బదియేడు నాళ్ళ కొక ప్రదక్షిణము చేయును. దీనిని బట్టి ఒక్కొక గ్రహము దినమున కెంత నడచునో చెప్ప వచ్చునుగాని అది సరియగు లెక్క కాదు. ఏలన, ఏగ్రహమును ఏనాడును సమముగా నడవదు. కావున ఆ సగటు లెక్క చొప్పున చూచినచో ఆ లెక్కచొప్పున వచ్చిన చోటున ఆ గ్రహ ముండదు. కావున విషమ గతులును, విషమప్రదక్షిణములును గల యీ గ్రహములు సరిగా ఏచోట నుండునో తెలుపుటకు ప్రాచీనశాస్త్రజ్ఞులు సుఖబోధకై కథారూపముగా పురాణాదులనుండి అనుస్యూతము లగు కొన్ని ప్రక్రియ లవలంబించి చెప్పిరి. ఆ వివరణ మీ దిగువ:

నక్షత్రములును, గ్రహములును తూర్పున నుదయించి పడమటగా నడచుచున్నవి. గ్రహముల కీ నడకయేకాక పడమటినుండి తూర్పు నడకయు కలదు. దీనికి కారణ మేమి?

## ప శ్చి మ గ తి

'పురాణములు చెప్పిన ఏడు వాయువులలో రెండవ దగు ప్రవహవాయువుచే గ్రహములు మిగుల వేగముగా పడమటికి పోవుచున్నవి. కాని తమ గురుత్వము వలనను, వాయువునల్పత్వమువలనను, అనగా పలుచన యగుటవలనను గ్రహములు చుక్కలకు వెనుకబడును' అని సూర్యసిద్ధాంతము3. ఈ మతమున గ్రహములకు పూర్వగతి లేదు. అది ఉన్నటులు కనబడుటకు కారణము పశ్చిమగమనమునందలి మాంద్యము.

'గిరగిర తిరుగుచున్న కుమ్మరిసారెమీద నున్న చీమ వామముగా నడచుచున్నను అది స్థిరముగా నున్నటులు మనకు కనబడును. అటులే భచక్రపు పశ్చిమగతి శీఘ్రము. గ్రహముల పూర్వగతి మందము. కావున గ్రహములు స్థిరముగా నున్నటులు మనకు కనబడునుగాని వీనికి స్వస్వపూర్వగతి యున్న'దని భాస్కరు డనెను.

## మ ధ్య మ గ్ర హ ము

గ్రహములు భిన్నభిన్నగతులతో పండ్రెండు రాసులను భిన్నభిన్న కాలములలో చుట్టివచ్చుచుండును. ఏ గ్రహ మెన్ని దినములలో పండ్రెండు రాసులను చుట్టివచ్చునో వానినిబట్టి ఆ గ్రహపు దినగతి లెక్కకు వచ్చును. ప్రత్యేక గ్రహము దినగతి సమానము.

---

8. మధ్యమాధికారమునందలి ౧-వ శ్లోకమును, రంగనాథుని టీకయు చూచునది. స్పష్టాధికారమున గల మూడవ శ్లోకము ప్రవహవాయువే గ్రహపూర్వగతికి కారణమని చెప్పుచున్నది.

ఇది వాని మధ్యమగతి. ఈ గతితో గూడిన గ్రహము నకు మధ్యమగ్రహము, లేక మధ్యగ్రహ మని కల్పన. ఇది గణితము కుదురుటకు చేసిన కల్పనగాని మధ్యగ్రహ మని ఒకటి ఉండదు.

## మందోచ్చ, శీఘ్రోచ్చములు

ఏ గ్రహగతియు, ఏనాడును సమానముగా కాన రాదు. ఒకప్పుడు వానిగతి మధ్యమగతికంటె తక్కువ. ఒకప్పు డెక్కువ. గ్రహము తాను తిరుగు దారిలో ఏచోటికి వచ్చుచో దానిగతి మిగుల మంద మయి పోవునో ఆ చోటునకు మందోచ్చ మని పేరు. సూర్య చంద్రులు వినా మిగిలిన గ్రహముల గతి ఏచోటున మిగుల వడి యగునో ఆ చోటు ఆ గ్రహముల శీఘ్రోచ్చ మని పేరు.




సూర్యచంద్రులు తమ మందోచ్చమునకును, కుజుడు మొదలగు నయిదు తారాగ్రహములు తమతమ శీఘ్రోచ్చమునకును వచ్చినచో అపుడు అవి భూమికి మిగుల దవ్వున నుండును. అట్టియెడ గ్రహబింబములు చిన్నవిగా చూపట్టును. అపుడు గ్రహము ఉచ్చస్థ మని చెప్పనగును. గ్రహబింబము పెద్దదిగా కనబడినపుడు గ్రహము భూమికి మిగుల దాపగును. అపుడు గ్రహము నీచస్థ మని చెప్పనగును.




## యామ్యోత్తరగతి

మేషాదినుండి కన్యాంతమువరకును గ్రహము లకు ఉత్తరగతి. తులాదినుండి మీనాంతమువరకును దక్షిణగతి. గ్రహము లన్నియు సాయనమేషాదియందు భూమధ్యరేఖకు సూటిగా నుండు ఖమధ్యరేఖ యగు విషువద్వృత్తమునుండి క్రమక్రమముగా ఉత్తరమునకు జరగుచు వృషభారంభమున ౫+౭=౧౨°, మిథు నారంభమున ౧౨°+౭°=౧౯°. మిథునాంతమున అనగా సాయన కటకాదిని ౧౨°+౭°+౫°=౨౪° ఉండును. ఇది పరమోత్తరక్రాంతి.

పిదప గ్రహము లటనుండి వెనుకకు మరలుచు కటకాంతమున ౨౪-౫=౧౯°, సింహాంతమున ౨౪-(౫+౭)=౧౨°, కన్యాంతమున అనగా సాయనతులా రంభమున ౦° విషువద్వృత్తమున నుండును.

అటుపిమ్మట నవి విషువద్వృత్తము నుండి క్రమ క్రమముగా దక్షిణమునకు జరగి జరగి ౨౪° ఉండును. ఇది పరమదక్షిణ క్రాంతి.

ఇక గ్రహములు అటనుండి వెనుకకు మరలి క్రమ ముగా మకరకుంభమీనములలో సంచరించి సాయన మేషాదికి క్రమ్మర విషువత్తునకు చేరును.

ఇష్టకాలీనగ్రహపు యామ్యోత్తరక్రాంతిని, కటకమకరాదిస్థానముల యందు పరమోత్తరదక్షిణ క్రాంతిని తెలుపునది క్రాంతివృత్తము. ఇది సాయన మేషతులాదిస్థానములయందు విషువద్వృత్తముతో కలిసియుండును.

గ్రహము సాయనమేషాదినుండి కన్యాంతము వరకు ఉత్తరగోళమునందును, తులాదినుండి మీనాం తమువరకు యామ్యగోళమునందును సంచరించు చుండును. అటులయ్యును (పరమోత్తరక్రాంతియగు) సాయనకటకాదినుండి (పరమదక్షిణక్రాంతియగు) సాయనధనురంతమువరకు చేయు (ఆరు రాసుల) సంచా రమునందు ఒకనాటికంటె మరియొకనాడు దక్షిణ ముగా జరగుచుంటచే ఈ కాలమున కెల్ల దక్షి ణాయన మనియు, (పరమదక్షిణక్రాంతియగు) సాయన మకరాదినుండి (పరమోత్తరక్రాంతియగు) మీనాం తమువరకు ఒకనాటికంటె మరియొకనాడు ఉత్తర

ముగా జరుగుచుంటచే ఈ కాలమున కెల్ల ఉత్తరాయణ మనియు వ్యవహారము—'మకరాదిరాశిషట్క ముదగయనం, కర్కటాదికం యామ్యం.' ఇటులు సూర్యుడు మొదలుగా నెల్ల గ్రహములకును దక్షిణోత్తరగమనము కలదు. సూర్యుడు తన దారిని, అనగా క్రాంతివృత్తమున తాను నియతముగా పోవుచుండును. అతనికి ఉత్తరముగగాని, దక్షిణముగగాని విక్షేపము లేదు. కాని చంద్రునకును, మిగిలిన గ్రహములకును క్రాంతివృత్తము నుండి ఉత్తరముగను, దక్షిణముగను విక్షేపము కలదు. అనగా రవిభిన్నము లగు గ్రహములకు యామ్యోత్తర గతి కలుగుచుండును. రవికంటె వేరు గ్రహములు ఏ రెండుచోటుల క్రాంతివృత్తమును భేదించుకొనిపోవుచుండునో ఆ చోటులకు పాత మని పేరు. ఆ రెండు చోటులను రెండు బిందువు లని యందురు. ఈ రెండు బిందువులకును సామాన్యముగా పాత మని పే రున్నను దక్షిణమునుండి ఉత్తరముగా పోవునపు డే గ్రహ మయినను క్రాంతివృత్తమునం దే స్థానము నతిక్రమించునో తత్ స్థానమునకే తద్గ్రహపాత మని ప్రసిద్ధి. రవికి పాతము లే దని చెప్పబనిలేదు. ఇక భిన్నగ్రహముల పాతము భిన్నభిన్నము.

గ్రహముల పూర్వగతి, లేక అనులోమగతి తమ తమ మధ్యగతికంటె ఒకపుడు మెల్లగను, ఒకపుడు వడిగను కనబడును. మరియు గ్రహములు వేళావిశేషములలో నక్షత్రముల నడుమనుండి పడమటగా పోవుటయు కానిపించును. ఈ విలోమగతి కలిగినపుడు గ్రహము వక్రించె నని అందురు. ఈ గతులే కాక రవీతరగ్రహములకు యామ్యోత్తరగతియు కలదు.

## గతివైవిధ్యమునకు కారణము

శీఘ్రోచ్చము, మందోచ్చము, పాతము అను దేవతలు, లేక జీవులు మనకు కనబడని కాలమూర్తులు4. వారు క్రాంతివృత్తము నాశ్రయించుకొని యుండి గ్రహములను తమతమ కక్షలలో తిరుగునటు లొనరించుచున్నారు5. ఉచ్చము అను పేరి దేవత తన కుడిచేతను, ఎడమచేతను గ్రహమార్గమంత పొడవు గల రెండు గాలి పగ్గములను పట్టుకొని ఏ చేతిదాపున కే గ్రహము వచ్చునో ఆ చేతిపగ్గముచే ఆ గ్రహమును తూర్పుగాగాని, పడమటగాగాని స్వాభిముఖముగా లాగుకొనును. ప్రవహము 6 అను వాయువు గ్రహములను సమగతితో తూర్పుగా ప్రేరించును. ఆ గతితోపాటు ఉచ్చదేవత తన దెస లాగుకొను తారతమ్యమును బట్టి గ్రహమొకప్పుడు మధ్యమస్థానమునకు ముందుగను, ఒకపుడు వెనుకగను వెళ్లుచున్నటులు కనబడును. గ్రహస్థానము నుండి తూర్పుదెస నున్న ఆరు రాసులలో ఉచ్చజీవు డున్నచో గ్రహము తూర్పునకును, పడమటిదెస నున్న ఆరు రాసులలో ఉచ్చజీవు డున్నచో గ్రహము పడమటగను ఆకర్షింపబడును. ఈ దెస ఉచ్చచే ఆకర్షింపబడి ఏ గ్రహమయినను తూర్పుగా ఎన్ని అంశ లెక్కువ నడచునో ఆ యంశలను ఆ గ్రహపు మధ్యమస్థానమునకు కలుపవలెను. ఇటులే పడమటగా ఎన్ని అంశలు వెనుకబడునో అన్ని అంశలు వాని మధ్యమస్థానము నుండి తీసివేయవలెను.

సూర్యమండలము గొప్ప దగుటవలన ఉచ్చ దాని నంతగా లాగలేదు. చంద్రమండలము చిన్నదగుటవలన ఉచ్చ దాని నెక్కువగా లాగును. అంగారకాదిమండలము లింకను చిన్నవగుటవలన శీఘ్రోచ్చమందోచ్చములు వానిని చాల దవ్వునుండియే ఆకర్షించును. దానచేసి అంగారకాదులకు ఇంకను వేరయిన వక్రానువక్రగతులు కనబడుచుండును.

---

4. అదృష్టరూపాః కాలస్య మూర్తయో భగణాశ్రయాః,
శీఘ్రమందోచ్చపాతాఖ్యాః గ్రహాణాం గతిహేతవః.

5. గ్రహములు కాలవశమున రాసులలో తిరుగునుకావున ఉచ్చపాతములు కాలమూర్తులని చెప్పబడెను. ఇవి దండపలాదులగు కాలమూర్తులు కావని రంగనాథుడు.

6. ఇది ఏ ప్రవహము? అని శంకించి......ఇది మరయొక ప్రవహము, ఇది గ్రహములను తూరుపుగా తీసికొనిపోవును అని రంగనాథుడు.

## పాతము

గ్రహవిక్షేపగతికి కారణము పాతము. రాహు వను పేరు కల యీ పాతము ఆత్మవేగముచే సూర్యుని కంటె వేరగు గ్రహములను క్రాంతివృత్తమునుండి ఉత్తరమునకుగాని, దక్షిణమునకుగాని త్రోయును. ఇదియే విక్షేపము.

పాతము గ్రహమునుండి పడమటిదెస ఆరు రాసులలో నున్నచో గ్రహమును ఉత్తరముగను, గ్రహమునుండి తూరుపుదెస ఆరురాసులలో నున్నచో గ్రహమును దక్షిణముగను ఆకర్షించును. కాని బుధశుక్రుల పాతము వాని శీఘ్రోచ్చమునకు సంబంధించి పైరీతిగా నున్నయెడల శీఘ్రోచ్చమునుగూర్చి పాత మాకర్షించుటచే బుధశుక్రులకు విక్షేపము సంభవించును. ఈ దెస గ్రహములు ఉచ్చముచేతను, పాతముచేతను ఆకర్షింపబడి పడమటిదెసగా నెల్లప్పుడును వీచుచుండు వాయువుచే ఆఘాతము పొందియు తమ తమ ఆకాశమార్గమున తాము నడచుచున్నవి.

## వేగతారతమ్యము

గ్రహముల తూరుపునడకకు కారణ మేమి? ప్రవహతారత్యముచేతను, గ్రహబింబముమీద దాని ఆఘాతాల్పతచేతను, లేక మరియొక ప్రవహప్రవాహముచేతను గ్రహములు నియతముగా సమగతితో తూరుపుగా పరిక్రమించుచున్నవి. ప్రతిగ్రహమును ప్రత్యహమును పండ్రెండు వేల యోజనములు నడచుచున్నటులు ప్రాచీను లభిప్రాయపడి రని యిచట చెప్ప టావశ్యకము. ప్రాచీనులు భూమినుండి చంద్రుని అంతరము లెక్కవేసి చంద్రకక్ష మూడు లక్షల ఇరువది నాలుగు వేల యోజనము లని స్థిరీకరించి రని వెనుక చూచి యున్నాము. చంద్రు డీ కక్షను ఇరువదియేడుదినముల కొకసారి ప్రదక్షిణించి వచ్చును. కావున చంద్రుడు ప్రతిదినమును పండ్రెండువేల యోజనములు నడచు నని తేలెను. ఇటులే మిగిలిన గ్రహములును పండ్రెండు వేల యోజనములు నడచు నని వారి యభిప్రాయము 7. ఇది గణితముకొరకు కల్పన. కాని గ్రహము లేవియు చంద్రకక్షలో చనవు. ఏ గ్రహము భూమి కెంత దాపో దాని కక్ష అంత అల్పము. అందువలన దాని కక్షా రాశి భాగమును అల్పము. ఇటులే ఏగ్రహము భూమి కెంత దవ్వో దాని కక్షయు, దాని రాశిభాగమును అంత పెద్దవి. ఏ గ్రహకక్ష పుడమికి దాపో ఆ గ్రహ మల్పకాలమున భగణమును చుట్టివచ్చును. గ్రహము లన్నిటిలో చంద్రుని నడక వడి. తరువాత బుధ శుక్ర రవి కుజ గురు శనులు ఒకరికంటె మరియొకరు మందులు. శని అందరికంటె మందముగా నడచుటచే శనికి మందు డని పేరు.

## మధ్య స్ఫుట గ్రహములు

సర్వగ్రహములయు గతి సమాన మగునెడల సర్వ గ్రహములును మధ్యమస్థానమునందే కనబడవలసి యున్నను శీఘ్రోచ్చమందోచ్చాకర్షణభేదముచే నచట కనబడవు. గ్రహము తా నొకసారి రాసులను చుట్టివచ్చు కాలమును బట్టి వచ్చు దినగతియే దాని మధ్యమగతి. మధ్యమగతితో గూడిన గ్రహముపేరు మధ్యమగ్రహము. ఇది కల్పితగ్రహ మని మనకు తెలిసియేయున్నది. ఆకాశమున మనకు కనబడు గ్రహము స్పష్టగ్రహము. మధ్యమగ్రహపు స్థానము మధ్యమస్థానము. స్ఫుటగ్రహపు స్థానము స్ఫుటస్థానము. గ్రహస్థాన మనగా మేషాదిబిందువునుండి క్రాంతివృత్తము నందలి యంతరము. ఈ యంతరమునకు గ్రహ మనియు వాడుక. ఈ విధముగా మధ్యరవి యన్నను, స్ఫుటరవి యన్నను క్రాంతివృత్తమునందలి మేషాదిబిందువునుండి మధ్యస్ఫుటరవుల యంతరము. అది రాశ్యంశకలావికలాదిరూపము.

## మందఫలము

చంద్రుడు భూమిచుట్టు తిరుగును. కావున చంద్రుని భగణభోగకాలము పరిగణించుట సులభము.

---

7. కెప్లర్‌కు పూర్వమువారు 'గ్రహము లన్నియు సమవేగముతో నడచు'నని అభిప్రాయపడిరి. 'దూరమునం దున్న గ్రహకక్ష పెద్దదగుటవలనే దాని గతి ఆలస్యమని తోచుటమాత్రమే కాదు; అసలు దాని గతియు మంద'మని కెప్లర్.

మరియు మధ్యమస్ఫుటచంద్రుల యంతరము వేధచేసి కనుగొనవచ్చును. భూమి సూర్యునిచుట్టు తిరుగుచున్నది కాని సూర్యుడే భూమిచుట్టు తిరుగుచున్నా డని ప్రాచీనులలో పలువుర అభిప్రాయము. వారి అభిప్రాయముచొప్పున భూభ్రమణమును సూర్యునియం దారోపించినను ఫలభేదము రాదు. స్ఫుటరవిని వేధ చేసినచో అతని రాశియు, అంశము మొదలగునవి తెలియును. ఇటులే మధ్యరవిని గణితముచేసి అతని స్థానము కనుగొనవచ్చును. ఒకానొకపుడు మధ్యరవి కంటె స్ఫుటరవి ముందును, ఒకానొకపుడు వెనుకను కనబడును. మరియు నొకానొకపుడు ఈ యిరువుర రాశ్యంశాదులు సమానము లగును. ఈ యుభయుల యంతరమునకు మందఫల మని పేరు. ఇది ఒకపుడు ధనము; మరియొకపుడు ఋణము. అనగా ఒకపుడెక్కువ; ఒకపుడు తక్కువ.

## మధ్యరవి — స్ఫుటరవి

సూర్యుని మందోచ్చ మాకర్షించును. ఆ యాకర్షణమే యీ మందఫలమునకు కారణము. మందోచ్చస్థానమున సూర్యగతి మందగించును. ఇది ఏ స్థానము? స్ఫుటసూర్యచంద్రుల భ్రమణమార్గమున ఏ స్థానము భూమికి దూరతమమో ఆ స్థానము. ఈ స్థానమున ఎవరో కూర్చుండి రెండు చేతులతోను రెండు పగ్గములను పుచ్చుకొని గ్రహబింబములను తన కభిముఖముగా లాగుకొనుచున్నటు లుండును. గ్రహములు తిరుగు దారిని నాలుగు భాగములుగా విభజింతము. భాగమునకు పాద మని పేరు. మందోచ్చమునందు స్ఫుటరవియు, మధ్యరవియు ఒకచోట నుందురు. అటనుండి రవి ప్రథమపాదములో పోవుచుండగా స్ఫుటరవి వెనుకబడును. మందోచ్చజీవునిచేతిలో ఆ వైపున గల పగ్గము పొట్టిదగుటవలన ఆకర్షణబల మధికమగుటచే స్ఫుటరవి మధ్యరవివెనుక కనిపించును. రెండవపాదము మొదట స్ఫుటరవి చాల వెనుకబడును. పిమ్మట ఈ పాదమునందే యితని గతి క్రమముగా వృద్ధిపొందుచుండును. మూడవ పాదారంభమున, అనగా మందోచ్చమునకు సరిగా విపరీతమగు చోట 8 మందోచ్చజీవుని చేతిలోని పగ్గములు రెండును సమానములుగా నుండుటచే రెండువైపుల ఆకర్షణమును సమానమగును. దానికి ఫలముగా మధ్యను, స్ఫుటగ్రహము లేకకాలముననే అచటికి వచ్చును. ఇక మూడు నాలుగు పాదములలోనికి రవి వచ్చినపుడు మందోచ్చజీవుని వామహస్తమునందలి పగ్గము పొట్టిదగును. దానికి ఫలముగా గ్రహము మధ్యస్థానమునకు ముందగుచు వచ్చును. ఈ రీతిగా ఒకటి రెండు పాదములందు స్ఫుటరవి మధ్యరవివెనుకను, మూడు నాలుగు పాదములందు ముందును ఉండును. మరియు మందోచ్చశీఘ్రోచ్చస్థానములందు మధ్యరవియు, స్ఫుటరవియు కలిసియుందురు. కావున సర్వగ్రహములయు గతి సమమయినను మందోచ్చాకర్షణభేదముచే గ్రహము లొకపుడు మధ్యమస్థానమునకు ముందును, మరియొకప్పుడు వెనుకను కనబడును.

## గ్రహేతరములపై మందోచ్చప్రభావము

ఈ మందోచ్చప్రభావ మితరగ్రహములమీదను గలదు. బుధశుక్రులును, కుజగురుశనులును (ప్రకృతప్రస్తావమున) సూర్యునిచుట్టు తిరుగుచున్నారు. భ్రమించు భూగోళముమీదనే మన మున్నాము. ఈ కారణములచే ఈ ఐదు తారాగ్రహముల గమనక్రమము మన కెరుకపడదు. మనము సూర్యునిలోనుండి చూడగలిగినచో మందోచ్చాకర్షణమునకీ గ్రహములు వశవర్తులయి యుండుట కనులార కనగలిగెడివారము. కుజగురుశనుల మార్గము భూమికి వెలుపల. వీనికి బహిర్వర్తిగ్రహములని వాడుక. ఇవి భూసూర్యుల నిరువురను ప్రదక్షిణించును. భూమియు ప్రదక్షిణించుచున్నది. ఈ నాలుగు గ్రహములును సూర్యు నపరపార్శ్వమునకు వచ్చినపుడు విపరీతాకాశమున నడచుచుండును. భూమి స్థిర మని మనకు తోచును. కాన దీని గమనము గ్రహమున కారోపిత మగుటచే గ్రహము మిగుల వడిగా నేగుచున్నటులు మనకు కనబడును. ఈ రీతిగా బుధశుక్రుల బాట భూసూర్యుల నడుమ గల ఆకాశముననయినను ఈ రెండు గ్రహములును సూర్యుని అపరపార్శ్వమునకు

---

8. సూర్యచంద్రుల మందోచ్చస్థానమునకు విపరీతస్థానమే వారి నీచోచ్చస్థానము. ఇతరగ్రహముల నీచోచ్చస్థానము ఈ స్థానము కాకపోవచ్చును. ఏలన, నీచోచ్చ మనగా భూమికి మిగుల దాపగు గ్రహకక్షా ప్రదేశమని సిద్ధాంతసంగతమగు అర్థము.

చనినపుడు వీని గతియు మిగుల వడి యెక్కును. సూర్యున కొకవైపున భూమియు, ఎదుటివైపున నేదే నొక గ్రహమును ఉన్నచో గ్రహమార్గమునందలి ఆ స్థలమునకు శీఘ్రోచ్చ మని పేరు. ఈ స్థలమునకు గ్రహము చేరగనే భూమికి మిగుల దవ్వగును. దాని గతియు వడి యెక్కును.

## శీఘ్రోచ్చగతి

గ్రహములతోపాటు శీఘ్రోచ్చమునకును పూర్వ గతి కలదు. కుజ గురు శనుల శీఘ్రోచ్చస్థానము నియతముగా సూర్యుని అపరపార్శ్వమునం దుండి భూమితోపాటు పండ్రెండు రాసులను ప్రదక్షిణించుచు వచ్చుచున్నది. భూగతియే సూర్యగతి కావున ఈమూడు గ్రహములయు శీఘ్రోచ్చము మధ్యరవి తుల్యగతితో పూర్వాభిముఖముగా నడచుచుండును. ఈ మూడు గ్రహములనుగూర్చి సిద్ధాంతములు చెప్పిన భగణభోగ కాలము ఇవి సూర్యునితో కలిసి పండ్రెండు రాసులను చుట్టివచ్చు కాలము. ఈ రీతిగా మధ్యరవిస్థానము వీనికి శీఘ్రోచ్చమని సిద్ధాంతములలో కలదు. వీనిముందు రవి యున్నపుడు మధ్యగ్రహముకంటె స్ఫుటగ్రహము ముందు కనబడును. వెనక నున్నపుడు వెనుక కనబడును. శీఘ్రోచ్చ మీ గ్రహముల నన్నిటిని ఎల్లపుడును స్వాభిముఖముగా ఆకర్షించుచుండుటచే నిటులు పొసగును.

## బుధశుక్రుల శీఘ్రోచ్చము

బుధశుక్రుల శీఘ్రోచ్చము వేరు. ఈ రెండు గ్రహములును సూర్యుని దాపులనే యుండి ఒకపుడు ముందును, మరియొకపుడు వెనుకను కనబడును. కావుననే యివి సూర్యుని విడిచి పండ్రెండు రాసులను చుట్టివచ్చినటులు కానరావు. కావున భూమిమీదినుండి చూచినచో వీని భగణభోగకాలము రవిభగణభోగకాలముతో సమానము. దీనినిబట్టి సిద్ధాంతములందు "రవి బుధ శుక్రుల భగణభోగకాలము సమము. అనగా ఒక సౌరవర్షము" అని కలదు. ఈరీతిగా మధ్యరవిస్థానము బుధశుక్రుల మధ్యస్థానమునకు సమానము. ఆకాశమున ఒకవైపు భూగోళమును, ఎదుటివైపు బుధుడుగాని, శుక్రుడుగాని, నడుమ సూర్యుడును ఉన్నచో బుధశుక్రుల గతి హెచ్చుగా కానబడును. దీనివలన బుధశుక్రుల శీఘ్రోచ్చము ఆ రెండు గ్రహములయు తుల్యగతితో సూర్యుని ప్రదక్షిణించుచున్నదని తెల్లము. ఇటులు సిద్ధాంతోక్త మగు బుధశుక్రుల శీఘ్రోచ్చభగణభోగకాలము సూర్యునిచుట్టును స్ఫుట బుధ శుక్రుల భగణభోగకాలముతో సమానము. కావున మధ్యమరవి స్థానమే ఈరెండుగ్రహములయు మధ్యమస్థానము. శీఘ్రోచ్చస్థానమే స్ఫుటగ్రహస్థానము. ఈదిన శీఘ్రోచ్చము సూర్యుని (మధ్యమగ్రహ) ముందు ఉన్నపుడు స్ఫుటగ్రహము సూర్యునకు తూరుపుగా (సాయంసమయమున) కనబడును. అనగా మధ్య గ్రహముకంటె స్ఫుటగ్రహము శీఘ్రోచ్చాకర్షణమున బలె నెక్కువ దవ్వగును. మరియు శీఘ్రోచ్చము సూర్యునకు పడమట నున్నపుడు స్ఫుటగ్రహము సూర్యునివెనుక (తెలవారెడు పట్ల) శీఘ్రోచ్చాకర్షణమున బడినటులు కానిపించును.

## సుఖబోధకు కథాకల్పన

గ్రహములు పాతముచేతనే క్రాంతివృత్తమునుండి దక్షిణోత్తరవిక్షేపము చెందును. ఏ గ్రహమునకయినను పాతము లేనిచో, అనగా గ్రహము క్రాంతివృత్తము నుండి అవనతము కానిచో ఉత్తరముగాగాని, దక్షిణముగాగాని దాని విక్షేపము మనకు కానరాదు. పాతము వలన పూర్వభగణార్ధములో గ్రహములకు ఉత్తర విక్షేపమును, పశ్చిమభగణార్ధములో దక్షిణవిక్షేపమును కలుగును.

గ్రహగతులు సులభముగా తెలుపుటకు పురాణము లవలంబించిన రూపకమును సూర్యసిద్ధాంత మీరీతిగా వివరించెను. శీఘ్రోచ్చమందోచ్చములు దేవతలును గావు, జీవులును గావు. బోధకొరకీ కల్పన. ఇటులనుచో సమకాలికు లెవరయినను వివదింతురేమో యని అనుకొనినటులు భాస్కరుడు "కుజగురుశనులకు ఉచ్చమే యాకర్షకము. ఈ ఉచ్చ మనునది దేశవిశేషముకదా! అది ఎటు లాకర్షింపనేర్చును?" అని శంకించుకొని "సూర్యసిద్ధాంతము చెప్పినచొప్పున దేవతావిశేష మని అంగీకరింతము" అని అనెను. సుఖబోధకు అర్థవాదలును, రూపకకథలును చెప్పుట అన్ని దేశముల వారికిని సంప్రదాయ మనుటకంటె స్వభావ మనుట లెస్స. 'దైవభీతిచే గాలి వీచుచున్నది. సూర్యుడు యథాసమయమున నుదయించుచున్నాడు'9 ఈ మొదలగు ఉపనిషద్వాక్యము లెరిగినవారికి విశేషించి చెప్పబని యుండదు. ఈ యెడ Burgess చేసిన ఆక్షేపణ మెంత కటువైనను దానిని లెక్కచేయ దగదు.

## గ్రహయుద్ధములు

గ్రహములు తిరుగుచుతిరుగుచు ఒకానొకపుడొండొండ సమీపించుచుండును. దానికి యోగమని

9. 'భీషాస్మాద్వాతః పవతే, భీషోదేతి సూర్యః' ('తైత్తిరీయ')

యును, యుద్ధమనియును పేరు. ఆకాశమునందు గ్రహములు తమతమ బాటలలో తిరుగుచున్నవి. బాటలొకదానిమీద మరియొకటి యున్నను అతిదూరమగుటవలన నవి యన్నియు సమతలముననే యున్నట్టులు మనకంటికి కగపడును. భేదము, ఉల్లేఖము, అంశుమర్దనము, అపసవ్యము అని నాలుగు విధము లగు యుద్ధములు పరాశరాదులు చెప్పిరి. పయి నున్న గ్రహబింబము క్రింద నున్న గ్రహబింబముచే ఆచ్ఛాదితమై ఆ రెండును కలిసి ఒకటిగా కానబడినచో అది భేదము. రెండు గ్రహముల పరిధులకు సంస్పర్శము కలుగునేని అది ఉల్లేఖము. ఒక గ్రహముకిరణములు మరియొక గ్రహము కిరణములతో కలిసెనేని అది అంశువిమర్దము. రెండు గ్రహములును ఒకరాశిఅంశలో నుండి దాపుననుండక దక్షిణోత్తరములుగా నున్నచో అది అపసవ్యము, లేక ప్రదక్షిణయుద్ధము అని ఉత్పలుడు. హస్తమాత్రవ్యవధాన మున్నచో యుద్ధమనియు, బాహుమాత్రవ్యవధాన మున్నచో సమాగమ మనియు, వితస్తిమాత్రవ్యవధాన మున్నచో ఉల్లేఖమనియు, అంగుళమాత్రభేద మున్నచో భేదమనియు మతభేదము కలదు. తారాగ్రహములకు యుద్ధమును, సమాగమమును కలుగును. ఏ తారాగ్రహమున కయినను చంద్రునితో యోగ మున్నచో సమాగమ మనియు, సూర్యునితో యోగ మున్నచో అస్తమన మనియు పేరని సూర్యసిద్ధాంతము.

## రంగు

బుధునిది బంగారువన్నె, లేక చిలుకరంగు, లేక నీలమణివర్ణము. అతని దేహము నిర్మలము. బింబము విస్తీర్ణము. శుక్రుడు పెరుగు నల్లగలువ చందమామలకాంతి దాల్చును. అతనిదేహము పెద్దది. కిరణములు విస్తీర్ణములు, స్పష్టములు. అంగారకుని వన్నె కింశుకాశోకములవలె ఎరుపు. మరియు నతడు తప్తతామ్రమువలె దీప్తిమంతుడు. అతని శరీరము విపులము, విమలము. బృహస్పతి కుముదములవలె, కుందములవలె, లేక స్ఫటికములవలె అతిస్నిగ్ధుడు. అతని బింబము విస్తీర్ణము. శని రంగు వైడూర్యములవలె శ్యామము, లేక బాణాసనకుసుమములవలె నీలము. పురాణములు చెప్పిన గ్రహముల రంగును, సిద్ధాంతములు చెప్పిన రంగును చూడ్చునది.

## ఉదయాస్తములు

సూర్యునికంటె మిగిలిన గ్రహముల కాంతి తక్కువ. దానచేసి యీగ్రహములు సూర్యునకు దాపయినపుడు మనకు గనబడవు. సూర్యునిదాటి దూరముగా పోయి మనకు తొలిగా కనబడినపుడు అవి ఉదయించిన వనియు, తొలిగా కానరానపు డవి అస్తమించినవనియు అందుము. కుజగురుశనుల రాశ్యంశాదులు రవిరాశ్యంశాదులకంటె నెక్కుడయినచో అవి పడమట నస్తమించును. తక్కువ అయినచో తూరుపుగా నుదయించును. వక్రించిన బుధశుక్రుల సంగతియు నింతియే. చంద్రుడును, బుధుడును, శుక్రుడును సూర్యునికంటె వడిగా పోవుదురు. దానచేసి వారి రాశ్యంశాదులు సూర్యుని రాశ్యంశాదులకంటె తక్కువ అగుచో తూరుపుగా అస్తమించును. ఎక్కువ అగుచో పడమటగా ఉదయించునని సూర్యసిద్ధాంతము. సూర్యున కంతదూరమున నున్నయెడల చంద్రాదుల కుదయమును, అస్తమయమును అగును? ఇందులకు గ్రహస్థానమును, సూర్యస్థానమును గణితముచేసి ఉభయాంతరము తేల్చవలెను. ఈ యంతరము విషువద్వృత్తమునకు తెచ్చినచో కాలాంశములు చెప్పవచ్చును. మరియు దానినిబట్టి గ్రహముల ఉదయాస్తములను చెప్పవచ్చును.

## కాలాంశములు

విషువద్వృత్తము అరువది నాక్షత్రదండముల కొకతూరి చుట్టివచ్చుచున్నది. విషువద్వృత్తము మున్నూరునరువది అంశలుగా విభక్తము. కావున ఆరు అంశలు పోవుట కొక దండమును, ఒకఅంశ మేసుటకు పది పలలును పట్టును.

భాస్కరమతమున సూర్యుని ఉదయాస్తమయములకు రెండు దండముల ముందుగాని, వెనుకగాని చంద్రుని ఉదయముగాని, అస్తముగాని అగుచో చంద్రుడు కనబడును. ఇంతకు తక్కువ యగుచో సూర్యకాంతిచే ఆచ్ఛాదితుడై కనబడడు. దీనివలన చంద్రుని కాలాంశములు ౧౨. అంగారకునివి ౧౭, లేక ౨/౫౦ దండములు. బుధునివి ౧౪. బృహస్పతివి ౧౧. శుక్రునివి ౧౦. శనివి ౧౫.

గ్రహాణబింబముల స్థౌల్యమువలనను, సౌక్ష్మ్యమువలనను ఈ ఎక్కువతక్కువలు. బుధశుక్రులు వక్రించుచో వాని బింబములు స్థూలములగును. దానచేసి అపుడు ఆ కాలాంశములకంటె రెండు తీసివేయవలయును. అనగా అవి దవి ౧౨-౭ కాలాంశముల దూరమున నున్నచో మనకు కావిపించును.

# స్వతంత్రభారతములో చరిత్రరచన

శ్రీ నోరి నరసింహశాస్త్రి

కవులకు, సాహిత్యపరులకూ చరిత్రప్రస్తావ మెందుకని కొందరడుగవచ్చును. చరిత్రవిషయములలో విశేషపరిశ్రమ చేసిన విద్వాంసుల కిది సాహసప్రాయముగను, వ్యతిక్రమముగను గనిపించవచ్చును. కాని ప్రాతహద్దు లన్నియు నతిక్రమించుచున్న యీ కాలములో ఈ క్రొత్తహద్దులుమాత్రము నిలువగలవా?

ఆంధ్రచరిత్రలో, అందును ముఖ్యముగా శాతవాహన, చాళుక్యయుగములలో విశేషపరిశ్రమ చేసిన శ్రీ భావరాజు కృష్ణారావు నాటిక లీమధ్య వ్రాసినారు. మరియును మా మిత్రులు, ఆంధ్రుల చరిత్రలో, అందును ప్రత్యేకము కాకతీయయుగములో నిష్ణాతులు ఐన శ్రీ డాక్టరు మారేమండ రామారావు ఎన్ని నాటిక లీమధ్య వ్రాసినారు కారు! సుప్రసిద్ధచరిత్రకారులు వాఙ్మయరంగములోనికి చొచ్చుకొని వచ్చినప్పుడు కొందరు కవులైనను వారి చరిత్రరంగములోనికి జొరబడుట తప్పు కానేరదు గదా!

నేటి మన చరిత్రరచనాపద్ధతి ఇంగ్లీషువారియొద్దనుండి ఎరువు తెచ్చుకొంటిమి. ఇంగ్లీషులో గిబ్బను, కార్లయిలు, ఫ్రూడు వ్రాసిన చరిత్రగ్రంథములు సారస్వతములో ఉన్నతస్థాన మలంకరించును. ఈమధ్య వెల్సు వ్రాసిన ప్రపంచచరిత్ర జగద్విదితము. ఈ విధముగా ఈ అక్రమప్రవేశములో మా కెందరో మార్గదర్శకు లున్నారు.

అంతే కాదు: కవులూ, చరిత్రకారులూ ఏక కార్యాయత్తులై మన అనుభవజ్ఞానము సంపాదించినప్పుడే ఉభయుల కృషి సఫలము కాగలదు. ఆ విశ్వాసముతోడనే దీని నుపక్రమించినాము.

౧

ఆంగ్లేయుల పరిపాలనలో భారతదేశపు పాఠశాలలలో ఇంగ్లీషు ప్రారంభించుటకు కారణ మేదో అది మన కందరకు ఇప్పుడు తెలిసిపోయినది. రాజకీయాందోళనము చేయుటకు మన యుపన్యాసకులు వేదికలపైనుండి పదేపదే మెకాలే వ్రాసిన రిపోర్టు ఉద్ఘాటించినారు. అందుచే నది పేలవ మైనది. మన జాతీయసంస్కృతిని నాశనముచేసి విజాతీయసంస్కృతిపై వ్యామోహము దేశీయులలో కల్పించి విజాతీయప్రభుత్వము నిరాటంకముగా పరిపాలనచేయుట కుపకరణములనుగా మన విద్యావంతులను మార్చుటకే కదా అది పెట్టినది! మెకాలేవాంఛ నేటికి ఫలవంత మైనది. విజాతీయసంస్కృతి మనచుట్టును ఆవరించియున్న గాలివలె సర్వసామాన్యమును, సర్వాధారమును ఐపోయినది.

మన దేశవిషయములు తెలియవలెనన్నా, మన కిప్పుడు ఇంగ్లీషుపుస్తకాలే ఆధారము. సంస్కృతగ్రంథములు, తెలుగుపుస్తకములును ఇంగ్లీషుతర్జుమారూపముతో వచ్చినప్పుడు ఎక్కువ వ్యాప్తిలోనికి వచ్చును. ఇంగ్లీషుభాషాంతరీకరణములు చదివినట్లు తెలుగువి చదువము. పత్రికలు చూడండి: మనము చదివేది ముందు ఇంగ్లీషుపత్రికలా, తెలుగువా? ఇంగ్లీషువారి ధర్మాన ఈ స్థితిలోనికి మన మిప్పుడు వచ్చినాము!

అయితే ఈ పరకీయావ్యామోహము ఒక్క భాషలోనే కాదు వారు ప్రవేశపెట్టినది; సమస్తవిజ్ఞానవిషయములలో అది ప్రవేశించినది. మతములో, సంఘములో, రాజకీయములలో, సారస్వతములో, విజ్ఞానములో—సమస్తవిషయములలోనికి చొచ్చినది. తుదకు జాగ్రఫీలోకికూడా చేరుకున్నది. ఆ సంగతి మనము తెలిసికోలేని స్థితికి వచ్చినాము; అవి యన్నియు ప్రస్తుతము విచార్యవిషయములు కావు. ఈ విజాతీయదృష్టి చరిత్రరచనలో ఆవేశించినది. అది

ఎంత దృఢముగా భూతమువలె మనలను పూనినదో సర్వసామాన్యమైన విషయములు పరిశీలించి నివేదింతుము. అందరును—పెద్దలును, పిన్నలును—గతానుగతికముగా, ఏకోశమునను సందేహలేశము లేకుండ వ్యవహరించు సంగతులనే ఉదాహరింతుము.

## 3

ఏ భరతచరిత్రగ్రంథమైనా తీసికొండి! ఈ 'హిందూదేశ' చరిత్ర మూడు యుగములుగా—పీరియడ్లుగా—విభజించి యుండునుగదా! మొదటిది హిందూపీరియడు; రెండవది మహమ్మదీయపీరియడు; మూడవది బ్రిటిషుపీరియడు! మన చరిత్రను ఈవిధముగా విభజన చేయుటలో దోష మేమైనా విద్యార్థులకు గాని, ఉపాధ్యాయులకు గాని, చరిత్రకారులకు గాని కనపడినదా? లేదు! దోషము కనపడినచో చిన్న క్లాసులనుండీ ఎమ్. ఏ. క్లాసువరకు చరిత్రసిలబసులలో ఈ యుగవిభజన మెందు కుండును?

మాకుకూడా ౧౯౪౭ సం. ఆగస్టు ౧౫వ తారీకువరకు దోషము ఏమియు స్ఫురించలేదు. ఆ తర్వాత రోజురోజుకూ ఒక క్రొత్తవిధమైన దోషము కనబడుచున్నది. దాని అంతరర్థము స్ఫురించిన కొలది రోషాగ్ని ప్రజ్వరిల్లుచున్నది. కాని ఏమి లాభము?

ఈ విభజనవలన మన పూర్వపాలకులు సాధించిన ఫలము సూత్రప్రాయముగా ఇది! అది ఎంత పటుత్వము కలదో, ఎంత క్రూరమైనదో పెద్దలు అనుమేయించగలరు.

“పూర్వము ఆర్యులు పైదేశములనుండి ఈ దేశమునకు దండెత్తివచ్చి ప్రవేశించి ద్రావిడులను, దస్యులను మర్దించి తమ సంస్కృతిని కొన్నాళ్ళు ఈ దేశములో బలవంతముగా వ్యాపింపజేసినారు. అయితే కొంతకాలమునకు ఈ వేడిదేశములో వారు చిరకాలముండుటచే వారి జాతీయశక్తి క్షీణించినది. పరస్పర కలహము లెక్కువైనవి. దేశద్రోహులు పొడసూపినారు. ఇంతలో బలవంతులగు మహమ్మదీయులు పైదేశములనుండి తండములుతండములుగా వచ్చి ఈ దేశమును జయించి పాలించినారు. ముందు వచ్చిన మహమ్మదీయులు ఈ వేడిదేశములో నివాసమువలన బలహీనులగుచురాగా ఎప్పుడును పైనుండి వచ్చిన మహమ్మదీయుల తండము గెలుపొందసాగినది. ఈ మహమ్మదీయులు క్రూరులై నిర్వీర్యులగు 'హిందువు'లను హింసింపసాగినారు. వారును ఈ దేశములో చిరావాసమువలన విషయలంపటులై క్షీణించినారు. అందుచే అల్లకల్లోలముగా ఉన్న ఈ దేశమునకు దూరమునుండి ఆంగ్లేయవర్తకులు వచ్చి ఇతరశ్వేతజాతులను పారద్రోలి మహమ్మదీయులను జయించి దేశమును ఉద్ధరించి శాంతి నెలకొల్పి నిష్పక్షపాతముగా పాలించుచున్నారు!”—ఇది ఈ యుగవిభజన సూత్రసారము!

మన దేశములో చిరకాల మున్నవారు నిర్వీర్యులగుదురట! అందుచేత ఈ దేశవాసులము ఎల్లప్పుడూ ఒరులకు దాస్యము చేయవలసినవారమే. ఇప్పటికిని ఈ ఉష్ణదేశములో ఉన్నందున మన జాతి నిర్వీర్యమైనదను భావము మనలో ఎందరికి లేదు? కాని, ఇది నిజముగా అనుభవసిద్ధమేనా? ఇంతకంటె చలిదేశములో నుండువారికి అలవాటు లేక ఈ దేశవాసము పడక క్షీణకారణము కావచ్చును. అట్లే ఈ దేశములో నుండువారికి చలిదేశములో నివాసము క్షీణకారణము కాదా? మన మిప్పుడు నిర్వీర్యులముగాకూడ నుండవచ్చును. కాని దానికి కారణము ఈ భరతభూమిలో నివాసమే ఐనచో మన కిక గతి ఏమిటి? నైజాము నుండియు, పాకిస్థానునుండియు వలస వచ్చుచున్నవారివలె మనమును ఎక్కడికైనను వలస పోవలెనా? ఈ ముప్పైమూడుకోట్లమందిమి ఎక్కడికని పోగలము? ఇందరిని భరించగల ఇంకొక తల్లిదేశము ఉన్నదా? లేక నిరంతరము ఎవరో ఒక విదేశీయులకు ప్రభుత్వము సమర్పించి మనము వారికి సేవ చేయుచుందమా?

రెండు మహాయుద్ధములలో జర్మనులు నిర్వీర్యులయ్యే ఓడిపోయినారా? మొన్నటి యుద్ధములో జపానువారు నిర్వీర్యులయ్యే ఓడిపోయినారా? క్రొత్త మారణాయుధము సృష్టించినవారికి జయము కలుగుచుండు. బలవత్తరమైన ఆశ్వికదళములతో మహమ్మ

దీయులు యుద్ధములలో జయించినారు. తుపాకులవల్ల తెల్లవారు జయించినారు. ఆటంబాంబుకు జపాను వారు లొంగినారు. మరియు తాత్కాలికముగా స్వాతంత్ర్యము పోగొట్టుకొనుటకు అనేకకారణము లుండవచ్చును. వేడిదేశ మగుటవల్ల జాతి నిర్వీర్యమైన దనుట మనలను నిరంతరము దాస్యములో నుంచుటకు విదేశపాలకులు చెప్పిన తప్పుడుచదువు !

మొదలు మన జాతి నిర్వీర్య మైనదా ? రెండవ మహాసంగ్రామవిజయానంతరము మదించి మైమరువ వలసిన బ్రిటిషువారికడ్డనుండి విముక్తి ఎట్లు సంపాదింప గలిగినాము ? మనది నివాసయోగ్యము కాని వేడి దేశమా ? అట్లయినచో ఇన్నికోట్లమంది జనము పిలువ కుండా వచ్చి ఇక్కడ నివాసము కల్పించుకొని వృద్ధి పొందుటలేదా ? మూడు పూటలను స్నానసంధ్యాది క్రియలు సకాలములో నిర్వర్తించుటకు యోగ్యమై పవిత్రమగు నీ భరతభూమిని వేడిదేశ మని చదివిన చదువు మనము ముందు వెంటనే మరవవలెను. అయితే ఇది జాగ్రఫీకి సంబంధించినది !

ఈ పీరియడ్ల విభాగములో ఇంత దూరార్థము ఇమిడిఉన్నదా యని పలువురు సందేహింపవచ్చును. అంతే కాదు, ఇంకా చాలా దూరార్థ మున్నది.

ఈ సృష్ట్యాదినుండి ఇప్పటికి ఎన్నికోట్ల సంవత్సర ములో గడచిపోయినవి గదా! ౧౯౫, ౫౮, ౮౫౦, ౪౮ సంవత్సరములు గడచిపోయిన వని నిమిషములేకాక లిప్తలతోకూడ మన సిద్ధాంతులు ప్రతిసంవత్సరమూ పంచాంగములలో లెక్కలువేయుచున్నారు. దినదినము నిత్యనైమిత్తికకర్మలలో చేయు కాలసంకీర్తనములో కూడ నదే గణన మున్నది. మానవజాతి ఈ భూగోళ ముపై నవతరించి అటువంటి ఊహాతీతమైన సంవత్సర ముల సంఖ్య కల కాలమే కడచిన దని నేటి భూతత్త్వ శాస్త్రవిదులుకూడ గణనచేయుచున్నారు.

భారతదేశచరిత్ర అనగా ఇన్నికోట్ల సంవత్సరముల చరిత్ర అనుటలో పొరపాటు లేదుకదా ! ఇందులో బ్రిటిషువారి ౧౯౦ సం. లూ, మొగలుల ౧౮౧, లోడీల ౭౫, సయ్యాదుల ౩౭, తుఘలకుల ౯౪, ఖిల్జీల ౩౦, బానిసల రాజ సం. లూ ఎన్నవ అంశలోకి రాగలవు ? ఈ చిన్నభాగములకు గొప్పగా పీరియడ్లు అను విభాగము లెందుకు ? భరతచరిత్రలో మహమ్మదీయులు పాలించినా రను ౫౦౦ సం.లూ, బ్రిటిషు వారి ౧౯౦ సం.లూ బహుస్వల్పకాలము ! మనకు సన్నిహితమైనందున అవి గొప్పగా కనపడవచ్చును. కాని చరిత్రకారుని దృష్టికూడ అంత సంకుచితముగా నుండవలెనా ?

మరియు ఈ చరిత్రగ్రంథములలోనే గుప్త సామ్రాజ్యము ౧౯౦ సం. లు ఉండె ననియు, అది స్వర్ణయుగ మనియు చదువుచున్నామే ! శాతవాహనులు ౪౬౪ సం.లు పాలించి రనియు, అంత దీర్ఘ కాలము పాలించిన వంశ మింకొకటి లేదనియు చదువు చున్నాము. ఇంకను కుషానులు ౨౩౦ సం.లు రాజ్యము చేసిరట! మౌర్యులు ౧౬౦ సం లు, నందులు [illegible]౮ సం. లు రాజ్యము చేసిరట. అంతకుముందు బింబిసారాదులు అధమపక్షము ౨౦౦ సం.లు రాజ్యము చేసియుందురు.

ఈ చరిత్రకారుల దృష్టిలో భారతదేశచరిత్ర ఇప్పటికి ౨,౫౦౦ సం.లనుండి ప్రారంభించుచున్నది. అట్లు చూచినను ౧,౮౦౦ సం.లు ఒక పీరియడా ? ౫౦౦ సం. లు ఒక పీరియడా ? ౧౯౦ సం. లు ఒక పీరియడా ? ఈ మూటికి సమానప్రతిపత్తియా ? కాలమునుబట్టికాని, ప్రాముఖ్యమునుబట్టికాని ఈ విభజన సబబైనదా ? ఈ విభజనచే అనవసరముగా మన పారతంత్ర్యకాలమునకు ప్రాముఖ్యము వచ్చుటలేదా ? స్వతంత్రములై ఉత్తమములైన కాలముల చరిత్ర విస్తరించి విశదీకరించి విభజించి మనకు బోధించి, ఈ తర్వాతి రెండుపీరియడ్లను పారతంత్ర్యస్థితి యని క్లుప్తముగా వ్రాసి అందులో భరతభూజనులు స్వాతంత్ర్యమునకై పోరాడిన విధానములు వివరించుచు చరిత్ర వ్రాయరాదా ? జపానువారు వారి ప్రస్తుతపారతంత్ర్య స్థితిని వారి చరిత్రలో వ్రాయదలచలే దని మనము పత్రికలలో చదివితిమి గదా! ఒక పీడకలను మనము పొడిగించి పొడిగించి వివరించి స్వతంత్రభారతవిద్యార్థులకు ఎందుకు బోధించవలెను ?

౪

ఇట్లన్నంతనే చరిత్రకారులు సత్యము మరుగు పరచరా దని సత్యసంధుల మనుకొను కొందరు చరిత్ర కారులే కాక విదేశదాస్యము తలకెక్కిన బుద్ధిమంతులు కూడ వివాదమునకు వత్తురు. అందుచే ఈ ప్రస్తుత యుగవిభజన అంగీకరించుచున్న చరిత్రకారులకు ఎంత సత్యదృష్టి ఉన్నదో కూడ విమర్శింతము.

బ్రిటిషువారు భరతఖండ మంతటిని పరిపాలించినా రనుటలో ఎట్టి సందేహమును లేదు. స్వతంత్ర సంస్థానము లనునవి ౨౦౦ పైచిలుకు ఉండెడి వంటే, అవి అన్నియు వారు స్వప్రయోజన మపేక్షించి వారి దయాధర్మభిక్షుములకు లోబరచి ఉంచినవే! వారి యుగమని చెప్ప ౧౯౦ ఏళ్ళును కాకపోయినను అందులో నూరేళ్ళయినను వారు భరతఖండమున నఖండముగా ప్రభుత్వము చేసినా రనుట సత్యేతరము కాదు.

మరి మహమ్మదీయులో? ఢిల్లీలో పరిపాలన చేసిన మహమ్మదీయులలో ఏ కొద్దిమందియో తప్ప దక్షిణదేశములో అడుగుపెట్టలేదు. వారి దృష్టి దక్షిణ భారతదేశముపై నెప్పుడు మరల్చినను వెంటనే వారి రాజ్యములు విచ్ఛిన్నమైనవి. ఇది ఒకసారి మహమ్మదు తుఘ్లకుతోను, మరియొకసారి ఔరంగజేబుతోను సంభవించిన దని అంద రెరిగినదే గదా! ఉత్తరభారతములో మహమ్మదీయులు ప్రభుత్వము చేయుచున్న రోజులలో దక్షిణదేశములో కొన్నివందల ఏళ్ళు కాకతీయులు బలవంతులైన ప్రభువులుగా నుండిరి; మరి కొన్నివందల సంవత్సరములు విజయనగర చక్రవర్తులు ప్రభుత్వము చేసిరి. అట్టిచో ౧౩౨౦ సం. వరకు కాకతీయయుగ మనియు, నంతటినుండి ౧౫౬౫ వరకు విజయనగరసామ్రాజ్యయుగ మనియు ఏల చరిత్రవిభజన చేయరాదు? ౧౮ వ శతాబ్దములో మహారాష్ట్రులు ఆసేతుహిమాచలములో బలవత్తరులై యుండిరే! ఆ కాలము మహారాష్ట్రయుగ మని ఎందు కనరాదు? ఉత్తరభారతమును పాలించిన విదేశీయులనుబట్టి భారత చరిత్రలో యుగవిభజన మెందుకు చేయవలెను?

జాతీయతాభిమానము లేక కేవలసత్యాన్వేషణ పరాయణులైనవారు గూడ ఇప్పటి యుగవిభజనము సమంజసము కాదని ఇప్పు డంగీకరింపవచ్చును. మూడు యుగముల విభజనకు అలవాటుపడిన మన బుద్ధులకు ఇది ముందు విపరీతముగాను, అసందర్భముగాను తోచవచ్చును. కాని విచక్షణతో యోచింపగలవారికి ఇందులో ఏదో కొంత సత్యమున్నట్లున్నదని సందేహము ప్రారంభించినను మేము కృతార్థులమే!

౫

ఐతే, ఇంతటితో మేము చెప్పదలచినది పూర్తి కాలేదు! మరొక పెద్ద భ్రాంతి దేశములో వ్యాపించినది. హస్తినాపురము భరతఖండమునకు రాజధాని గనుక దానిని పాలించినవారి చరిత్ర వ్రాయుటతో భరతఖండచరిత్ర కృతార్థమగు నని కొందరి భావము! మరికొందరికి వింధ్యహిమవత్పర్వతమధ్యప్రదేశముల చరిత్రతో పూర్తి యగు నని భ్రాంతి యున్నది.

ఈ రెండవ భావము ఇప్పుడిప్పుడు తగ్గుచున్నందుకు కొంత సంతోషము. మేము చదువుచుండు రోజులలో స్కూలుఫైనలు పూర్తియినలోపల శాతవాహనుల పేరుకాని, పులకేశి పేరుగాని, రాజేంద్రచోళచక్రవర్తి పేరుగాని, కాకతిగణపతిదేవచక్రవర్తి పేరుగాని చదివిగాని, వినిగాని ఎరుగము; ఇప్పుడు కొంత మార్పువచ్చినదికాని ఉత్తరదేశచరిత్రకు ప్రాధాన్యము పోలేదు.

భరతఖండమునకు హస్తినాపుర మొక్కటే రాజధాని కాదు. కౌరవచక్రవర్తుల రాజధాని హస్తినాపురము. రాఘవసార్వభౌముల రాజధాని అయోధ్య. కొంతకాలము పాటలీపుత్రము రాజధాని. కొంతకాలము భారతీయసంస్కృతి ఉత్తరదేశములో వికసించినది. మరికొంతకాలమున కది దక్షిణభారతములో బలపడి ఇప్పటికి నిలిచియున్నది. శాతవాహనులయు, పల్లవులయు, చాళుక్యులయు, చోళులయు సామ్రాజ్యము లెంత గొప్పవో, కాంచీనగరము ఎట్టి ఉన్నతస్థితి ననుభవించినదో మన మందరమును బాగుగా నభ్యసింపవలసియున్నది.

౬

మరియొక విషయము: క్రీస్తుకుపూర్వము ౨౨౦ ఏండ్లు పారశీకచక్రవర్తులు గాంధారము, పంజాబు రాష్ట్రముల నేలిరి. అట్లే గ్రీకులు ౧౫౦ సం.లు ఆ

ప్రాంతములనే పాలించి మధ్యమధ్య మగధవరకు చొచ్చుకొనిరాగా, వారి నొకమారు ఖారవేలుడు పారద్రోలెను. గ్రీకులను పార్థియనులు జయించిరి. పిమ్మట శకులు ౨౦౦ సం.లు పాలించిరి. కుషానులు కొంతకాల ముండిరి. అందులో కనిష్కుడు ప్రసిద్ధుడు. ఈ దండయాత్రలును, రాజ్యములును పలువురు మహమ్మదీయుల దండయాత్రలకును, రాజ్యములకును ఎందును తీసిపోవు.

మన దేశములో రాజ్యములు స్థాపించిన మహమ్మదీయులందరు ఒకరే యను భ్రమ పలువుర కున్నది. వారిలో కొందరు షియాలు, కొందరు సున్నీలు. ఉత్తరదేశములో పారశీక సంస్కృతి ఎక్కువ. దక్షిణదేశములో అబిస్సీనియాసంస్కృతి ఎక్కువ. వారిలో వారి కున్న విభేదములు గ్రీకులకు పార్థియనులకు, శకులకు కుషానులకు ఉన్న భేదముల కంటె తక్కువవి కావు. అట్టిచో నందరను మహమ్మదీయు లను సామాన్యనామముతో వ్యవహరించు టేల? అట్లు చేసియే వారికి లేని సంఖ్యాబలము మనమే చేకూర్చి పాకిస్థాను కట్టబెట్టినాము. ఇదంతయు మహమ్మదీయమహాయుగ మని విభజన చేయుట వల్లనే సంభవించినది. ఈ యుగవిభజనమే నేటి కల్లోలములకు కారణము!

తురుష్కుల ఆపద, మొగలుల ఉపద్రవము, సున్నీల ఇక్కట్టు, షియాల సంక్షోభము, పఠానుల దోపిడి, బ్రిటిషు ప్రళయము—ఇట్టి పేర్లతో మన చరిత్రభాగములకు నామకరణ మేల చేయరాదు?

## ౮

మరి మాబోంట్లకు భరతచరిత్ర ఏవిధముగా ప్రత్యక్షమగునో కొంత వివరింతుము:

ఈ దేశములో రెండే తెగ లున్నవి. ఆర్యులు-అనార్యులు. ఇవి రెండును అనాదులే! ఒకరు ముందూ, ఒకరు వెనుకా కారు! ఈ మానవదేహములో ఎన్నివిధములైన జీవరాసు లున్నవి? అందులో కొన్ని దేహమును నిలువబెట్టునవి; ఇతర మైనవి దానిని నాశనముచేయ నదను చూచుచుండునవి!

అట్లే ఈ భరతభూశరీరమును నిలువబెట్టువారు ఆర్యులు. ఈ దేశక్షేమము కోరువారు, ఆసేతుహిమాచలపర్యంతమను నీ భూఖండమును తమ తల్లిభూమిగనే కాదు, తమ తండ్రిభూమిగనే కాదు—సాక్షాత్తు పరదైవతముగనే చూచువారు ఆర్యులు! ఇదే వారి జన్మభూమి! వారి విలాసభూమి, విహారభూమి, కర్మభూమి, తపోభూమి, పుణ్యభూమి! దేహపాతమందు తుదకు వారి దేహముల భస్మముకూడ ఈ భూమిలో అణువుగానే మారిపోయి పంచభూతములలో కలసిపోవును. వారు మధ్యమధ్య దివ్యలోకములకు చేరుకొనియు మరల మరల ఈభూమిలోనికే అవతరించవలెనని కోరుకొనుచుందురు. వారికి మాది ఆంధ్రమని, తమిళమని, కర్ణాటకమని, మహారాష్ట్రమని, ఘూర్జరమని, వంగమని, ఓఢ్రమని ప్రత్యేకస్పర్ధలు, అభిమానములు లేవు. వారికి వేదము, వేదాంగములు పరమప్రమాణములు. సంస్కృతము వారి శిష్టవ్యవహారభాష!

మరి అనార్యులో? అందుకు వ్యతిరేకులు. వారికి స్వలాభము ఎక్కడ లభించినను దానికి ప్రాకులాడెదరు. నేడీ దేశము లాభసాటిగా ఉన్న నుందురు; కాకున్న రేపు మరొక దేశము పోయెదరు. వారికి దేహపోషణమే పరమావధి! వారు తమ దేశద్రోహబుద్ధి మరుగుపరచి తమ్ము సమర్థించుకొనుటకై సర్వసమత్వము వాంఛించు విశిష్టవ్యక్తుల మని ప్రగల్భములు చెప్పుకొను చుందురు!

మన దేశ మెన్నడును కూపస్థమండూకమువలె లేదు. అన్నివైపులనుండియు విదేశీయుల అలజడులు అనాదిగానే వచ్చుచుండినవి. ఒక్కొక్క అలజడి రాగా దానిని ముందు ఎదుర్కొడ్డి నిల్చినాము. మితిమించినప్పుడు తల వంచి బాధపడినాము. పిమ్మట నెమ్మదిగా జీర్ణించుకొన్నాము! ఈ విధముగానే పూర్వము గ్రీకులను, పార్థియనులను, శకులను, కుషానులను, హూణులను, పహ్లవులను—మరి ఎందరినో జీర్ణించుకున్నాము. అందులో ఒకప్పుడు ప్రతిహూలు రనే మరొకప్పుడు ఆత్మరక్షణకు ఉపయోగించుకున్నాము. పూర్వము మన దేశముపై దండెత్తివచ్చిన విదేశీయు లెందరో మనలో కలసిపోయినా రని చరిత్ర

కారులే చెప్పుచున్నారు కదా! అట్లే మహమ్మదీయులును కలసిపోగలరు!

జ్వరాదివ్యాధు లావేశించిన దేహమును ఊహించుకోండి! మన దేశ మిప్పుడు మహాజ్వరావిష్టమై యున్నది. మన దేశమే కాదు! ప్రపంచమే మహారోగజ్వరముతో ప్రస్తుతము అట్టుడికి పోవుచున్నది. భూభారము దుర్భరముగా నున్నది. అదే అలజడులకు నిదానము!

మన చరిత్రకారులు శాంతచిత్తులై దేశశ్రేయస్సునకు ఉపయోగపడు విధముగా చరిత్ర నవగాహన చేసికొని పాఠశాలలలో చదువుకొను విద్యార్థులకును, మాబోటి నిరతవిద్యార్థులకును అవగాహనచేయవలె. అప్పుడే మన దేశమును వా రుద్ధరించి లోకోద్ధరణబీజమును లోకమంతటను వ్యాపింపజేయగలరు!

౨

అసలు మనము చరిత్ర ఎందుకు చదువవలె! ఖారవేలుడో, కనిష్కుడో ఏ సంవత్సరమువాడు? పదేళ్ళు ఇటూ అటూ అని పేజీలకు పేజీలు వాదోపవాదములు పెంచుట చరిత్రరచన కానేరదు. పదేళ్లు కాదు, కొన్నివందల ఏళ్లు ఇటైనను అటైనను ఫలితాంశములో భేద ముండదు. చరిత్రశోధన ద్రవ్యపరిశోధనవంటిది కాదు! బింబిసారుని పేరు సరియా? లేక అది జైను లనునట్లు శ్రేణికుడా? అజాతశత్రుని పేరు సరియా? లేక జైను లనునట్లు అది కుణికుడా?—ఏ పేరైన నేమి?

పురాణములలో ఎన్నో రాజవంశముల చరిత్రలు సూక్ష్మముగా ఉన్నవి. అందులో పెద్ద కల్లోలములు కలిగినప్పుడు ఆర్యధర్మము నిలువబెట్టినవారి చరిత్ర వివరించియుండును. శత్రువు లెవరో, ఏవిధముగా విజృంభించినారో, ఎంతకాలము చెలరేగిరో, తుదకు ఏవిధముగా అణగినారో అందులో గోచరించును. మన పెద్దలు వ్రాసిన పురాణచరిత్రలు మన కిప్పుడు ప్రమాణములు కావాయెను! అలెగ్జాండరుతో వచ్చిన గ్రీకులు, చంద్రగుప్తునియొద్దనున్న మెగాస్తనీసు, ఫాహియాను, హ్యూయనుత్సాంగు, ఫెరిస్తా, మార్కోపోలో, అబ్దుల్ రజాక్—ఇట్టివారు వ్రాసిన గ్రంథములు మనకు ప్రథమప్రమాణము లాయెను! ఆ గ్రంథములు సూక్ష్మముగా చూచినవారికి అవి ఎంత ఆత్మశ్లాఘలతో నిండియుండునో, డాంబికవచనములతో నున్నవో విదితమే! వానిని చదువవ ద్దనను! విచక్షణతో చదవండి! మన చరిత్రకు మన దేశసాక్ష్యము మీద ఆధారపడి అందుకు సహాయముగా విదేశ సాక్ష్యము గ్రహించవలెను. అది సక్రమపద్ధతి! విదేశ గ్రంథములు పరమప్రమాణములుగను, స్వదేశగ్రంథములు ఆలోచించదగిన ప్రమాణములుగను ప్రారంభించుట తారుమారుచేయుట! ఇప్పుడు మన దేశమునుగూర్చి విదేశయాత్రికులు ఎన్ని కథలు వ్రాయుచున్నారో గమనించి ఫాహియాను, హ్యూయనుత్సాంగుల వంటి వారి గ్రంథములను మన పరిశోధకులు అవగాహన చేసికొందురుగాక!

చరిత్రరచనలో మనము జాతీయదృష్టి అలవరచుకొనవలె. అదే ఆర్యదృష్టి! జాతీయమైన చరిత్ర దృష్టితోడనే వాల్మీకి శ్రీమద్రామాయణము వ్రాసినాడు. వేదవ్యాసుడు భారతము రచించి పురాణగ్రథనము చేసినాడు. వాల్మీకి శ్రీరాముని ఆస్థానకవి కాడు! వేదవ్యాసుడు జనమేజయుని ఆస్థానకవి కాడు! ఒకవేళ వారు ఆస్థానకవులే ఐనను, ప్రభువులను అనుసరించుకొని ఆశ్రయించి విధేయులగు ఈ కాలపు ఆస్థానకవులవంటివారును, ఇతర దేశముల ఆస్థానకవులవంటివారును కానేకారు! వారు ప్రభువులకు ప్రభువులు. ఆర్యజాతీయసంస్కృతికే వారు ప్రభువులు!

ఇప్పటికి ౫,౫౫౦ సం.ల క్రిందటి తన కాలపు చరిత్రను మహాభారత మను జయ కావ్యములో వ్యాసుడు చిత్రించినాడు. పాండవపక్షపాతముతో అది వ్రాసినా డనువారు మతిహీనులు. పాండవులు చేసిన ధర్మవ్యతిక్రమముల నతడు దాచలేదు. అతనికి ధర్మమందే పక్షపాతము! ఆ కాలములో సాధ్యమైనంత ధర్మబుద్ధి కల్గు ధర్మరాజు జయము వర్ణించి తుదకు స్వర్గారోహణపర్వములో నాతని యల్పతయు, మానవ ధర్మాల్పతయు చిత్రించినాడు.

అతడు మహాభారతరచనతో ఊరకొనలేదు. అప్పటికి ౧౯౫ కోట్ల పైచిలుకు సంవత్సరములు గడచి పోయినవి. ఆ చరిత్ర అప్పటికి పెద్దల స్మృతిలో నిలిచియున్నంతవరకు క్రోడీకరించి పురాణములు, ఉపపురాణములు గ్రథనము చేసినాడు. వానిలో తర్వాతివారు ఎన్నో ప్రక్షిప్తములు చేసినమాట వాస్తవమే. బుద్ధిమంతులు విమర్శించి వానిని వేరుచేయుటకు ప్రయత్నించవలెనుగాని అందులో ఉన్న చివరి ప్రక్షిప్తమునుబట్టి దాని కాలనిర్ణయము చేయుట తగవా?

మహాభారతయుద్ధ కాలము తిథివారనక్షత్ర విశేషములతో శ్రీమహాభారతములోనను, పురాణములందును ఉదాహరించియున్నది. విదేశీయుల దృష్టితో చూచు నలవాటు మన కబ్బునంతవరకు అది నిర్వివాదగా అంగీకరించిన విషయము. అట్టిది సందేహించుటకు మన కిప్పుడు క్రొత్త కారణ మేమి దొరకినది? ఇప్పటికి ౫,౫౮౮ సం.ల క్రిందట జరిగిన దనే ఏల వ్రాయరాదు? ప్రతిసంవత్సరము జాగ్రత్తగా కృణకము పంచాంగములలో వ్రాయుచున్నామే! శుభాశుభకర్మ లన్నిటిలో నిత్యము ఆసేతుహిమాచలము ఒకేవిధముగా కాలస్మరణ చేయుచున్నామే! ఇన్నికోట్లమంది నిరంతరనిత్యస్మరణలో ఉన్న కాలప్రమాణము సరి కాదని శంక ఎందుకు కలిగినది? ఋగ్వేదము క్రీస్తుకు పూర్వము ౧౫౦౦-౨౦౦౦ సం.ల క్రిందట పుట్టినది కాదని దీనివల్ల ఋజువైనచో మనకు హృదయవేదన ఎందుకు? అసలీ క్రీస్తుశక మెప్పుడు ప్రారంభము?

౧౯౫ కోట్ల సం.ల చరిత్ర వ్రాయవలెనని మనము దృష్టిలో పెట్టుకొన్నచో చరిత్రను ఏవిధముగా విభజించుట ఉచితమో మనకు స్పష్టము కాగలదు. ఆ మహాకాలములో వందలసంవత్సరములే లెక్కకు రావు. మహాకాలపురుషుని ఒడలిపై ఈగ వాలగా దులుపుకొనుటకు పట్టునంత కాలముక్రిందికికూడా బ్రిటిషుపరిపాలనము లెక్కకు రాదు. ఈ విషయము గమనించకయేపోయినను అబద్ధము కానేరదు.

చాళుక్యశాసనములలో శక్తివర్మ రాజ్యమునకు వచ్చుటకు ముందు ౩౦ ఏళ్లు దేశము అరాజకముగా నుండె నని వ్రాసినారు. అట్లే ఈ నూరేళ్లు కాక తీదుమందల ఏళ్లు అరాజక మనే దృష్టితో భారత చరిత్ర వ్రాసినా అబద్ధము కానేరదు. మన భూమిలో మన దేవతలకు మన ద్రవ్యములో ఆయతనములు నిర్మించుకొనుటకుకూడ హక్కు లేకుండచేసి మన శిరస్సులపై పవిత్రమైన శిఖ లుంచుకొన్నందుకు పన్నులు వసూలుచేసినవారిని మన రాజు లని మన మెందుకు ఒప్పుకొనవలెను? రాజనగా ధర్మపరిపాలకుడు! అది కానినాడు అతడు గుండా! గుండాలు వారి మాటలు చెల్లించుకొనినరోజులు అరాజకస్థితి అనుట అసత్య మగునా?

ఆసేతుహిమాచలమధ్యమైన భూభాగము ఒకటను భావము ప్రబలినప్పుడు ఈ దేశము వీర్యవంతమైనదని మన మూహింపవచ్చును. ఇప్పటికి వేయిసంవత్సరముల పై కాలముక్రిందట నిర్వీర్యదశ మనకు ప్రారంభించినది. చాళుక్యులు, చోళులు, రాజపుత్రులు, కాకతీయులు, విజయనగరప్రభువులు, మహారాష్ట్రులు—ఈ వేయిసంవత్సరముల కాలములో భారతైక్యముకొరకు ప్రయత్నించియు సాధించలేకపోయిరి. అట్టిది, మన జాతీయతను విచ్ఛిన్నము చేయవలె నను దురుద్దేశముతో ప్రారంభించిన బ్రిటిషువారు నేడు మనకు సాధించి పెట్టి వెళ్లినారు. వారి ప్రతికూలప్రయత్నమే లేకున్న మనకీ జాతీయశక్తి విజృంభించియుండదు. ఈ వేయి సంవత్సరములలో లేని ఐక్యము ఇప్పుడు సాధ్యమైనది. ఈ ఐక్యబుద్ధి, జాతీయబుద్ధి, ఆర్యబుద్ధి మనము పెంపొందించుకొనుటకు చరిత్రకారులు సహాయము చేయవలెను. ఉత్తరమునకు దక్షిణమునకు, రాష్ట్రమునకు రాష్ట్రమునకు మధ్య భేదములు వెదుకక అందరికి సమానమగు ఆర్యధర్మము ఉద్ధరించి అలవరచుకొనవలెను. అప్పుడే మన జాతి వీర్యవత్తరమైన దని ఋజువు కాగలదు.

వేదవ్యాసుడు, వాల్మీకి మనకు ఆదర్శఋషులు, ధర్మప్రవర్తకులు, చరిత్రకారులు, కవులు! చరిత్రకారులు స్వయముగా ఋషులైనప్పుడే కవు లయ్యెదరు. చరిత్రకారులు కవులు కావలెను! కవులు చరిత్రకారులు కావలె! ఉభయులును ఆర్యధర్మము గ్రహించిన ఋషిసత్తములు కావలె! అప్పుడే మరియొక ఉత్తమజయకావ్యము ఉద్భవించును! అప్పుడే జాతీయాభ్యుదయము కలుగును! దానితో లోకకల్యాణము కూడ ప్రారంభింపవచ్చును!




శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య

ఆగస్టునెల భారతీయులందరికి పండగనెల. గత సంవత్సరము ఈనెల ౧౫వ తేదీన దేశమునకు స్వాతంత్ర్యము లభించినది. అంతకుపూర్వము ౧౫౦ సంవత్సరములుగ నడచిన పరాయిప్రభుత్వము నశించినది. దేశములోని ప్రజలందరు ఈ సంవత్సరము ఆగస్టు ౧౫-వ తేదీన స్వాతంత్ర్యవార్షికోత్సవమును జరిపిరి. పట్టణవాసులు-పల్లెటూరివారు, ధనికులు-దరిద్రులు సమస్తవర్ణములవారు, సమస్తమతములవారు ఉత్సవములలో పాల్గొనిరి. ఎవరెవరికి ఎన్నెన్ని కష్టము లున్నను అవి తొలగుటకు స్వాతంత్ర్యము, స్వరాజ్యము అవసరమన్న మాటను అందరు గుర్తెరిగిరి.

## స్వాతంత్ర్యోత్సవము-సంతోష,విచారములు

కాని ఈ ఉత్సవము సంపూర్ణమైన సంతోషముతో కూడియుండలేదు. ఎంత సంతోషముండెనో అంత విచారముకూడ కనబడుచుండెను. స్వాతంత్ర్యసమరమున దేశమునకంతకు నాయకుడుగ నుండి విజయము చేకూర్చిన మహాత్మాగాంధీగారి హత్య ఈ విచారమునకు మూలకారణము. ఇదిగాక, లక్షలాది ప్రజలు మతవైషమ్యమునకును, దానిమూలమున జనించిన దారుణహత్యలకును గురియై అనాదిగ వారు కాపురముండిన ప్రదేశములను వదలి స్త్రీలతోను, పిల్లలతోను, వృద్ధులతోను పాకిస్థానమునుండి ఇండియాకు కాందిశీకులై పారిరావలసివచ్చెను. వారు పడ్డ బాధలు, అనుభవించిన కష్టములు వర్ణనాతీతములు. స్వాతంత్ర్యము లభించిన మరుదినమునుండి ఇట్టి బాధలు తాము అనుభవించవలసివచ్చునని వారు కలలో కూడ అనుకొన్నవారు కారు. సుమారు ౪౫ లక్షల హిందువులు, సిక్కులు ఇట్టి యమయాతనలు అనుభవించవలసివచ్చెను. ఇప్పటికికూడ వారి బాధలు అదృశ్యములు కాలేదు. తూర్పుపంజాబురాష్ట్రమునను, ఢిల్లీలోను, ఢిల్లీపరిసరములలోను, సంయుక్తరాష్ట్రములందును, పశ్చిమబంగాళమందును ఈ కాందిశీకులు ప్రత్యేకశిబిరములందు చేరి ఇప్పటికికూడ వారిలో అనేకులు నిలువ నీడలేక, జీవనోపాధులు లేక, నానాకష్టములను అనుభవించుచున్నారు. వీరికి భూములను ఇచ్చియు, వర్తకవ్యాపారములు చేయుటకు అవకాశములు కల్పించియు, చేతిపనులద్వారా జీవించుచుండిన వారికి అట్టి పనులకు కావలసిన వసతులు నిర్మించియు ఎంతో సహాయపడవలసియున్నది. ప్రభుత్వమువారు చాలవరకు వారి శక్తికొలది సహాయము చేయుచున్నమాట వాస్తవమే. కాని ఇన్నిలక్షల జనమునకు స్థిరనివాసములు, స్థిరమగు జీవనోపాధులు లభించుటకు ఎంతోకాలము పట్టును. ఎంతటి సహాయము తమకు చేయవలెనో అంతటి సహాయము ప్రభుత్వమువారు తమకు చేయలేదన్న అతృప్తి, అసంతుష్టి వారందరిలో వ్యాపించియున్నది. స్వాతంత్ర్యోత్సవమునాడు ఈ కాందిశీకులు విచారసాగరములో మునిగియుండుటలో ఆశ్చర్యమేమి ఉన్నది!

ఇట్టి బాధలకు దూరులైన ఇతరప్రజలలో కూడ సంపూర్ణమైన సంతోషము కనుపించలేదు. స్వాతం

త్ర్యమువలన తమ కింకను చెప్పదగినంత లాభము కలుగ లేదన్న అభిప్రాయము సామాన్యజనులలో వ్యాపించి ఉన్నది. దేశములో నూటికి తొంభైమంది దారిద్ర్యము ననుభవించుచుండినవారు. దారిద్ర్యము కొంతవరకైనను తొలగినప్పుడే వారు స్వాతంత్ర్యముయొక్క ప్రాధాన్యమును, విలువను గ్రహింపగలరు. కాని ఈ సంవత్సరములో ఇట్టిది జరుగలేదు. ఆహారముగాని, బట్టలుగాని వారి కింతో దూరముగ నున్నవి. దినదినమునకు క్షామపరిస్థితులు విపరీతము లగుచున్నవి. స్వరాజ్య లాభము ధనికులుమాత్రమే అనుభవించుచున్నా రన్న భావము వారందరిలో ఉన్నది. అందుచేత స్వాతంత్ర్యోత్సవమున వారు పాల్గొనినను అట్టి సమయములో ఎంతటి ఉత్సాహ ముండవలెనో అంతటి ఉత్సాహము వారియందు కనుపించలేదు.

కాని ఈ విధముగ నిరుత్సాహపడవలసిన అవసరము లేదన్న మాటను ప్రజలందరు గ్రహించవలసి యున్నది. స్వరాజ్యసమరము ఇంకను పూర్తికాలేదు. బ్రిటిష్‌వారి పరిపాలనకాలములో వారి పక్షమును వహించి జాతీయోద్యమమును నిరోధించుటకు ప్రయత్నించుచుండిన వర్గము లింకను దేశమున ప్రబలముగ నున్నవి. ద్విజాతిసిద్ధాంతమును ఇప్పటికికూడ అనేకులు వదలకుండుటచేతనే పాకిస్థానమునకును, హైదరాబాదునకును ఇండియాప్రజలు కొందరు ఇప్పటికికూడ సహాయముచేయుట జరుగుచున్నది. పాకిస్థానపరిపాలకులు మన స్వాతంత్ర్యమును, బలమును, ఐక్యమును వినాశముచేయుటకు విశ్వప్రయత్నము గావించుచున్నారు. ఈ అంతశ్శత్రువులు, బహిశ్శత్రువులు అదృశ్యులైన గాని స్వరాజ్యమువలన మనము సాధింపవలసిన లాభము లన్నిటిని సాధించుటకు వీలుకాదు. కాని ఇట్టి పనిని ప్రజలుగాని, ప్రభుత్వమువారుగాని ఇంకను చేయలేకున్నారు. అందుచేతనే సామాన్య జనులకు కావలసిన వస్తుసముదాయమును సమకూర్చుటకు అవకాశము తగ్గియున్నది.

## ప్రశంసింపదగిన పనులు

దీనినిబట్టి గత సంవత్సరములో మనముగాని, మన ప్రభుత్వముగాని ప్రశంసింపదగిన పనులను వేనిని చేయలేదని అనుకొనుట గొప్ప పొరబాటు. అట్టి పనులు ప్రభుత్వమువారు కొన్నిటినో గావించిరి. శిబిరములను ఏర్పాటుచేసి కాందిశీకులను రక్షించుట అట్టి పనులలో మొదట పేర్కొనవలసియున్నది. ఒక్క హైదరాబాదుతప్ప తక్కిన సంస్థానములన్నిటిని ఇండియాలో సర్దారుపటేలు చేర్చగలవాడైనారు. ఇది గొప్ప ఘనకార్యము. తాము వెళ్లిపోయినతర్వాత దేశములోని సుమారు ౬౦౦ సంస్థానములు సర్వస్వాతంత్రతను ప్రకటించుటకు హక్కుకలవి యని బ్రిటిష్ వారు చాటించిరి. వారి చాటింపుప్రకారమే వ్యవహారము జరిగియుండినయెడల దేశమందు ఒక పాకిస్థానము ఏర్పడుటకుబదులు ౬౦౦ పాకిస్థానములు ఏర్పడియుండెడివి. ఒక పాకిస్థానమువలననే మనకు ఎన్ని ఇబ్బందులు కలుగుచున్నవో అందరికి తెలిసిన విషయమే. ఇట్టి సందర్భములో ౬౦౦ పాకిస్థానములు దేశమందు ఏర్పడియుండినయెడల మన మనుభవించవలసిన బాధలు వర్ణనాతీతములుకదా? ప్రస్తుతము హైదరాబాదుసంస్థానము స్వాతంత్ర్య ప్రకటన చేయుటవలన సంస్థానములోని ప్రజలును, ఇండియాలోనివారును ఏవిధముగ కష్టపడుచున్నారో ప్రత్యేకముగ చెప్పవలసినది లేదు. బ్రిటిష్ వారు ౬౦౦ హైదరాబాదులను సృష్టించి మనకు స్వాతంత్ర్యము నియ్యదలచిరి. కాని వారి ఉద్దేశము నెరవేరలేదు. చాణక్యుడు, యుగంధరుడు మొదలగు సుప్రసిద్ధులవలె సర్దార్ పటేల్ అసమానమైన ప్రజ్ఞను చూపి సంస్థానము లన్నిటిని ఇండియాలో చేర్చి, ఈ సంస్థానము లనేకములందు ప్రజాస్వామ్యసిద్ధాంతముల ననుసరించు రాజ్యాంగవిధానమును ఏర్పరచినవారైనారు. ఇదిగాక ఈ సంవత్సరములో రాజ్యాంగపరిషత్తువారు క్రొత్త రాజ్యాంగప్రణాళిక నొకదానిని తయారుచేయగలిగిరి. ఇదికూడ ప్రశంసింపదగిన విషయమే. దీనితోబాటు ప్రభుత్వమువారు విదేశవ్యవహారములలోను, ఆర్థికవ్యవహారములలోను, విద్యావిషయములలోను ఏట్టివిధానమును అనుసరించబూనియున్నారో స్పష్టపరచిరి. కనుక స్వరాజ్యము లభించిన మొదటిసంవత్సరపు జమాఖర్చులను మనము సరి చూచినయెడల ఖర్చుపద్దులు ఎక్కువగ నున్నట్లు మొదటిదృష్ట్యా మనకు కనుపించినను, విషయమును కొంచెము లోతుగ పరిశీలించినయెడల జమపద్దులు కూడ అనేకము లున్నట్లు స్పష్టము కాగలదు. ఎవరు గాని నిరుత్సాహపడవలసిన కారణము లేదు.

## కాశ్మీరు

కాశ్మీరువిషయమై మన ప్రభుత్వమువారు భద్రతామండలి యెదుట చేసిన ఫిర్యాదునుగురించి విచా

రించుటకై ఏర్పాటుచేయబడిన ఉపసంఘము ఇండియా పాకిస్థానములందు ఆగస్టునెలలో పర్యటనము గావించి సత్య మేదియో తెలిసికొనగలిగెను. కాశ్మీరముపై దాడిచేసిన కొండజాతివారికి సహాయముచేయుటయే గాక తమ సైన్యములను సమస్తపరికరములతో కాశ్మీరములోపలికి పంపి పాకిస్థాన్ ప్రభుత్వమువారు మన సైన్యములతో యుద్ధము చేయుచున్నట్లు విధిలేక ఆ ప్రభుత్వమువారే ఉపసంఘముయెదుట ఒప్పుకొనిరి. కనుక మరి ఏలాటి విచారణగాని అవసరము లేకయే ఉపసంఘమువారు కాశ్మీరువిషయమై తీర్పుచెప్పుటకు వీలుకలిగెను. పాకిస్థాన్ సైన్యములు వెంటనే కాశ్మీరమును వదలివెళ్లిపోవలె ననియు, కొండజాతివారికి ఇదివరకు పాకిస్థాన్ ప్రభుత్వమువారు చేయుచుండిన సహాయమును ఆపివేయవలెననియు తీర్పు చెప్పుట ధర్మము, న్యాయము. కాని ఉపసంఘమువారు అట్టి పనికి పూనుకొనక రెండుపక్షములవారు యుద్ధమును విరమించవలె నను సూచన చేసియున్నారు. ఇట్టి సూచనయొక్క అర్థ మేమి? కాశ్మీరములో కొంత భాగమును అన్యాయముగను, చట్టవిరుద్ధముగను పాకిస్థాన్‌వారు ఇప్పుడు ఆక్రమించుకొని యున్నారు. అచ్చటినుండి వారు వెళ్లిపోవలె నని చెప్పుటకు బదులుగా వారు యుద్ధమును విరమించవలె నని చెప్పుటచేత ఆ ప్రదేశము వారి స్వాధీనములో ఉంచవచ్చు నని చెప్పుటయే. ఇట్టి తీర్పునకు మన ప్రభుత్వమువారు అంగీకరించరాదు. అంగీకరించుటకు తమకు ఇష్టము లేదని వా రదివరకే ఉపసంఘమువారికి తెలియబరచిరి.

దీనిమూలమున తేలిన విషయ మొక్కటి ఉన్నది. భద్రతామండలివారుగాని, వారి ఉపసంఘములోనివారుగాని న్యాయముగ తీర్పుచెప్పగల రని అనుకొనుట పొరపాటు. కాశ్మీరమునుండి పాకిస్థాన్ సైన్యములను, దోపిడిగాండ్రను వెడలగొట్టవలసి ఉన్నది. అది యుద్ధముద్వారా మన ప్రభుత్వమువారు సాధించవలెనేకాని, భద్రతామండలి న్యాయపరిశీలనవలన సాధించుటకు వీలు కానట్టిది. కాశ్మీరువిషయములో యుద్ధము సాగించుటయే మన ముపయోగించదగిన సాధనము.

## హైదరాబాదు

హైదరాబాదువిషయమునగూడ ఇదితప్ప సాధనాంతరము లే దని ఆగస్టునెలలో జరిగిన వ్యవహారముల మూలమున మరింత స్పష్ట మగుచున్నది. ఆనెల ప్రారంభములో సర్ మీర్జాఇస్మాయిల్ నైజాంతరఫున మన ప్రభుత్వముతో కొన్ని రాయబారములు జరిపి, నైజాము రాజీకి వచ్చుటకు కావలసిన ప్రయత్నములను చేసెను. కాని నైజాము ఎట్టి రాజీకిని అంగీకరించక యథాప్రకారము రజాకర్లచేతిలోని కీలుబొమ్మగ వ్యవహరించువాడయ్యెను. అతని మంత్రివర్గమం దుండిన హిందూ ప్రతినిధి (లింగాయత్ పక్షమునకు చెందినవాడు) రాజీనామా ఇయ్యగా దానిని వెంటనే అంగీకరించెను. రజాకర్లు కోరినది ఇదియే. నైజామునకును, తమకును మధ్య ఒక సంవత్సరముగ జరుగుచుండిన వ్యవహారములను వివరించుచు, యథాతథపు ఒడంబడికలోని షరతులను అతడు అతిక్రమించిన విధానమును స్పష్టపరచుచు మన ప్రభుత్వమువారు ఒక శ్వేతపత్రమును ప్రకటించిరి. కాని దానిమూలమునకూడ నైజాముచర్యలలో ఎట్టి మార్పు కనుపించకపోవుటయేకాక యుద్ధము చేయుటకై అతడు కావించుచుండిన ప్రయత్నములు ఆ ప్రకటనతర్వాత మరింత అధికము లయ్యెను. సరిహద్దు ప్రాంతములలో అతడు అనేకశిబిరములను బలపరచుకొని గ్రామములపై దాడి జరుపుచున్నాడు. రాష్ట్రములోని హిందూప్రజలు అనుభవించుచుండు బాధలకు మితిమేరలు లేకున్నవి. వందలకొలది ప్రజలను చంపుట, స్త్రీల మానభంగము చేయుట, ధనధాన్యములు దోచుకొనుట మామూ లగుచున్నది. ఇండియాలోనుండి ఏడెనిమిది లక్షల మహమ్మదీయులు గత అయిదారుమాసములలో హైదరాబాదురాష్ట్రమును ప్రవేశించిరి. వారిలో పది పండ్రెండు వేలు నైజాం పోలీసుదళములోను, సైనికదళములోను చేరిరి. సైనికపరికరములు సమకూర్చుకొనుటకై ఈమధ్య ౨౦ కోట్ల రూపాయలు నైజాము ఖర్చుపెట్టెను. రాష్ట్రమందు శాంతిభద్రతలు లేనందునను, సాహుకార్లు, వర్తకులు రాష్ట్రమును వదలి పారిపోవుటచేతను పన్నుల వసూళ్లు తగ్గెను. సైనికఖర్చులు విపరీతముగ పెరిగెను. అందుచేత ఈ సంవత్సరపుబడ్జెటులో నాలుగు కోట్లు లోటుకలిగెను. పాకిస్థాన్‌తత్వానుసారముగ అల్పసంఖ్యాకులగు మహమ్మదీయుల అధికారమును శాశ్వతముగ నిలబెట్టుటకై రజాకర్లు, నైజాము తలపెట్టిన యుద్ధసన్నాహములు ఇట్టి విషమస్థితిని కల్పించినవి. ఇదగాక తనకును, ఇండియాప్రభుత్వమునకును మధ్య ఏర్పడిన వివాదమును పరిష్కరించవలె నని నైజాము ఇప్పుడు ఐక్యరాజ్య సమితిని, భద్రతామండలిని కోరుటకు నిశ్చయించి

ఒక రాయబారవర్గమును సమితిమహాసభకు పంపుచున్నాడు.

## న ర క బా ధ

హైదరాబాదులోని హిందూప్రజలు నరకబాధను అనుభవించుచున్నమాట కాదని చెప్పువారెవ్వరు లేరు. ఆ బాధకంటె వెంటనే మరణించుట ఉత్తమమనికూడ చెప్పవచ్చును. నైజాము విపరీతముగ యుద్ధపరికరములను చేర్చుచున్నాడనియు, సైన్యములను పెంచుకొనుచున్నాడనియు, కోటలను, దుర్గములను బలపరచుకొనుచున్నాడనియు నెహ్రూగారికిగాని, పటేలుకుగాని తెలియకపోలేదు. కాని వారింకను ఎట్టి చర్యను తీసికొనక, ఆలోచనలోనే నిమగ్నులై ఉన్నారు. దీనికి కారణము దురూహ్యము. "ఆలస్యాదమృతం విషం" అన్న వాక్యము సార్థకమగుచున్నది. గోటితో త్రుంచివేయదగినదానికి గొడ్డలి అవసరమగు పరిస్థితులు ఏర్పడినవి.

## ఆ ల స్య ము చే య రా దు

కాశ్మీరవిషయములోకూడ ఎంతటి తీవ్రచర్యను తీసికొనవలెనో అంతటి తీవ్రచర్యను ప్రభుత్వమువారు తీసికొనుచుండలేదని కొన్నిరోజుల క్రిందటనే పండిత కుంజ్రూ వ్యక్తపరచెను. పాకిస్థానముపై యుద్ధము ప్రకటించినగాని కాశ్మీరసమస్య పరిష్కారము కాజాలదు. పాకిస్థానముపై దండెత్తి, అచ్చటినుండి కాశ్మీరమునకు వెళ్లుచుండు శత్రుసైన్యములను అరికట్టినగాని కాశ్మీరయుద్ధమునందు జయము లభింపజాలదు. అట్లు చేయుట చట్టవిరుద్ధము కాదు. కాని పాకిస్థానముపై బహిరంగముగ యుద్ధము ప్రకటించుటకు గాని, హైదరాబాదుపై తగిన కఠినచర్య తీసికొనుటకు గాని మన ప్రభుత్వమువారు వెనుదీయుట ఎందుకో? దానికి కావలసినంత సైనికబలము మనకు లేకపోవుటచేతనా? యుద్ధము ప్రారంభమైనయెడల ఇండియాలోని మహమ్మదీయులు 'పంచమదళము'న చేరి శత్రువునకు సహాయము చేయుదురనియా? ఇండియాప్రజలలో శత్రువు నెదుర్కొనుటకు కావలసినంత దేశాభిమానము, పట్టుదల, నిర్మాణశక్తి లేవనియా? ఇందులో ఏది కారణమైనను ఆలస్యము చేయుటవలన శత్రుబలము వృద్ధియగునే కాని తగ్గదు. ఆరునెలలక్రిందట సులభముగ చేయదగిన పని ఇప్పటికి కష్టమైన పనిగ మారెను. మరింత ఆలస్యము చేసినయెడల అది కష్టతరముగను, అసాధ్యముగను కావచ్చును.

## ద్ర వ్యో ల్బ ణ ము

కాశ్మీర, హైదరాబాదుసమస్యలే కాక మరియొక క్లిష్టసమస్యకూడ ప్రస్తుతము మన ప్రభుత్వమును ఎదుర్కొనుచున్నది. దానికి ఇంగ్లీషులో ఇన్‌ఫ్లేషన్ (Inflation) అని పేరు. దానికే మనవారు 'ద్రవ్యోల్బణ'మని, 'అధిక చెలామణి'అని పేర్లు పెట్టియున్నారు. దేశమందు రోజురోజుకు ధరలు విపరీతముగ పెరుగుచుండుటయు, ఎంత ఆదాయము వచ్చినను చాలకపోవుటయు ఈ సమస్యయొక్క లక్షణములు. కార్మికుల కూలీలు వృద్ధిగాంచినవి. ఉద్యోగస్థుల వేతనములు అధికములైనవి. పండిన పంటలను అమ్మి రైతులు ఎక్కువ ద్రవ్యమును సంపాదించుచున్నారు. కాని యుద్ధమునకు పూర్వము తక్కువ ఆదాయము వచ్చుచున్న రోజులలో వస్తువులు దొరకుచున్నట్లు ఇప్పుడీ ఎక్కువ ఆదాయమునకు దొరకుట లేదు. అందుచేత కార్మికులు, వ్యవసాయకూలీలు, రైతులు అందరు మరింత ఎక్కువ ఆదాయమును కోరుట తప్పుటలేదు. కాని వీరి ఆదాయము ఎక్కువైనను అంతకంటె ఎక్కువగ ధరలు పెరుగుటచేత ఎవరికిని ఏలాటి లాభము లేకున్నది. ఎచ్చట జూచినను దీనిమూలమున ఆందోళన వృద్ధిగాంచుచున్నది. కార్మికుల సమ్మెలు, ప్రభుత్వపు ఉద్యోగస్థుల బెదరింపులు—ఇవి సర్వసామాన్యములగుచున్నవి. ఈ ద్రవ్యోల్బణము ఒక గొప్ప వ్యాధి. ఈ రోగము యుద్ధకాలమున ప్రారంభమై గత మూడు సంవత్సరములమధ్య అత్యధికముగ పెరిగినది. దీనికి వెంటనే చికిత్సచేయనిపక్షమున ఆర్థికపరిస్థితులు విషమించి అల్లరులకును, అరాచకమునకును, విప్లవమునకును దారితీయును.

## చి కి త్స

దీని తీవ్రతను ప్రభుత్వమువారు గ్రహించి, ఏలాటి చికిత్స అవసరమో నిర్ణయించుటకు అర్థశాస్త్రవేత్తలతోను, కార్మికప్రతినిధులతోను, పారిశ్రామికయజమానులతోను సంప్రతింపులు జరుపుచున్నారు. వారు నిర్ణయించు చికిత్స ఏదియో బహుశః కొద్దిరోజులలో స్పష్టము కాగలదు. దేశములో చెలామణియగుచుండు నోట్లు తగ్గిపోవుట, ధనికులిచ్చు పన్నులను అధికముచేయుట, ప్రజలవద్దనుండి ప్రభుత్వము

వారు ఋణములను ఎక్కువగా తీసికొనుట, లాభములకు ధరలకు ఒక హద్దును ఏర్పరచుట, ప్రభుత్వము వారు చేయు ఖర్చులను తగ్గించుట—ఈలాటి ఉపాయము లనేకములను అనేకులు సూచించుచున్నారు. మొత్తమున వ్యాధి ఒకటి కన్న దనియు, అది కుదిరిన గాని ప్రజల పరిస్థితులు బాగుపడజాల వనియు, అందుకై చికిత్స వెంటనే జరుగవలసియున్న దనియు స్పష్ట మగుచున్నది.

## బట్టల కంట్రోలు

బట్టలవిషయమై ప్రభుత్వమువారు కంట్రోలు పద్ధతిని తిరిగి ప్రవేశపెట్టుటకు ఆగష్టులో తీర్మానించి, అందుకు కావలసిన ఏర్పాటులను కొన్నిటిని చేసిరి. ఏడెనిమిదిమాసములక్రింద కంట్రోలు రద్దయినతర్వాత బట్టల ధరలు మూడు రెట్లు పెరుగుటయు, మిల్లుల యజమానులు, వర్తకులు సుమారు నూరుకోట్ల రూపాయల లాభమును సంపాదించుటయు అందరికి తెలిసినదే. ప్రజలను, ప్రభుత్వమును దోచి ఇంత లాభమును సంపాదించుటలో ఎట్టి ధర్మము లేదు. దీనిని అరికట్టుటకును, బట్టల ధరలను తగ్గించుటకును కంట్రోలు తప్ప మార్గాంతరము లే దని ప్రభుత్వమువారు నిశ్చయించుకొనిరి. కాని కంట్రోలుమూలమున నిజముగా ధరలు తగ్గగలవా, బట్టలు కావలసినవారికి స్వల్పధరలకు అవి లభింపగలవా? అన్నదే ప్రశ్న. బట్టలను అమ్మే హక్కు సహకారసంస్థలకును, లైసెన్సులు పొందిన వర్తకులకును మాత్రమే ఇచ్చుటయు, ప్రభుత్వమువారు నిర్ణయించు ధరలకే వీరు అమ్ముటయు, వీరట్లు చేయుచుండునదియు, లేనిదియు విచారణచేసి, అట్లు చేయని వారిని శిక్షించుటకు ఉద్యోగస్థులను నియమించుటయు కంట్రోలుపద్ధతికి గల ప్రధానలక్షణములు. కాని సహకారసంస్థలు, లైసెన్సుదారులు, ఉద్యోగస్థులు—వీరందరుకూడ స్వలాభపరులై ప్రవర్తించు చుండినారన్న మాట మనము మరువకూడదు. వీరందరు ఏక మగుటచేతనే దేశములో బ్లాక్ మార్కెట్టు అభివృద్ధిగాంచుచుండుట. ఇంతకు, రేషన్ పద్ధతితో జతపరచక కంట్రోలుపద్ధతిని ప్రవేశపెట్టుటచేత సామాన్యప్రజలకు కావలసిన బట్ట ఎట్లు దొరకగలదు? కంట్రోలు లేని రోజులలో కొంచెము ఎక్కువ ఖరీదుకు ఎక్కడనంటే అక్కడ బట్ట దొరుకుచుండెడిది. రేషన్ లేని కంట్రోలు పద్ధతిలో ఈ సదుపాయముకూడ ఉండదు. కంట్రోలు కూడ దని ఇచ్చుట నాదింపబడుట లేదు. రేషన్ లేని కంట్రోలు అర్థములేని కంట్రోలనియు, దానిమూలమున లాభము పొందువారు ఉద్యోగస్థులు, లైసెన్సుదార్లే అనియు ఇచ్చటి వాదము.

## ఇనాములు

ఆగష్టునెలలో మద్రాసురాష్ట్రమున జరిగిన వ్యవహారములలో రెండు ముఖ్యముగ గమనింపదగియున్నవి. ఇందులో ఒకటి: జమీందారీబిల్లులో నుండి ఇనాములను తీసివేయుటకు కాంగ్రెసుపార్టీ వారు చేసిన తీర్మానము. రెండవది: మద్యపాననిషేధమును అన్ని జిల్లాలలో అక్టోబరు ౧-వ తేదీకి ప్రవేశపెట్టవలె నను ప్రభుత్వమువారియు, కాంగ్రెసుపార్టీ వారియు తీర్మానము. మొదటి తీర్మానము ఢిల్లీలోని కాంగ్రెసు నాయకుల మతము ననుసరించి చేయబడినది. కాని ఇది బూటకమైన తీర్మానమే కాని న్యాయము చేయవలె నని చేయబడిన తీర్మానము కాదు. ఇనాములను జమీందారీలలోనుండి మినహాయించుట న్యాయమని అంగీకరించినప్పుడు జమీందారీల విషయమై ఈ సంవత్సరమున ప్రభుత్వమువారు కావించిన శాసనములన్నిటినుండికూడ ఇనాములను మినహాయించుట న్యాయము. ఈ శాసనములలో ఒకటి ఇనాందారులకు రైతు లియ్యవలసిన శిస్తులకు సంబంధించియున్నది. దీనిమూలమున శిస్తులను రైతువారీరేట్లకు సమానముగ తగ్గించవచ్చును. సెటిల్మెంటు చేయుటకై ప్రభుత్వము వారు ఉద్యోగస్థుల నిదివరకే నియమించియున్నారు. వారు ఇనాందారులకు రైతు లిచ్చు శిస్తులనుకూడ తగ్గించవలసియున్నది. ఇనాములు జమీందారీలవంటివి కావనియు, ఇనాందారులకును, జమీందారులకును ఏలాటి సామ్యము లే దనియు మద్రాసుప్రభుత్వము వారు ఇప్పు డంగీకరించిరిగనుక వెంటనే శిస్తుతగ్గింపు (Rent Reduction Act) శాసనమును రద్దుచేయవలసియున్నది. కాని దానికి వారు సిద్ధపడియుండలేదు. ఇది గొప్ప అన్యాయము.

## మద్యపాననిషేధము

మద్యపాననిషేధమును తక్కిన ఎనిమిదిజిల్లాలలో ప్రవేశపెట్టుటకు చేయబడిన తీర్మానమునకు ఇది సమయము కాదు. ఇట్టి చట్టమును అమలులో పెట్టుటకు, చట్టవిరుద్ధముగ కల్లుసారాయీలను తయారు

చేయువారిని పట్టుకొని శిక్షించుటకు ఎంతో పోలీసు సిబ్బంది కావలసియున్న దనియు, హైదరాబాదు సమస్యమూలమున సరిహద్దుజిల్లా లన్నిటిలో పోలీసు సిబ్బంది శాంతిభద్రతలను కాపాడవలసియున్న దనియు, ఇట్టి సందర్భములో మద్యపాన నిషేధమునకు ప్రత్యేకముగా కావలసిన సిబ్బందిని ఏర్పరచుట కష్టసాధ్యమనియు, అందుచేత హైదరాబాదుసమస్య పరిష్కారమగునవరకు ఈ నిషేధమును తక్కిన ఎనిమిదిజిల్లాలలో ప్రవేశపెట్టకుండుట మంచి దనియు పండితనెహ్రూగారు జూలైమాసమున మద్రాసుకు వచ్చినపుడు కాంగ్రెసుపార్టీకి సలహా ఇచ్చెను. మంత్రివర్గమువారు, ప్రధానమంత్రియు ఈ సలహాను అనుసరించుటకు సిద్ధపడియుండిరి. కాని కాంగ్రెసుపార్టీవారు దీని కిష్టపడక, నిషేధచట్టమును అమలుపరచుటలో శాసనసభ్యులు తోడ్పడెద రని చెప్పుచు నెహ్రూసలహాకు విరుద్ధముగ రాష్ట్రమందంతట మద్యపాననిషేధమును ప్రవేశపెట్ట తీర్మానించిరి. పోలీసుసిబ్బంది చేయగల పనిని ప్రచారముద్వారా శాసనసభ్యులు చేయగల రని అనుకొనుట కంటె హాస్యాస్పద మగు విషయము వే రొకటి లేదు. దేశములో చట్టములను అమలుచేయు పూచీ మంత్రివర్గమువారిది గాని శాసనసభ్యులది కాదు. చట్టమును అమలుచేయుట సాధ్యము కా దని విశ్వసించిన ప్రధానమంత్రియు, తక్కిన మంత్రులును ఇంతటి ప్రధాన విషయములో శాసనసభ్యులకు లోబడి ప్రవర్తించుట తమ బాధ్యతను మరచుటయే. ఇట్టి ప్రధానవిషయములో తమకును, పార్టీకిని అభిప్రాయభేదములు సంభవించినప్పుడు మంత్రిత్వమును వదలుకొనుట గౌరవము గాని శక్తికి మించిన పనిని చేయదలచుట గౌరవము కాదు.

## భాషాప్రయుక్త రాష్ట్రములు

భాషాప్రయుక్తరాష్ట్రము లవసరములా, కావా అన్న విషయమును విచారించుటకై రాజ్యాంగపరిషదధ్యక్షుడు ఏర్పరచిన సంఘమువారి ప్రశ్నలకు అనేకులు అనేకసమాధానములను పంపుచున్నారు. కాని, ఇట్టి రాష్ట్రముల నిర్మాణము ఇప్పుడు జరుగవలసినదే దనియు, అధమపక్షము పది సంవత్సరములకు దీనిని వాయిదా వేయవచ్చు ననియు తమిళనాడు కాంగ్రెసు కమిటీఅధ్యక్షులు, బొంబాయికాంగ్రెసుకమిటీవారు, గుజరాతుకాంగ్రెసుకమిటీవారు , ప్రముఖులగు వ్యక్తులు కొందరు, రాయలసీమమహాసభవారును తీర్మానించినట్లు తెలియుచున్నది. ఆంధ్రరాష్ట్రనిర్మాణము వెంటనే జరుగవలసియున్న దని కొన్ని నెలలక్రిందట భూప్రదక్షిణములో వ్రాయబడినది. వాయిదా వేయవలసిన అవసరమున్నట్లు అభిప్రాయపడినవారు సూచించిన కారణములు యథార్థములే అయినయెడల, పది సంవత్సరములకే కాదు, ఎప్పటికికూడా ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకు వీలుండదు. విదేశములనుండి మన దేశమునకు ఎట్టి ప్రమాదము లేనట్టి పరిస్థితులు సంభవించినతర్వాతను, దేశములో సంపూర్ణమైన శాంతిభద్రతలు ఏర్పడినతర్వాతను, అందరికి తృప్తికరమైన ఆర్థికవిధానము ఏర్పడినతర్వాతను, ప్రజలలో జాతీయభావము, ఐకమత్యము సంపూర్ణముగ ఏర్పడినతర్వాతను భాషాప్రయుక్త రాష్ట్రములను నిర్మించవలసినదే కాని, అంతవు పూర్వము ఈ ఉద్యమమును తలపెట్టకూడ దని బొంబాయి కాంగ్రెసువారు తీర్మానించిరి. కాని ఇందులో ఏదియు పదిసంవత్సరములలో జరుగునది కాదు. ప్రపంచములో రాజ్యములు సంపాదించగోరువా రుండునంతవరకు విదేశములనుండి ప్రమాదము తప్పదు. కాంగ్రెసు, సోషలిస్టు, కమ్యూనిస్టులందరికి తృప్తికరముగ నుండు ఆర్థికవిధానము ఎన్నటికైన ఏర్పడునా ? తక్కిన సమస్యలన్నియు పరిష్కారమైనగాని భాషాప్రయుక్తరాష్ట్రముల మాట తలపెట్టకూడ దని వాదించుట అట్టి నిర్మాణమును ఎదిరించుటయే. దేశములో ఐకమత్య మేర్పడుటకుకూడ ఇట్టి నిర్మాణ మొక ముఖ్యసాధనము. కనుక నిర్మాణాభిలాషులందరు కట్టుగట్టి ఈ విషయములో పనిచేయవలసి ఉన్నది. ఆంధ్రనాయకులలో కావలసినంతటి ఐకమత్యము ఈ విషయములో లేకపోవుటయు, ప్రజలలో ఇందు నిమిత్తమై సంచలనము లేకపోవుటయు విచారణీయము.

## బర్మా, మలయా, సయాం : కమ్యూనిస్టులు

భరతఖండమున కావల ఆగస్టునెలలో మనము ముఖ్యముగ గమనించవలసినది బర్మామలయాలలోని కమ్యూనిస్టుతిరుగుబాటు. ఈ రెండు దేశములకు పొరుగుననుండు సయాంలోకూడ ఇట్టి కమ్యూనిస్టుఉపద్రవము మొలకలెత్తుచున్నది. సయాం స్వాతంత్ర్యము గల రాజ్యము. బర్మాకూడ అట్టిదే. మలయాదేశము మాత్రమే పరాయివారగు ఆంగ్లేయుల పరిపాలనలోనున్న దేశము. దేశము స్వరాజ్య మనుభవించుచుండు నట్టిదయినను, పరాయిప్రభుత్వమునకు లోబడినట్టిది

ఐనను కమ్యూనిస్టుల ఉపద్రవము తప్పకుండ నున్నది. దీనికి గల కారణములను మనము గ్రహించవలెను. కమ్యూనిస్టుల ఉద్దేశము అల్లరులను లేవదీసి ఏదో ఒకవిధమున పరిపాలనాధికారమును సంపాదించుటయే. ఈ ఉద్దేశమును సాధించుటకు ఏ దేశమందు ఎట్టి సాధన ముపయోగపడునో అట్టి సాధనమును ఆ దేశమం దుపయోగించుట వారనుసరించు రాజనీతి. మలయాలో పరాయిపరిపాలనము ప్రజలలో అసంతృప్తిని కలిగించి యుండుటచేత అచ్చట కమ్యూనిస్టులు స్వాతంత్ర్య వాదమును ఆధారము చేసికొని, మలయాకు స్వరాజ్యము సంపాదించుటయే తమ ఉద్దేశ మని చాటించు చున్నారు. బర్మాలోను, సయాంలోను ఈ చాటింపు వాసగనందున కార్మికులయు, సామాన్యప్రజల యొక్కయు శ్రేయస్సు గోరి తాము యుద్ధములోనికి ప్రవేశించినట్లు చాటించుచున్నారు. కాని ఈ చాటింపు లన్నియు అర్థములేనివి. నిజముగా కమ్యూనిస్టులు కాంక్షించుచుండునది అధికారములోనికి వచ్చుటయే. కమ్యూనిస్టులు అధికారములోనికి వచ్చుట అనగా దేశములో రషియావారి అధికారము స్థాపనమగుటయే. ప్రపంచమం దెచ్చట జూచినను కమ్యూనిస్టులు రషియావారికి అనుచరులై ప్రవర్తించుచున్నారు. ఏ దేశమందుకూడ వారు ప్రస్తుతము అధికసంఖ్యాకులుగ లేరు. అల్పసంఖ్యాకులై ఉండుటచేత రషియాయొక్క సహాయము లేక వారు అధికారములోనికి రాజాలరు. కనుక మలయాలో ఆంగ్లేయులు పరాజయము పొందుటయు, కమ్యూనిస్టులు జయము గాంచుటయు సంభవించినయెడల దాని నిజమైన అర్థము మలయాలో బ్రిటిష్‌సామ్రాజ్యాధికారము బదులు రషియాసామ్రాజ్యాధికారము సంస్థాపనమగుటయే. అదేవిధముగ సయాంలోగాని, బర్మాలోగాని కమ్యూనిస్టులకు విజయము లభించినయెడల ఆ దేశములలో రషియాసామ్రాజ్యము స్థాపింపబడుటయే. రషియావారి అధికారమును ప్రపంచమందంతట స్థాపించుటకై ఏర్పడిన ప్రధానసాధనమే కమ్యూనిస్టుపార్టీ. స్వాతంత్ర్యమునకును, స్వరాజ్యమునకును పోరుచుండువా రెవ్వరు కమ్యూనిస్టులద్వారా స్వరాజ్యము లభించునని అనుకొనుటకంటె గొప్ప పొరపాటు మరియొకటి ఉండదు.

## మలయా యుద్ధము

రెండుమాసములక్రిందట మలయాలో ప్రారంభమైన కమ్యూనిస్టుల తిరుగుబాటును బ్రిటిష్‌అధికారులు ఇంకను అణచివేయలేకున్నారు. ఇది సామాన్యమైన పితూరీ కాదనియు, దీని ఉద్దేశము మలయా సింగపూరులలో సోవియెట్ రాజ్యమును స్థాపించుటయే అనియు ఆగస్టు 3 వ తేదిన సింగపూరులోని బ్రిటిష్ రాజప్రతినిధి స్పష్టపరచెను. ప్రమాదము అత్యధిక మని తెలియవచ్చినందున అదిమొదలు బ్రిటిష్‌వారు దానిని అణచుటకు ఎక్కువ బలమును ఉపయోగించుచున్నారు. బ్రిటిష్ సైన్యములలో ఉత్తమములైన దళములు ప్రస్తుతము మలయాలోకి తేబడియున్నవి. ఆస్ట్రేలియా, అమెరికాలనుండి సైనికపరికరములు అధికముగ దిగుమతి యగుచున్నవి. కమ్యూనిస్టుశిబిరములను కొన్నిటిని బ్రిటిష్‌వారు వినాశముగావించిరి. కాని కొన్నినెలల పాటు యుద్ధము అతితీవ్రముగ జరిగినగాని మలయా తిరిగి బ్రిటిష్‌వారికి స్వాధీనమగుట సాధ్యముకాని పని.

## బర్మా యుద్ధము

బర్మా స్వతంత్రరాజ్యము. స్వాతంత్ర్యసమరములో నాయకత్వము వహించి జయము సంపాదించిన నాయకులే దానిని ఇప్పుడు పాలించుచున్నారు. కాని కమ్యూనిస్టుపక్షమువారు స్వాధికారమును స్థాపించుటకై వారిపై తిరుగబడి కొన్నిప్రదేశములను, ప్రధాన పట్టణములను కొన్నిటిని వశపరచుకొనిరి. ఇట్లుండగా గోరుచుట్టుపై రోకటిపోటన్నట్లు ప్రభుత్వపు సైన్యములోని దళములు కొన్ని తిరుగబడి కమ్యూనిస్టుల పక్షము వహించినవి. అందుచేత ప్రమాదము అధికమై, ప్రధానపట్టణమగు రంగూనుకూడ పితూరీదారుల వశమగునట్లు కనబడెను. కాని సకాలమునకు ప్రభుత్వమువారు మేల్కొని చురుకుగా పనిచేయుటచేత రంగూను శత్రువశమగుట తప్పెను. ఇతరప్రదేశములందు తీవ్రముగ అంతర్యుద్ధము జరుగుచున్నది. ఇట్టి యుద్ధ మొకదానిని ప్రారంభించుటకంటె కమ్యూనిస్టుపక్షమువారు తమ దేశమునకు చేయదగిన ద్రోహము మరియొకటి ఉండదు. బర్మాలో ప్రస్తుతము ఏర్పడిన ప్రభుత్వము ప్రజాప్రభుత్వము. ప్రచారముద్వారాను, ఎన్నికలద్వారాను అధికారములోనికి వచ్చి దేశములో క్రొత్త ఆర్థికసాంఘికరాజకీయసంస్కరణములను ప్రవేశపెట్టుటకు అన్నిపక్షములవారికి అవకాశమున్నది. కాని

ఆవిధముగ అధికారములోనికి రాగల మన్న నమ్మకము కమ్యూనిస్టులకు లేనికారణమున వారు యుద్ధవిధానమును అనుసరించియున్నారు. కమ్యూనిస్టువిధానము ప్రజాస్వామ్యసిద్ధాంతమునకు విరుద్ధమని ఋజువుచేయుటకు ఇంతకంటె ప్రబలతరమైన సాక్ష్యము అవసరము లేదు. దౌర్జన్యముద్వారా అధికారములోనికి వచ్చువారు దౌర్జన్యసాధనముద్వారా వారి అధికారమును నిలబెట్టుకొనవలసివచ్చును. అందుచేతనే కమ్యూనిస్టు ప్రభుత్వమున కంతకు దౌర్జన్యము ప్రధానాధారముగనుండుట తప్పదు. వారి పరిపాలనమునకు భయమే సాధనము. భక్తిసాధనముగాని, అభిమానసాధనముగాని వారు వాంఛించరు.

## స యా ం

ప్రస్తుతము సయాంరాజ్యములో కమ్యూనిస్టులు బలమును సమకూర్చుకొనుచున్నారు. ఇచ్చటి కమ్యూనిస్టులలో అనేకులు చైనావారు. మలయాలోని కమ్యూనిస్టులలో అనేకులు ఇట్టివారే. చైనాలో జనసంఖ్య ఎక్కువగుటచేత అచ్చటివారు వేలకొలదిగను, లక్షలకొలదిగను ఇరుగుపొరుగున నుండు సమస్తదేశములలోనికి వచ్చి స్థిరనివాసముల నేర్పరచుకొనుట మామూలు. ప్రస్తుతము సయాంలోని ౧౫౦ లక్షల జనములో 30 లక్షలు చైనావారు. ఈ చైనావారిలో కొందరు కమ్యూనిస్టుపక్షమునకు చెందినవారు. చైనాదేశమందు కమ్యూనిస్టుపక్షప్రాబల్యమే దీనికి కారణము. ఈ మధ్య సయాంలోని కమ్యూనిస్టులలో చురుకుదనము అధికమయ్యెను. కొన్నినెలలక్రిందట రషియావారు సయాంలో వారి రాయబారిని నియమించుటయు, రాయబారికార్యాలయములో రెండువందల రషియావారు ఉద్యోగస్థులుగ వచ్చుటయు, వీరిద్వారా కమ్యూనిస్టుప్రచారము తీవ్రముగ జరుగుచుండుటయు, దీనిఫలితముగ సయాంకమ్యూనిస్టులలో నూతనచైతన్యము కలుగుటయు గమనింపదగిన విషయములు. కమ్యూనిస్టుల మూలముగ తమకు ప్రమాదము రావచ్చునని సయాంప్రభుత్వమువారు గ్రహించి, అందుకై తగిన చర్యలను జరిపించుటకు సిద్ధపడియున్నట్లు తెలియుచున్నది.

## చై నా

సయాం, మలయా, బర్మాలలోని కమ్యూనిస్టులలోని సంచలనమునకు కారణము చైనాలో ఇటీవల కమ్యూనిస్టుపక్షమువారి విజయములు కారణము. చైనాదేశమందు కమ్యూనిస్టులకును, చియాంగ్ కై షేక్ నాయకత్వమున ప్రజలను పాలించుచుండు జాతీయపక్షమునకును కొన్నిసంవత్సరములుగా యుద్ధము జరుగుచుండుటయు, ప్రస్తుతము దానిలో కమ్యూనిస్టులకే ఎక్కువ జయము లభించుచుండుటయు అందరికి తెలిసియున్నది. చియాంగుకు దేశములో గల పలుకుబడి ఇప్పటికి చాలవరకు తగ్గినది. అతని పక్షమునుండి చీలిపోయినవారు కొందరు ఆగస్టులో కమ్యూనిస్టులతో సంప్రతింపులు జరిపి, ఒక మిశ్రప్రభుత్వమును స్థాపింపజూచుచున్నారు. ఇదియే జరిగినయెడల కమ్యూనిస్టులు తూర్పుఏషియాయందంతట విజృంభించుటకు ఎక్కువ అవకాశ మేర్పడును.

## కొ రి యా

ఈనాడు ప్రపంచదృష్టిని ఆకర్షించుచుండు దేశములలో 300 లక్షల జనముతో కూడిన కొరియాదేశ మొకటి. ఇది చైనాకు పొరుగుదేశము. జపానువారి పాలనలో నుండినది. రెండవ ప్రపంచయుద్ధమందు జపానువారు ఓడిపోయినతర్వాత ఇందులోని ఉత్తరభాగమును రషియనులును, దక్షిణభాగమును అమెరికనులును వశపరచుకొనిరి. కాని ఈ పరాయిప్రభుత్వము తాత్కాలిక మనియు, కొరియనులకు సంపూర్ణస్వాతంత్ర్యము నిచ్చి, దేశమంతటికి ఒక ప్రభుత్వమును స్థాపించుట తమ ఉద్దేశ్య మనియు వీరు ౧౯౪౫ లో ప్రకటించిరి. అందుకై అమెరికనులు, రషియను కొన్ని సభలు జరిపిరిగాని వారిమధ్య ఎట్టి సమాధానము ఏర్పడలేదు. అందుపై అమెరికావారు కొరియావిషయమును ఐక్యరాజ్యసమితిద్వారా పరిష్కారముచేయనెంచిరి. ఈ సమితివారు ఒక ఉపసంఘమును నియమించి గతమే మాసములో స్వాతంత్ర్యప్రభుత్వసంస్థాపనమునకై ఎన్నికలను జరిపిరి. కాని రషియనులు ఈ ఎన్నికవిధానమును అంగీకరించక వారి యాజమాన్యమందుండిన ఉత్తరకొరియాలో కమ్యూనిస్టు విధానమును ప్రవేశపెట్టి అచ్చటి ౧౦౧ లక్షల జనము ఈ ఎన్నికలను బహిష్కరించునట్లు చేసిరి. కనుక దక్షిణకొరియాలోనివారు మాత్రమే ఇందులో పాల్గొనిరి. దానిమూలమున ఏర్పడిన జాతీయమహాసభవారు ఒక అధ్యక్షుని ఎన్నుకొనిరి. ఆగస్టు ౧౫ వ తేదీన ఇతనికి దక్షిణకొరియాలోని అధికారమును అమెరికావారు ఒప్పగించిరి. కాని ఇతని అధికారము దక్షిణకొరియా

యందు మాత్రమే చెల్లుచున్నది. రషియావారి వశమందుండు కమ్యూనిస్టుఉత్తరకొరియా ప్రత్యేకరాజ్యముగ నున్నది. ఈ విభజనమూలమున ఈ రెండు రాజ్యములకు అంతర్యుద్ధము సంభవించు సూచనలు కనబడుచున్నవి. ఎక్కడ జూచినను రషియావారు సమర్థించు కమ్యూనిస్టువిధానమునకును, అమెరికావారు సమర్థించు ప్రజాస్వామ్యవిధానమునకును పొత్తు కుదురుట లేదు.

## మధ్యప్రాచ్యము

తూర్పు ఏషియాఖండపు దేశములలోని పరిస్థితులు ఈవిధముగ నుండగా ఆగస్టునెలలో మధ్యప్రాచ్యమందుగాని, యూరపుఖండపు దేశములందుగాని గమనింపదగిన విశేషము లేవియు విస్తారము లేవు. మధ్యప్రాచ్యములో యూదుల ఇస్రేల్ రాజ్యమునకును, అరబ్బీరాజ్యములకును మధ్య స్థిరమైన రాజీ ఇంకను కుదురలేదు. కుదురు సూచనలుగూడ ఏవియు కనుపించకున్నవి. యూదురాజ్య మొకటి ఉండకూడదని అరబ్బీలు వాదించుచున్నను, అట్టి రాజ్యము స్థాపింపబడుట జరిగెను. అది దినాదినాభివృద్ధి గాంచుచున్నది. దానిని రద్దుచేయుట అరబ్బీలకు సాధ్యముకాని పని. ఈ విషయమును వారు ఎంత వేగము గుర్తించిన అంత మంచిది.

## యూరపు

యూరపుఖండములో రషియాకును, పశ్చిమ రాజ్యములకును మధ్య బర్లిన్ దిగ్బంధనవిషయమై ఏర్పడిన సమస్యను గురించి ఆగస్టు నెలలో మాస్కో పట్టణమున అనేక సంప్రతింపులు జరిగెను. వాటి ఫలితముగ బర్లినులో ప్రస్తుతము ఆయా రాజ్యముల ప్రతినిధులు కలిసి ఒక సభ చేసి వివాదవిషయములను గురించి ఆలోచించుచున్నారు. ఇట్టి సమాలోచనకు ఇదివరలో రషియనలు అంగీకరించనందున రెండు మాసములనుండి స్తంభన మేర్పడి మూడవ ప్రపంచ యుద్ధము వచ్చునేమో అన్న భయమును కల్పించినది కాని సమాలోచనలకు వారిప్పుడు సిద్ధపడినందున యుద్ధ మవసరములేకయే విషయపరిష్కారము జరుగునను నమ్మకము కలుగుచున్నది. ఇది శుభసూచకము.

(1-9-'48)



# దైవసంకల్పం!

[ఏకాంకిక]

శ్రీ డి. యస్. పరమేశ్వరరావు

[ముఖ్యపాత్రలు:—సుబ్బారాయుడు: యజమాని; కామాక్షమ్మ: ఆయనభార్య; దామోదరయ్య: దగ్గిరబంధువు; మంగమ్మ: ఎరిగివున్న విధవరాలు; నాంచారమ్మ: బిచ్చకత్తె; మార్వాడీ: అప్పుదారుడు]

## ౧ వ రంగము

(పూజాగృహంలో కామాక్షమ్మగారు. సుబ్బారాయుడుగారు లలితాసహస్రనామం చదువుతూంటారు.)

కామా: ఇదిగో చూడండి. ఈపూటకు యీ లలితాసహస్రనామం అయింతరువాత లక్ష్మీఅష్టోత్తరం చదవండి. రాత్రికి బాలాసహస్రనామం చెయ్యొచ్చు.

సుబ్బా: అలాగేకాని, ఆ దీపారాధనలో మరి కాస్త నూనె పోయి. యిందాకా అమ్మవారికి నైవేద్యం పెట్టావా?...ఊఁ, సరే. ఓం ఐం హ్రీం శ్రీం జగన్మాత్రే నమః, కాళీరూపిణ్యై నమః, సర్వవ్యాధిచికిత్సకై నమః, సర్వకామ్యసిద్ధ్యర్థాయై నమః, కాలచక్రస్వరూపిణ్యై నమః ఓం...

శతాక్షరీ శతానందీ శతమాయుష్యవర్ధనీ
శతకోటిధనం దేహి...

(బిగ్గరగా గొంతు చించుకుని)

శతకోటిధనం దేహి శాంకరీ శాంతరూపిణీ...

(మంగమ్మగారు ప్రవేశం)

కామా: ఓహోహో! మంగంపిన్ని వచ్చిందే! రా పిన్నీ, రా......నీకోసం నిన్నంతా చూశాం. జాడాయే లేదు. మంచినీళ్ళు కావాలా?

సుబ్బా: ఆ శరీరాన్ని యీడ్చుకు రావద్దూ అంతదూరంనుంచి...కూర్చోవమ్మా ఆ చాపమీద.

మంగ: ఓహోహో! ఏం పూజ, ఏం భక్తి! నిజంగా ఎన్నో పూజలు చూశానుగాని యింతసరంజామా ఎక్కడా చూళ్లేదు. మాఅమ్మ...అబ్బ! ఎంత దేదీప్యమానంగా వెలుగుతోందో! ఆహా! ఏం కళ, ఏం స్వరూపం! అమ్మాయి! కామాక్షీ! నిజంగా నీ జన్మ తరించింది.

కామా: నిన్న చూడకపోయావు ఆ కాళీ స్వరూపాన్ని...ఆ భయంకరమంతా కళ్ళల్లోనే వుంది. ఎంతో ఉగ్రంగా కనిపించింది పిన్నీ...

సుబ్బా: సరేలే. ముందు పూజ కానీ. నేను తొందరగా అవతలికి వెళ్ళొచ్చి పారాయణ చేసుకోవాలి.

కామా: కానీండి, చదవండి సహస్రనామం.

## ౨ వ రంగము

(భోజన సమయం)

కామా: ఏం పిన్నీ! నీకోసం ఎదురుచూస్తూ వున్నాం. ఇంకో వారంరోజుల్లో వస్తుందిట డబ్బు. కాస్త యీ నాలుగురోజులూ సహాయంచేద్దూ. ఒక రెండు వందలు సర్దేస్తే మళ్లీ బుధవారం తిరిగి తీసుకుందువుగాని. ఏం పిన్నీ?

మంగ: ఈ కష్టసమయంలో సహాయం చెయ్యకపోతే యిం కెప్పుడు చేస్తానే? అలాగే. సాయంత్రం నోటు రాసిచ్చేస్తే పోతుంది. బుధవారం కాకపోతే ఆ పై బుధవారం యిద్దువుగాని.

కామా: ఇంతకీ నా కష్టాలు గట్టెక్కలేదు. ఆ దేవిని నమ్ముకున్నాంగాబట్టే యిట్లాగన్నా గడుస్తోంది. ఇంతకీ యింకా పూర్తిగా అమ్మవారికి మామీద దయ రాలా! మొన్న శుక్రవారంనాడే ఓ వంద గొబ్బరికాయలు కొట్టాం. ప్రతిశుక్రవారం కొట్టా లన్నాను

స్వాములవారు. నిజంగా పిన్నీ! అప్పుడు ఆ దేవీ విగ్రహంనుంచి రెండు పూలు పడ్డయి! ఆమె కదిలి వచ్చినట్లుంది. ఆరోజు రాత్రే నిద్దర్లో ఒక ఎనిమి దేళ్ళ పిల్ల నానోరు తెరిచి 'యిదిగో, ఐశ్వర్యపు కీల్లీ' అంటూ నోట్లో కుక్కిపోయింది పిన్నీ!......

మంగ : అదృష్టవంతురాలవే నువ్వు నిజంగా. ఈ ప్రపంచంలో ఆ భాగ్యం యింకోరికి కబ్బుతుందిటే కామాక్షీ?...

కామా : మంగంపిన్నికి యింకా రెండుగార్లు వెయ్యండి. సిగ్గుపడుతూంది. నెమ్మదిగా కూచో పిన్నీ. పరమాన్నం కావాలా?

మంగ : అమ్మో! యింకేం అక్కర్లా. అయితే, సరేగాని, నోటుబిళ్ళ యింట్లో వుందా? లేకపోతే నా గోవిందగీతాల పుస్తకంలో వున్నయిలే...

### ౩ వ రంగము

(సుబ్బారాయుడుగారు, కామాక్షమ్మగారు తీరికగా కూర్చునివుంటారు.)

సుబ్బా : ఏయి, యిదిగో! దీక్షితులుగారి దయ వల్ల శనిగ్రహాదిదానాలు పూర్తిఅయినయి. కాస్త గుణం చూపించిందల్లే వుంది. కాదూ?

కామా : అమ్మవారి దయ వుంటే ఏపనులైనా సక్రమంగా నడుస్తయి. అయితే మీ జాతకంలో ఎప్పట్నించి అన్నారు చంద్రమహర్దశప్రారంభం?

సుబ్బా : వచ్చే ఏప్రియిల్ నెలాఖరునుంచి. ఆ చంద్రమహర్దశనే చూడాలిసివుంది. ఒక ధనపుసంచి దార్లోనో, లేక ఒక పావలా లాటరీటిక్కెట్టులో ఒక లక్షరూపాయలో తప్పక దొరకితీరుతుందని, దానికి గ్రహబలం చాలా గొప్పగా వుందని రాసివుంది. ఎట్లా జరగనుందో?

కామా : అడిగినవారికి అభయాల్ని యిచ్చే తల్లి ఉండగా, మన కేముంది? అయితే స్వాములవారి మీద దావా ఏమయింది?

సుబ్బా : ప్రొద్దున్నే దామోదరయ్యను పంపిం చాను. వాడు అనుకుంటే తప్పక పనిచేసుకొస్తాడు. మన ప్లీడరుగారుకూడా చాలా గొప్పవాడు. సాకూ,

వాడికి ఆ మఠంట్రస్టీమెంబర్ షిప్ రావటమేకాకుండా, మన స్వాములవారుకూడా ఆ మఠంలో శాశ్వతంగా ఉంటారు. ఈపాటికి దామోదరయ్య రావాలి. ఆ కాస్తపనికూడా అయిపోయిందంటే మనస్సు కొంచెం కుదుటపడుతుంది. అడుగో! మాటల్లోనే వచ్చేశాడు. వెయ్యేళ్ళాయుస్సు!

(దామోదరయ్య ప్రవేశం.)

సుబ్బా : ఏంరా దామాయి! వెళ్ళొచ్చావా, గుంటూరు?

దామో : గుంటూరు వెళదామని బెజవాడ స్టేషన్లో రైలెక్కాను. ఇంతలో ఒక కునుకు పట్టింది. లేచి చూసేసరికి ముందు రాజమహేంద్రవరం స్టేషన్ వచ్చింది. అతరువాత యీ లైను కాదేమోనని సందేహం వేసింది. అయినా చూద్దా మనుకుంటే ఆ తరవాత నిడమానూ రొచ్చింది. అప్పుడు ఈలైను కాదని ఓనిర్ధారణకు వచ్చాను. సరే, ఆ స్టేషనులో దిగి ఒకాయనింట్లో భోంచేసి తిరుగుబండీ ఎక్కివచ్చేశాను.

సుబ్బా : ఓరి నాగమ్మా! నిన్ను ప్రొద్దున అనంగా పంపిస్తే యిదా నువ్వు చేసింది?

దామో : ఏదో పొరపాటు జరిగింది లేరా! ఈమాత్రానికి ఏంఖరవాలేదు. దావా ఎల్లుండిగా! మన లాయరుపేరు వింటేనే అవతలపార్టీవాళ్ళకు హడల్. మొన్న మద్రాసు ఫుల్ బెంచిహైకోర్టులో ఆయన వాదిస్తాంటే గంట గణగణ మోగించినట్లయింది. సెక్షన్ ౧౦౬ సి. పి. సి (C. P. C.) లో ఏముం దంటే...

సుబ్బా : అక్కర్లేని ప్రసంగం చెయ్యకు. నిన్ను మాట్లాడించినవాళ్లది బుద్ధిపొరపాటు. రేపు చీకటితో అన్నా బయల్దేరి వెళ్లు.

(నాంచారమ్మ ప్రవేశం)

నాంచా : సుబ్బారాయుడుగారు ఉన్నారండీ?

సుబ్బా : ఆఁ, నేనే...ఏం పని?

నాంచా : అహాఁ, మీరా? మీ కీర్తి దశదిశలా వ్యాపించింది. అబాలగోపాలమూ మీ దైవభక్తికి, ధర్మానికీ వేనోళ్ల కొనియాడుతోంది. మీరు చాలా

ధర్మాత్ములని మీవద్దకు వచ్చాను. మా అబ్బాయిని స్కూల్లో ప్రవేశపెట్టడానికి కావలసిన డబ్బు దొరక్క చాలా బాధపడుతున్నాను. మీరు కటాక్షిస్తే...

సుబ్బా: నావద్ద యిప్పు డేం లేదమ్మా. రేపు రా. రేపు వస్తే...

కామా: (నెమ్మదిగా) అహహా, అట్లా అనకండి. దేవి యీ రూపంలో యీ లేనిసమయంలో వచ్చి మన్ని పరీక్షిస్తోంది. చూడండి. ఆమె విధవరాలు అయినా ఆ మొహంలో ఎంత లక్ష్మీకళ వుందో!

దామో: (నెమ్మదిగా) ఇది పూర్ణానందంపేట మనిషి. దీన్ని నేను పూర్తిగా ఎరుగుదును. దీనికి చింత చచ్చినా పులుపు చావలా..

కామా: ఛీ, తప్పు. అట్లా అనగూడదు. ఆమె ఏదైతే మన కేం? అయినా చిన్నతనపు చిలిపితనం ఎవరికి ఉండదు? కాని నాకుమాత్రం ఆమె అవతార మూర్తి అని అనుమానింపజేస్తోంది. (బిగ్గరగా) ఉండమ్మా వుండు. (లోపలికి వెళ్ళి తిరిగివచ్చి) ఇవిగో, యీ అయిదురూపాయలు తీసుకుపోయి మీఅబ్బాయిని స్కూల్లో ప్రవేశపెట్టు. వెళ్ళమ్మా.

నాంచా: నిజంగా మీరు ఎంత ధర్మాత్ములండి! ఈ కష్టసమయంలో రక్షించారు. భగవంతుడు మీకు ఆయురారోగ్యఐశ్వర్యా లిచ్చి రక్షిస్తాడు. వెళ్తున్నానమ్మా.

కామా: మంచిది.

## ౪ వ రంగము

(సుబ్బారాయుడుగారు సావిట్లో అటూ ఇటూ పచార్లు చేస్తూంటాడు. కామాక్షమ్మగారు పడకకుర్చీలో కూర్చుని వుంటుంది.)

సుబ్బా: సంవత్సరం గడిచింది. ఏమీ కలిసి రావటంలేదు. అప్పు చూస్తే అరవై వేలదాకా వుంది. పూజలకి, దానాలకి, దెయ్యాలకి, గ్రహాలకి, పూనకాలకి మొత్తం యీ సంవత్సరం ఓ మూడువే లైంది. జాతకం చూస్తే నష్టజాతకంలా తోస్తోంది. దీనికి ఉపాయం ఏమీ తోచడంలేదు. ఏదో కొంపకోసం ఏడుస్తున్నాడని వుందున్న పాళ యిస్తే ఆ దీక్షితులు వెధవ కొన్ని సెల్లించి, యింట్లో తుచ్ఛపుపాదులు పెట్టి దేవినోరు కట్టేస్తే దాన్ని విడిపించుకోడానికి హాను మంతయ్యకు ఆరువంద లైంది. ఏం దారి...

(మంగమ్మ ప్రవేశం)

మంగ: ఏం నాయనా! నన్ను యివ్వాళ రమ్మన్నావ్. వచ్చాను. యింట్లో నాకు బహు యిబ్బందిగా వుంది. ఏమంటావు?

సుబ్బా: ఇంకా రాలేదమ్మా. ఓ మూడురోజులాగాలిసొస్తుంది.

మంగ: ఏం మూడురోజులు? ఇట్లా మూడు, మూడని మూన్నెల్లు చేశావు. ఎంతకాల మని ఓపిక పట్టను? నాయిబ్బంది లేం గమనించవేం? (ఏడుస్తూ) ఇంతకీ యిది నా ఖర్మ. డబ్బు దాచుకోలేక మురికి గుంటలో పోశాను. (ఏడుస్తుంది.)

కామా: ఎందుకు పిన్నీ, శుక్రవారంపూట అట్లా ఏడుస్తావ్? నీ డబ్బెక్కడికీ పోదులే. కాస్త ఓపికబట్టు.

మంగ: ఎన్నాళ్లని ఓపికపట్టనే. నాకూ యిబ్బందిగానే వుంది. ఏం చెయ్యను? సరే, బుధవారం నాడు వస్తాను. అప్పుడు నోటుకూడా తెస్తాను. పూర్తిగా యిప్పించాలి. డబ్బివనపోయింపుకు మాత్రం బీదముండని, బాధపెట్టకండి. వెళ్లొస్తా.

## ౫ వ రంగము

(కామాక్షమ్మ మధ్యాహ్నం దేవీపూజ అయిం తరువాత పాట పాడుతూంటుంది.)

కామా:

బాల త్రిపుర నాపై పంత మేలనే? ॥బా॥
ఇందూశేఖరూనీ యింతీ నీ వనుచూను...

ఏయ్, ఇహ వడ్డించమనండి. ఆలస్యం నాదేం లేదు. వచ్చేస్తున్నా.

సుబ్బా: ఆ( ఆ(.

కామా:

(పాట)

ఇందూశేఖరూని యింతీ నీ వనుచూను
మందయాన నిన్నూ మదిలోనే వేడితి ॥బా॥

ఒక గొంతు : విస్తళ్ళ కట్ట ఎక్కడుంది ?

కామా : అదిగో, ఆ కూరగాయల బీరువామీద ఉంది. చూడండి.

(పాట)

బాల త్రిపుర నాపై పంత మేలనే ?
ఓంకారప్రియ, నిన్ను ఎంతో వేడుకొందు.

సుబ్బా : ఇదిగో, యిందాకా నే తెచ్చిన అయిదొందలు అమ్మవారిదగ్గిర పెట్టావా ?

కామా : పూజకు ముందే పెట్టేశాను. యీ కుంకం తీసికెళ్లి తలా కాస్తా పెట్టుకోండి. ఇవ్వాళ్లా అబ్బాయి ఒళ్లు తెలియకుండా పడుకున్నాడు. యీ తీర్థం కాస్త తీసుకెళ్లి యివ్వండి. జ్వరం కాస్త తగ్గ మొహం చూపిస్తుంది.

(పా ట)

ఓంకారప్రియ, నిన్నూ ఎంతో వేడుకొందు;
ఏమీ చేతునే
శంకారవల్లాభే, చేకొని రక్షించు
సంతాపంబులు దీర్చి సరగూన రక్షించు.

(కసురుకుంటూ) నెమ్మదిగా వడ్డించరాదటా, ఊఁ, రొండా, మీరూను. పిల్లలక్కూడా వడ్డించండి.

(పా ట)

బాలా త్రిపుర నాపై పంత మేలనే
అమ్మా నాదు మనవి ఆలకించవమ్మా
అర్ధనారీశ్వరీ ప్రార్థాన వినవమ్మ.

సుబ్బా : ఏయ్ వడ్డనైంది, నీదే ఆలస్యం.

కామా : వచ్చే, వచ్చే ! ఒక్క నిమిషంలో యీ కొత్త మొక్కూ తీర్చుకుని ఔపోసనకు పంచ పాత్ర తెస్తున్నా.

(పా ట)

బాల త్రిపుర నాపై పంత మేలనే. ॥బా॥

(మార్వాడీ ప్రవేశం)

మార్వా : సుబ్బారాయుడుగారూ ! సుబ్బారాయుడుగారూ.

సుబ్బా : భోజనానికి వస్తున్నాం. ఎవరో కాసేపు ఆగండి.

మార్వా : ఆగటాని కీల్లేదండి. బయటకు రాండి. నేను మార్వాడీని.

సుబ్బా : (స్వగతము) ప్రొద్దుట్నుంచి యీ అప్పులవాండ్లు ఓ పదిమందిదాకా వచ్చారు. సమాధానం ఎన్నిరోజులని చెప్పను ? అబ్బ ! తలప్రాణం తోకకు వస్తోంది. (బయటకు వచ్చి దగ్గరగా) ఏం సేఠ్జీ! రేపు సాయంత్రం తప్పకుండా వస్తుంది డబ్బు. యిక నువ్వు రానక్కర్లేదు. నేనే స్వయంగా వచ్చి యిస్తాను.

మార్వా : నీ కేమైనా బుద్ధి అనేదే వుంటే మమ్మల్ని యిట్లా తిప్పించనయ్యా. ఎన్నిసార్లు అయ్యా ! రేపు రా, యిప్పుడ్రా, రేపురా! దీనికి అంతు ఎప్పుడయ్యా ?

సుబ్బా : మర్యాదగా మాట్లాడు మాటలు మిగలనద్దు. రేపు తప్పక మీడబ్బు డ్డీతో సహా యిస్తాను.

మార్వా : ఇది చివరసారి రాటం. ఇంక రాను. రేపుసాయంత్రం మాకు అందకపోతే, రిజిస్టరీ నోటీసు మీకు అందుతుంది. (వెళ్తాడు.)

(సుబ్బారాయుడుగారు లోపలి కొస్తారు.)

ఒక గొంతు : సుబ్బారాయుడుగారూ ! సుబ్బారాయుడుగారూ !

కామా : మళ్లీ ఎవరో పిలుస్తున్నారు.

సుబ్బా : పిలవనీ. స్ స్...నాప్రాణం తెగుతోంది. నువ్వు వెళ్లి 'యింట్లో లే'డని చెప్పు.

కామా : (బయటకు వచ్చి) వారు యింట్లో లేరండి.

గొంతు : లేరా అండి ! పోనీండి. వారొచ్చిం తరువాత, మాయింట్లో గృహప్రవేశం, భోజనానికని చెప్పండి. వెళ్లొస్తా.

కామా : భోజనానికా !

## ౩. వ రంగము

(రాత్రిపూట : సుబ్బారాయుడుగారు, కామాక్షమ్మగారు)

సుబ్బా : ఆస్తి అంతా అప్పులపాలైంది. చివరకు యీ యిల్లుకూడా మిగలకుండా పోతోంది. యిదిగో ! వాళ్లు రేపే వేలానికి వస్తారట.

కామా : బాలమ్మకు యింకా దయ రాక పోయె. దైవసంకల్పం.

సుబ్బా : దైవసంకల్పం! దేవీపూజలని, పూనకాలని, సంతర్పణలని, దయ్యాలకని, చేతబడులబాగులకని, జాతకాలకనీ పరిస్థితులు యింతవరకు తీసుకొచ్చావు.

కామా : మన జాతకంలో యిలా రాసివుంది గాబోలు. కానీండి. ఎట్లా జరగాలో అట్లా జరుగుతుంది. తప్పుతుందా ?

సుబ్బా : చాల్లే, అపు నీ వేదాంతం ! ఏళ్ల తరబడి, ఎంతమందిని మేపావు ? యిప్పుడొకళ్లయినా మనమొహం చూస్తున్నారూ ? పూజలతో నువ్వు ప్రాణం తీసుకుంటున్నావు, నాప్రాణం తీస్తున్నావు.

కామా : ఇదేమిటి, నెలరోజుల్నించి యిట్లా మొదలు పెట్టారు? అమ్మవారికి అట్లా అంటే కోపం వస్తుంది. తలలు పగిలి చచ్చిపోతాం.

సుబ్బా : ఇప్పుడు చాపక బ్రతికివున్నామా ? ఏన్నాడో చచ్చిపోయాం రేపటితో యీ యింటికి కూడా స్వస్తి. మనకి ఒక్క గుడిసె, రాగిచెంబు. మిగుల్తుంది. వాటిని చూసి సంతోషించు.

కామా : నాకు తల తిరుగుతోంది. అబ్బా ! ఈరాత్రికి నన్ను మాట్లాడించకండి.

౭ వ రంగము

(పొరుగింట్లో యిద్దరు వ్యక్తులు మాట్లాడుకుంటూంటారు.)

మొదటి వ్యక్తి : ఇదిగో చూశారా భావగారూ ! మొన్నటిదినం తెల్లవారేప్పటికి, అర్ధరాత్రివేళ కామాక్షమ్మగారు ఎవరితోనూ చెప్పకుండా లేచిపోయిందని వార్త. విన్నారా ?

రెండవ వ్యక్తి : అవును. ఇప్పుడే తెలిసింది. అరోజు కాళరాత్రివేళ ఒక ఎరిగివున్నాయన ఎదురొస్తే "ఎక్కడికమ్మా, యింత ప్రొద్దువేళ ?" అని అడిగాడట. 'తీర్థానికని' చెప్పి గబగబా వెళ్లిపోయిందట.

మొదటి : ఉన్నంతకాలం సుబ్బారాయుడుగార్ని పీక్కేసింది. నాశనం అయ్యేదాకా వూరుకోలేదు, ఆ శక్తిస్వరూపిణి !

రెండవ : అవునండీ, లోబడిపోయిన భర్తదగ్గర కొన్నికొన్ని శక్తులు అట్లాగే చేస్తాయండి. ఆమె చిన్నతనపు జీవితానికీ, పెద్దతనపు జీవితానికీ చాలా తేడా వుంది. రానురాను మొగుడంటే అదోవిధమైన ద్వేషభావం చూపేదట. సరే, పూజలు అసలు నిష్ఠగా చేసేదేకాదు. 'తన ఆస్తి' అనే మాటే లేదు. ఆస్తి నాశనం అవుతూంటే ఒకరకమైన కనుపించని ఆనందం పొందుతూండేది, విచిత్రవ్యక్తి !

మొదటి : పాపం, సుబ్బారాయుడుగారు నిన్నటినుంచి మంచంపట్టారు, విపరీతమైన జ్వరం. ఆ జ్వరంలో సంధికూడా పుట్టిందట.

రెండవ : అది సంధిగాదండీ......ఆయన భవిష్యత్ జీవితానికి అది నాంది అని అనుకుంటున్నారు.

మొదటి : మనకళ్లఎదటే ఎంతటివారు ఎంత లోకి మారారు. దైవసంకల్పం.

౮ వ రంగము

(పది సంవత్సరాలు గడిచిన తరువాత)

సుబ్బా : (ముసలిగడ్డం, మాసిన తల, చింపిరి బట్టలతో)

కళాతురీ కళానందీ...

కళకోటిధనం దేహి...

ఆ కళకోటిధనం యీ రాగిచెంబులో పోయిపోశావా, లేదా ? పట్టకపోతే పట్టిస్తాను. ఇంకో చెంబు తెస్తాను...

(పైన, చెట్టునుంచి ఒక ఎండు రెమ్మ విరిగి మీద పడుతుంది.)

సుబ్బా : బాబోయి, నన్ను కొట్టకండి. మీ డబ్బు రేపు పాయర్త్రం యిచ్చేస్తాను. రైటుకొట్టు

యిహనుంచి కొంటాను. చెంబులో డబ్బు మాఆవిడ కిచ్చేశాను. నాదగ్గి రేమీ లేదు. మార్వాడీ నడగండి; కావలసినంత యిస్తాడు.

(ఆ పిచ్చివాణ్ణి చూడటానికి అక్కడకు జనం పోగయి, వాళ్ల భాషలో ఏదో మాట్లాడుకుంటు న్నారు.)

సుబ్బా: తిట్టకండి. వెళ్లండి. పగుగెత్తండి. తాళట్టు పెట్టండి. వడ్డీ ఎంతైనా సరే. పాండి. నేను పారాయణ చేసుకోవాలి. బియ్యం అడుక్కోవాలి. వండుకు తినాలి. దయ్యాలు, భూతాలు యిక్కడికి రావు. వస్తే మా అమ్మవారు లేదూ యీవూళ్లో... (ఊళ్ళోకి కర్రసహాయంతో నెమ్మదిగా పోతాడు. బిచ్చమెత్తుకుంటూ ఒక యింటిముందు నిలబడి—)

సుబ్బా: కాశీయాపిణ్యై నమః, జగన్మాత్రే నమః, తల్లీ, బియ్యం. ఇదిగో రాగిచెంబు.

(ఆ యింట్లోంచి కామాక్షమ్మ చిరిగిన గుడ్డల్తో, చింపిరి జుట్టుతో, వంగివంగి నెమ్మదిగా నడుస్తూ ప్రవేశం.)

కామా: ఏయ్ అబ్బీ, యిప్పుడేం లేదు, ఫళ్లు.

సుబ్బా: రాగిచెంబు తెచ్చాను. బియ్యం పొయ్యండమ్మా. టిక్కట్టుకు డబ్బు ల్లేవు. మా ఆవిడ వద్ద వున్నయి. బియ్యం తల్లీ.

కామా: (స్వగతం) పాపం! ఎవరో తెలుగు వాడికి పిచ్చి ఎక్కింది. దైవసంకల్పం. (బిగ్గరగా) ఏయ్ అబ్బీ! కాసేపు ఆగు. లోపల్నుంచి బియ్యం తెస్తాను.

(కామాక్షమ్మ లోపలకు వెళ్లి బియ్యం దోసిట్లో తెస్తుంది.)

సుబ్బా: తీసుకురామ్మా! తీసుకురా. ఇదిగో, యీ రాగిచెంబులో పోయి. శతకోటిధనం పట్టే రాగి చెంబు. ధనం లేకపోతే మార్వాడీ వడుగు...

శతాక్షరీ శతానందీ
శత మాయుమృత్యుహరణీ
శతకోటిధనం దేహి
(బిగ్గరగా) శతకోటిధనం దేహి...

(కామాక్షమ్మగారు యిది విని నిర్ఘాంత పోయింది. దోసెడు బియ్యం జారవిడిచి నేలకు కూలి పోయింది.)

సుబ్బా: అమ్మో! బాబో! దయ్యాలు, భూతాలు! పట్టుకోండి, పట్టుకోండి! (అని అరుస్తూ ఆ రాగిచెంబు అక్కడ పడవేసి, చరచరా పోతాడు.)

(దూరాన వున్న చెట్టుమీదినుంచి ఒక తీతువు పిట్ట ఏడుస్తూ ఎగిరిపోయింది.)



# కలగూరగంప

## సాహిత్యంలో - స్వాతంత్ర్యం

౧౯౪౭ ఆగస్టు ౧౫వ స్వాతంత్ర్యము లభించినది రాజకీయ స్వాతంత్ర్యం సిద్ధించింది. సాంఘికంగా కూడా కొంత స్వాతంత్ర్యం లభ్యమైంది. ఆర్థిక స్వాతంత్ర్యం అనుకున్నంతగా అందలేదు. సాహిత్య స్వాతంత్ర్యంమాత్రము అందుబాటులోకి వచ్చినట్లు నిశ్చయించుకోవచ్చు.

స్వాతంత్ర్యమువలె సాహిత్యముకూడ నవ్య స్వరూపమే. అందనేకమార్గముల నవలోకించవచ్చును. ఆయా విభిన్నమార్గములను పరికించుటకు తగిన సారస్వతహృదయ మావశ్యకము. సర్వవిధముల సాహిత్యములోని స్వాతంత్ర్యమును ప్రధానముగా అందరూ అంగీకరించిన విషయమే.

స్వాతంత్ర్యపదనిర్వచనమువలె సాహిత్యపదనిర్వచనముకూడ అనేకులు అనేకవిధముల జూపిరి. ఏది ఎట్లయినా సాహిత్యమును తెల్పగలసివచ్చినపుడు "అనిర్వచనీయం సాహిత్యం" అని ఆనందవర్ధనాచార్యుల వాక్కులలోని అంతరంగికనిగూఢభావమును జ్ఞప్తియం దుంచుకొనవలయును. సాహిత్యములో చతుర్వర్గములు చతురంగా నిరూపింపబడినది. వేదవాఙ్మయములో పురుషార్థచతుష్టయం పాపహారిగా నిబంధింపబడినది. సాహిత్యసారస్వతవాఙ్మయంలో ధర్మాదులు పవిత్రంగా ప్రతిష్ఠింపబడినవి. అందు తృతీయపురుషార్థములోని పవిత్రప్రేమమయమగు శృంగారమును సాహిత్యం ప్రధానం చేసుకొన్నది. సాహితీకన్యకు ఆ శృంగారమే స్వాతంత్ర్యసౌభాగ్యమును చేకూర్చును. ఒకానొక కాలమున అనుభవింపబడిన స్వాతంత్ర్యమే నేడు మనకు నవత్వమును సంపాదించినట్లు, పూర్వకాలమున పరిచితములైన భావములే రసపరిగ్రహణమువలన నవ్యాకారమును పొంది నవతత్వమును ప్రస్ఫుటితముచేయును. చెట్లు పాతవైనా వసంతఋతువులో క్రొత్తదనమును చూపించునట్లు సాహిత్యముకూడా నవ్యమై జనాకర్షక మగుట లోకవిదితమే కదా! ఒకే వస్తువు ఉపాధిభేదమున భిన్నరూపములు పొందునట్లు సాహిత్యశ్రీ ఆకారభేదములలో అవతారచాతుర్యములను చాటుచుండును. ఇట్టి సాహిత్యమును అందరూ నవ్యరూపమున ఆరాధించుదురు. భిన్నభిన్న పదముల సాహితీకన్య విహరించునపుడు భావకులు వారివారి భావనామహిమచే అనేకరీతుల అందచందాలను అనునయింతురు. నాటి సాహిత్యశోభను సహృదయులు భావించి, మననించి, తన్మయత్వమున గేయరూపాన సాహిత్యస్వాతంత్ర్యమును లోకానికి అందింపజాలుదురు. నవరసములు గుణత్రయముచే పరిగుణితమైనపుడు సప్తవింశతి (౨౭) సరసాన సాహిత్యము ప్రకాశించును.

దుర్బలులకు స్వాతంత్ర్య మిచ్చినచో అపకారమే సంభవించునట్లు సాహిత్యశ్రీని ఆరాధించుటకు అందరూ అర్హులు కారు. తగిన సామర్థ్యము లేనప్పుడు స్వాతంత్ర్యము ఎట్లు స్థిరము కాదో సముచితమగు సహృదయత లేనిచో సాహిత్యము చెడును. పట్టుదలతో సేవింపజాలిన "బలా దాకృష్యమాణా చేత్ సరసా విరసా భవేత్" అన్నమాట వారలయందు రూఢమగునేమో! నవోఢవలె సాహితీకన్య నవ్యరూపాలలో అవతరించినపుడు సూక్ష్మదృష్టితో పరిశీలించినగాని పర్యవసానము పరిజ్ఞాతముకాదు.

యుగప్రభావమునుబట్టి స్వాతంత్ర్యదీప్తులు నలుమూలల ప్రకాశించునట్లు కాలభేదముచే సాహిత్యములో నవస్ఫూర్తి రాకమానదు. అవస్థా, కాల, దేశ

ప్రభేదాల సాహిత్యమును ఆనందవర్ధనాచార్యులు నిరూపించియేయున్నారు. కొంతకొంత నవ్యసాహిత్యము కొన్ని ప్రత్యేకాభిప్రాయములతో వెలువడుచున్నది. ఆ ప్రత్యేకదృష్టి తెలుసుకొనినగాని ఆ సాహిత్యము అర్థముకాదు. అందరికి అర్థంకాని కారణాన ఆ కవిత్వమును నిందించువారు లేకపోలేదు. కాలక్రమాన భావకులు సహృదయులైనపుడు ఆ విశేషమును గ్రహింపగలుగుదురు.

సాహిత్యములోకూడ నవ్యత కలదా? అని కొందరాక్షేపించిన మాటలు తిరస్కరణీయము లని సిద్ధాంతము లైనవి. ప్రాచీననవీను లుభయులూ చేతనాచేతనములను వర్ణించుచుందురు. అందు సామాన్యవిశేష భావమును పురస్కరించుకొని నవ్యతను నిరూపిస్తారు. ప్రజాసాహిత్యమును ప్రధానంగా పరిగణించుకొన్న భావకులు సాహిత్యస్వాతంత్ర్యమును హృదయపీఠాన హత్తుకొంటారు. సాహిత్యములో వ్యంగ్యమును ఆధారముగ చేసుకొని వైచిత్ర్యము రాణించును. ఈ వ్యంగ్యప్రధానముగు భావగాంభీర్యమును చూపే శబ్దజాలమే సాహిత్యంలోని స్వాతంత్ర్యసంపుటి. ఇతరములందు ఈ విశిష్టత గోచరింపదు. అందుకనే గ్రామీణశృంగారమును చిత్రించే హాలుని కవితాప్రవాహమును నవ్యసాహిత్యారాధకులు శిరస్సున ధరిస్తారు. "ప్రియే జనే నాస్తి పునరుక్తిః" అన్నట్లు సాహిత్యమును ఎన్నిసార్లు ఎట్లా నిబంధించినా నవంనవంగానే కన్పడుతుంది. ఉపాసించినకొలదీ స్వాతంత్ర్య మతిశయించును.

సాహిత్య మనంతము. అం దాద్యంతములు కన్పడవు. జగత్తువలె వాఙ్మయసాహిత్యములు పరిణామమును పొందుచూ వుండవలసినదే. పరిణామము లేకపోతే ప్రకృతికి పరిమళమే లేదు. నాటి, నేటి సాహితీసౌభాగ్యమును పరిశీలించి స్వాతంత్ర్యమును సంపాదించిన సహృదయులందరూ సాహిత్యములోని స్వాతంత్ర్యసేవకు సంసిద్ధులు కావాలని మా భావకుల భావన. స్వతంత్రప్రభుత్వముకూడ సాహిత్యమునకు స్వాతంత్ర్యమును గల్పించి ప్రజలకు స్థైర్యమును గల్పించవలయును. ఆనాడే "ఆనందమయం జగ దిదం సర్వమ్."

యమ్. యస్. రంగారావు.

---

# గద్యరచనావశ్యకత

ఆంధ్రసాహిత్యప్రపంచంలో పద్యరచనకు ప్రాధాన్యం యెక్కువగా యివ్వబడింది ఆ రోజుల్లో. గద్యగ్రంథాలకు, గద్యరచయితలకు తగినంత ప్రోత్సాహం జరుగలేదేమో అనిపిస్తుంది. కారణం, పూర్వం కవికి గౌరవం, రాజాదరణ చాలా జరగడమే. గండపెండేరములు, రాజుల కేలూతలతో మదకరీంద్రము లెక్కడం, "కోకటగ్రామాద్యనేకాగ్రహారంబు లడిగిన సీమలందు" దొరకడం, కనకాభిషేకాలు, అందలంబు గొడుగు లసెపంబు మేల్కట్లు, నిరుపహతిస్థలంబు, రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు కప్పురవిడెము, ఆత్మకింపయిన భోజనము, వుయ్యెలమంచము—ఇత్యాది సన్మానాలు, సదుపాయాలు లెక్కలేనన్ని కలిగినవి. ఇంతకూ కారణం వారు కవులు కావడంవల్లనే. 'కవి' యెవరని ప్రశ్నించేసరికి "కందము వ్రాసిన కవి, పందిని పొడిచిన బంటు" అని ప్రమాణంలాంటి సామెతను విసిరేశారు. అంతే. ఈ కందదురద సాధారణంగా ప్రతివారికీ అంటుకొన్నది. తమతమ దురద (కవి గావలె నని) కొద్దీ చాలామంది కవులు కందపద్యాలే వేలకొద్దీ గోకిపారేశినారు. "కందంబులు, రసవన్మాకందంబులు" అని యొక కవి తన కందసరుకునుగూర్చి కవితాబజారులో చెప్పుకొన్నాడు. "గంటకు నూరు పద్దెములు గంటము లేక రచింతు" అని మరియొక కవి గుండెలు తట్టుకొన్నాడు. వచనమువంకకు మరలినవారే లేరు.

"నిరంకుశాః కవయః" అని చెప్పుకొన్నా, కవికి ఆ నిరంకుశత్వం తన వ్యక్తిగతజీవితంలోనో, లేక కొన్ని కవితాప్రయోగాల (Poetic Licence) పట్లనే చెల్లింది. కాని కవి తన కవితాజగత్తులో పద్యపాదాలతోనే నడిచినాడు. ఛందోనియమబద్ధజీవితమునే గడిపినాడు. రాజాశ్రయకారణంవల్ల, వారి మనఃప్రవృత్తుల కనుగుణమైన రచనయే సాగి, ఈ నీతినియమాలు మరీ యెక్కు

వగా పాటింపబడినవి. మచ్చుకు : వృత్యంతాలకు కంద పద్యం కచ్చితంగా పడితేరవలసిందే. మరొక వృత్తం మందుకుకూడా పనికిరాదు. మాలిని, మహాస్రగ్ధరలు లేకుంటే మహారాజుల పొగడ్తలు (ఆశ్వాసాంతంలో చాలవరకు) సాగేవి కావు. ఇక నాయకులు విలాస పురుషులు కాబట్టి ఆటవెలదులనిర్వాహం అనర్గళంగా సాగింది. వారు పువ్వులాంగళ్లు కాబట్టి చంపకోత్పల మాలలు కట్టి యిచ్చి సన్మానాలు పొందినారు. వారి వేటలకు శార్దూలమత్తేభములు, వినోదాలకు మత్తకోకిలలు సృష్టించినారు. ఇవిగాక కవీశ్వరులు తమ కృతిపతుల చెవులలో పోసిన సీసము(ల)నకు మితిలేదు. అందులో కొందరి సీసానికి పంచేబంగారాలకన్నా యెక్కువ 'కనకాభిషేకం'గాకా వచ్చింది.

ఇది పూర్వుల స్థితి. ఆధునికుల విషయం చూస్తే వచనరచనాప్రాధాన్యము గుర్తింపబడుతున్నదని చెప్పవలసినా, చాలామటుకు ప్రాసపద్యాలకంటకే మొగ్గుతున్నదనికూడా సందేహింపవచ్చును. ఛందోనియమాలను చంపియైనా, పద్యం వ్రాస్తానంటారేకాని, చక్కని గద్య వ్రాస్తే చిన్నతన మనుకొంటారు కొందరు ఆధునికులు. గద్యంవంటి పద్యాలను వ్రాసి గర్వ పడతారేకాని, అంతకన్నా బాగా తెలిసేరీతిగా గద్యంలోనే రచన సాగించిన బాగుండు నని గుర్తింపరు నేటి అభ్యుదయరచయితలు. యతిప్రాసలు పట్టక మతి పోగొట్టుకొనే యువకవులు చాలామంది సాఫీగా సాగి పోయే చక్కని వచనరచనవంక దృష్టి మరల్చిన తరించిన వారౌతారు.

అయితే, వచనవాఙ్మయం మనకు లేదా? అని ప్రశ్నించుకొంటే పూర్వముకన్నా ఆధునికయుగం లోనే యెక్కువ కృషి జరిగిందని చెప్పవలసివస్తుంది. ఆరోజుల్లో ఉత్తమశ్రేణికి చెందిన వచనగ్రంథాలు యే కొద్దిగానో వుండియుండవచ్చును. కాని యీనాటి 'నిర్వచన'గ్రంథాల మోజులో, ఆ శాఖలో కృషి తక్కువే అని యోచించవలసివచ్చును. అప్పటి గ్రంథాలలో ఆశ్వాసాంతంలో కొంచెం గద్య, వృత్యంతాలు కాగానే "అభ్యుదయపరంపరాభివృద్ధిగా నా యొనర్పం బూనిన యిమ్మహాప్రబంధమునకుం గథాక్రమం బెట్టి దనిన" అని కొంత గద్య అచ్చటచ్చట అతుకులకు, కథాగమనాన్ని యెక్కువ చేయుటకు "అంత, అయ్యవసరంబున, అనఘుడు, నావుడు"-మొదలగు వాక్యాలు, మరి కొన్ని చోట్ల తమ పాండిత్యప్రదర్శనకు గాను, సంస్కృత పదాలతో కూడిన దీర్ఘసమాసాలతో 'కొంపవీటి చాంద్రాడు' వంటి క్లిష్టరచన కనబడుతుంది. అది చదివేసరికి, గులకరాళ్ళమీద బండి నడిచేటట్లు కటకట లాడుతూ పూర్తిచేరేగాక యెక్కడికక్కడే అగమ్యగోచరంతటి పరిస్థితి కలుగుతుంది.

ఆధునికులు ఈ సంప్రదాయం కొంత తగ్గించి ఆదిలో వచనరచనకు నాందులు పెట్టినారు. ఇప్పటికీ చిట్టెం గోయిలా కనబడుతూన్నా, చిన్నయసూరి వచనం ఆ నాటికి వ్యాకరణపు అనుసరణప్రయత్నం కాస్త సడలించిం దనే చెప్పవలసివస్తుంది. వీరేశలింగంగారు, సింహత్రయం వారు వుత్తమవచనగ్రంథాలను అందిచ్చి, గొప్ప విస్తరం కలిగించినారు. "చాకిరేవుపుస్తకమున్నా చంపకమాల వృత్తాలేనా?" అని సాహిత్యోపన్యాససందర్భంలో పాను గంటిసింహం గర్జించింది. ఒకవంక గిడుగువారి పిడుగు వలె పూర్వాచారాలమీద విరుచుకుపడి, వ్యావహారిక భాషావాదం లేవదీసి తెనుగువచనానికి తీరుతెన్ను కలిగించినారు. ఇటువంటి పెద్దల పలుకువల్లనే వచనరచన విరివిగా సాగి, నేటి తెనుగువచనం "వేయిపడగలు" దాల్చియున్నది. అయితే యింతటితో ఆగవలెనా అన్నది ప్రశ్న. ఆగరాదు. కాలప్రవాహంతో సమా నంగా యీదుకుపోవడానికి పనికివచ్చే చక్కని గంగా ప్రవాహంవంటి వచనరచన ఇంకాఇంకా జరగాలి.

పద్యంలో నడిస్తేనే కవిత్వం కాదు. తెనుగు నోట వెలువడే ప్రతివాక్యమూ రసాత్మకమే. "వాక్యం రసాత్మకం కావ్యం" అంటే అదీ అర్థం. దీనిని గుర్తించడం మన విధి.

ద. శ్రీ. వెంకటరామయ్య.



# విమర్శనము



## యోగమూలము

రచయిత: శ్రీ అరవిందులు. అనువాదకులు: పి. బాలయ్యశ్రేష్ఠిగారు, బి. ఏ., బి. యల్. ప్రకాశకులు: శ్రీ అరవిందలైబ్రరీ, ఎస్ప్లనేడు, మద్రాసు. వెల రూ. ౨.

'Basis of Yoga' అను అరవిందయోగి ఆంగ్ల గ్రంథమునకు ఇది అనువాదము. కొందరు యోగసాధకులు తమ సాధనలయందు కలిగిన సందేహములను శ్రీవారికి వ్రాసికొనగా, వారు లేఖలరూపమున నిచ్చిన యుత్తరము లిందలి విషయము. యోగమార్గమున పోవు పడుచున్న సాధకులకు ఈ 'యోగమూలము' మిక్కిలి ఉపయోగకరమైన గ్రంథము. యోగమునుగురించి శ్రీ అరవిందులకు గల ముఖ్యభావములన్నియు దీన చక్కగా వెల్లడింపబడినవి. అనువాదముకూడ సరళముగా నుండి మూలగ్రంథము చదివిన అనుభూతిని తెలుగున ధారావాహికగా సాగియున్నది.

---

## అరవిందార్చన

వ్యాససంపుటి. ప్రకాశకులు: చతుర్వేదుల వెంకటకృష్ణయ్యగారు, శ్రీ అరవిందాశ్రమము, పుదుచ్చేరి. వెల రూ. ౧-౮-౦.

మొన్న ఆగష్టు ౧౫-వ తేదీకి శ్రీ అరవిందుల వారికి ౭౮-వ సంవత్సరము నిండి ౭౯-వ సంవత్సరము ప్రవేశించినది. శ్రీవారి ఆ జన్మదినసందర్భమును పురస్కరించుకొని, 'సముద్రునకు సముద్రజలముచే అంజలి కొందినంత తీసికొని అర్ఘ్యమిచ్చునట్లు శ్రీ అరవిందుల అనంతదివ్యోపదేశము లను పుష్పావళినుండి', కొన్ని పుష్పముల నేరి, వానికి ఆంధ్రానువాదరూప మిప్పించి, ఆ అన్నిటిని ఒక చక్కని మాలగా కూర్చి, దానితో శ్రీ అరవిందులవారి కిచ్చిన అర్చన ఈ సంపుటి. ఈ ఆంధ్రానువాదమునకుగూడ ప్రకాశకులకు సుప్రసిద్ధులైన ఆంధ్రరచయితలే దొరికియుండుట ఇందలి మరియొక విశేషమనవచ్చు. శ్రీ అరవిందులవారి జీవితమును, జీవితపరమార్గమును, వారి యోగసాధనవిశేషములను, చూచాయగా తెలిసికొనుటకు ఈ వ్యాసములన్నియు ఎంతయినను తగియున్నవి. సంపుటిప్రారంభమున గల 'హిరణ్మయపురుషుని' త్రివర్ణచిత్రము భావోత్తేజకముగా నున్నది. అరవిందాశ్రమవిశేషములను తెలుపు మరికొన్ని చిత్రములుగూడ ఈ సంచికకు అంద మిచ్చుచున్నవి.

# గ్రంథ స్వీకారము

## భారతరాష్ట్ర సంఘటన

భారతీయరాజ్యాంగవ్యవస్థలో కొంతిభాగమునకు, ముఖ్యముగా, సంస్కృతములో కానవాదము. అనువాదకులు: సి. కున్హన్ రాజాగారు. ప్రకాశకులు: థియసాఫికల్ పబ్లిషింగ్ హౌస్, అడయారు, మద్రాసు. వెల ౮ అ.

## స్వతంత్ర భారతి

౧౮౫౭ మొదలు ఇప్పటివరకు జరిగిన భారత దేశస్వాతంత్ర్యసమరచరిత్రను, స్వాతంత్ర్య ప్రాప్తి తరువాత ఇటీవల నడచిన విశేషాలను వివరించుచున్న బుర్రకథ. గ్రామగ్రామంలోనూ కాంగ్రెసువాణిని ప్రచారము చేయుటకు ఇటువంటి కథలూ, కలాపాలూ చాలా పనికివచ్చును. రచయిత: ప్రయాగనరసింహశాస్త్రిగారు, బి. ఏ., ౪, మునియప్పిళ్లె వీధి, కోమలేశ్వరంపేట, మద్రాసు—౨. వెల అ. ౨.

## జగన్నాయక శతకము

రచయిత: జటావల్లభుల వెంకటేశ్వర్లుగారు. ప్రచురణకర్త: వీరంరెడ్డి వసంతరాయుడుగారు, అచ్చంపేట.

## జాతీయ గీతములు

రచయిత: ఆర్. వి. శ్రీరాములుగారు. ప్రకాశకులు: రాయలు అండు కో., కడప. వెల లేదు.

---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press.
No. 7, Thambu Chetty St., G. T., Madras. Editor: S. Sambhu Prasad




# లిప్టన్స

## అంటే అర్థం
## మంచి టీ

